ఆది పరాశక్తి

# శ్రీ ప్రత్యంగిరా పరమేశ్వరి మందిరము

కుర్తాళ శ్రీ సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానము (ఆంధ్రప్రదేశ విభాగం)

రోడ్ నం. 1, శ్రీ రామకృష్ణాపురం, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ - 35

ఫోన్ : 9849160706, 2403 5375




ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా ప్రతిష్ఠించబడిన (ఆదిపరాశక్తి)

శ్రీ మహా ప్రత్యంగిరా పరమేశ్వరి దేవాలయం



దేవి జ్యోతిక సమర్పించు
సాంబశివ క్రియేషన్స్

యలమంచి త్రిపురాంబ ఆశీస్సులతో..
యలమంచి నాగరాణి నిర్మాణ సారథ్యంలో

త్వరలో

# మాయగాడు



యలమంచి రవిచంద్ చక్రి దిలీప్ పోలన్

# మనసున ఉన్నదీ...



★ 'ఆకలికి, అన్నానికి కులమేంటి, మతమేంటి? ', 'గట్టుమీద కూర్చున్నవాడు మహారాజైపోతున్నాడు..చేలోదిగి చెమటోడ్చినోడు తిండిలేక చెదపట్టిపోతున్నాడు', 'కలసివుంటే నిలిచివుంటాం, చీలిపోతే కూలిపోతాం', 'కాపురం చేసే కళ కాలిగోటి దగ్గరే తెలుస్తుంది', 'మెట్లమీద జారిన చెంబు ఎక్కడికి చేరుతుందో ఎవరికి తెలుసు' వంటి నగ్న సత్యాలు, హితోక్తులు, అందమైన సామెతలతో పండిన నవల 'కొత్తచిగురు'. చిరువాక్యాలతో దాశరథి రంగాచార్యుల రచనారీతిని తలపించే వాక్య నిర్మాణ చాతుర్యంతో, ఆర్ద్రంగా, హృద్యంగా, ఏకబిగిన చదివించే తీరున సాగిన రచన ఇది. కథ ఎత్తుగడ, కథనం, ముగింపు ముచ్చటగా సాగి పాఠకులను ఆద్యంతం ఆకట్టుకున్న నవలను అందించిన రచయిత సింహప్రసాద్‌కు, చతురకు అభినందనలు.

–రమణమూర్తి, కాకినాడ

★ రైతుల జీవితాలను అతి దగ్గరగా, వాస్తవికతావాదంతో చిత్రించిన తీరు 'కొత్తచిగురు' నవలలో అమోఘంగా ఉంది. రైతులు నమ్ముకున్న భూమి వారికే ఇంత తిండి పెట్టకపోవడమనేది విచారకరం. డబ్బుకోసం బంధాలు, అనుబంధాలు కనుమరుగైపోతూ మనిషి ఎంతటి నీచానికైనా తెగిస్తాడనేదానికి నిదర్శనంగా రజియాను అరబ్ షేకులకు అమ్మాలనుకోవడం సమాజం ఎంత పతనావస్థను చేరుకుందో తెలియజేస్తుంది. అలాగే కార్పొరేట్ విద్యా విధానంవల్ల జరుగుతున్న దారుణ పరిణామాలను కళ్లకు కట్టినట్లు వివరించిన తీరు మనసుకు హత్తుకుంటుంది. చాలా మంచి నవలను అందించిన రచయితకు, ప్రత్యేకంగా చతురకు కృతజ్ఞతలు.

– శ్రేష్ఠి శేషగిరి, సికింద్రాబాద్

★ నిండు పున్నమి చందమామకు రంగులు అద్దినట్టు బంగారుతల్లి ముఖచిత్రంతో మార్చి నెల చతుర చైత్ర పాడ్యమిలా.. వసంత శోభలా ఎంతగానో అలరించింది. కాలాతీతం శీర్షికన బ్రాంస్టోకర్ నవల 'డ్రాకులా' పరిచయం కెవ్వుమనిపించేలా, మూడో కవర్ పేజీలోని వారెవ్వా ఫోటోలు వావ్ అనిపించేలా ఉన్నాయి. రైతుల దీనస్థితికి దర్పణం పట్టిన 'కొత్తచిగురు' నవల ఆద్యంతం ఆకట్టుకుంది.

–మంత్రి లక్ష్మినారాయణ, సిరిసిల్ల

★ జ్ఞానపీఠాలులో క్లుప్తంగా, సమగ్రంగా గొప్ప కవుల, రచయితల ప్రత్యేకతలను తెలియజేస్తున్నారు. అలాగే కాలాతీతంలో ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయం కూడా చాలా బాగుంది. ఇక కందుకూరి వీరేశలింగం పంతులు చతురోక్తులు ఆసక్తికరంగా చదివించాయి. ఆయన జీవిత విశేషాల గురించి కొత్త విషయాలను తెలుసుకున్నాం.

–డి.పుష్పలత, వ్యవసాయ విశ్వవిద్యాలయం, బెంగళూరు

★ మార్చి నవల 'కొత్తచిగురు' కథ రైతులదే అయినా ముగింపు వెరైటీగా ఉంది. కలకాలం గుర్తుపెట్టుకోదగిన వాక్యాలు అనేకం ఉన్నాయి. 'వ్యవసాయమే ఒక జూదమయితే, రొయ్యల సాగు మాయాజూదం', 'మళ్లీ భూమిలో నన్ను నేను విత్తనంగా విత్తుకుంటాను, మొలకెత్తుతాను, ఎదుగుతాను' లాంటి వాక్యాలు అద్భుతంగా ఉన్నాయి. రచయితకు నవలా రచనలోగల చేయితిరిగిన అనుభవం అడుగడుగునా కన్పిస్తుంది.

–బి.విజయ, హైదరాబాద్

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
vipula.chatura@gmail.com

సంపుటి -33
సంచిక - 3
ఏప్రిల్ 2010
387వ సంచిక

# చతుర





ముఖచిత్రం : మమతా మోహన్‌దాస్
ముఖపత్రాలంకరణ : రాజుయాట

'ఒకావిడ మతిస్తిమితం లేనివారికి ఆశ్రయమిచ్చింది' అంది పద్మజతో జంతు ప్రేమికురాలు సునీత. 'లాభం లేకుండా ఇలాంటివి ఎవరైనా చేస్తారా?' అంది సునీతను పూర్వపక్షం చేస్తూ పంకజం. 'అదేంటండీ! ఈ లోకంలో మంచే లేదంటారా?' సునీతకు వత్తాసుగా అంది పద్మజ. 'జంతువుల పేరుచెప్పి సునీత లాంటివాళ్లు, పిచ్చోళ్ల పేరుచెప్పి మరో ఆవిడా డబ్బు దండుకుంటున్నారు' అంటున్నప్పుడు పంకజం కళ్లలోకి చూసిన పద్మజ ఎందుకు భయపడింది? విభిన్న మానసిక ప్రవృత్తులను అద్భుతంగా చిత్రించిన

**లక్ష్మీరమణ కుమారి ఇల్లు**

6వ పేజీలో..

బొమ్మలు : బాలు

అద్దెకొంపల్లో అవస్థలుపడుతూ బతుకీడ్చడం నచ్చని ఆమె ఎన్నో వ్యయప్రయాసలకోర్చి ఊరిచివర ఓ చిన్నగూడు ఏర్పాటుకు శ్రీకారం చుట్టింది. గూండాలు బెదిరించినా వెనకడుగు వేయలేదు. స్వయంగా పునాదులు తవ్వి కట్టుకున్న ఆమె ఆశల సౌధాన్ని కబళించాలని ఎందరో ప్రయత్నించారు. కూతురి పెళ్లికి కట్నంగా ఇవ్వమని ఒత్తిడి చేశారు వియ్యాలవారు. ఓ స్వామీజీ సైతం ఇంటిని అమ్మేయమని ఆమెను వేధించాడు.

వారందరినీ కాదని పట్టుబట్టి నిలబెట్టుకున్న ఆ ఇల్లు ఆమెకు చివరికి ఏం మిగిల్చింది? మధ్యతరగతి ఇల్లాలి మనస్తత్వానికి చిత్రిక పట్టిన శ్రీమతి మునిపల్లె లక్ష్మీరమణ కుమారి **ఇల్లు**
చతుర ఏప్రిల్ కానుక

# ఇల్లు

-మునిపల్లె
లక్ష్మీరమణ కుమారి



**సా**యంత్రం ఆరు గంటల సమయం. చెట్లకి నీళ్లు పోస్తోంది పద్మజ.

ఆ ఇల్లంటే పద్మజకి ప్రాణం. ఆ చెట్లన్నీ ఆమె నేస్తాలు.

"ఇల్లు ఇల్లని అంత బాధ పడిపోతావు. అదో రెండు గదులూ, వంటిల్లూ, హాలూ ఉన్న చిన్న ఇల్లు. అదేమన్నా బకింగ్ హామ్ ప్యాలెస్సా? ఎందుకమ్మా దాని మీద అంత మమకారం? " అంటారు పిల్లలు.

"ఎవరి ఇల్లు వాళ్లకి ప్యాలెస్సే. ఎవ రింట్లో వాళ్ళు మహారాజులు, మహారా ణులు" నవ్వేస్తుంది పద్మజ.

ఇంట్లో ఉన్న ప్రతి ఇటుకా, ప్రతి ఇసుక రేణువూ ఆమెకి గుర్తే. కాంపౌండ్‌లో ఉన్న ప్రతి చెట్టూ పద్మజ స్వయంగా నాటి, పెంచి, పోషించిందే.

ఇంటిముందున్న కాంపౌండ్‌లో గేటుకు రెండువైపులా సన్నజాజి, విరజాజి తీగెలు విరబూసి ఉంటాయి. గేటు తీసి లోపలకు రాగానే మల్లె, లిల్లీ, చేమంతి, బంతిపూల చెట్లు, రకరకాల క్రోటన్స్ మొక్కలు ఉంటాయి. వెనక పెరట్లో అరటిచెట్లు, పన సచెట్లు, మామిడి, జామ, కొబ్బరి చెట్లు న్నాయి. ఇంటికి వచ్చిన వాళ్ళకి బొట్టు పెట్టి పంపేటప్పుడు ఇంట్లో కాసిన పండు చేతిలో పెట్టకుండా పంపదు పద్మజ. అంతా ఆ ఇంటిని చూసి పొగుడుతుం టారు. అది ఇల్లు కాదు, పొదరిల్లు అంటారు. నిజమే. చక్కటి రంగులతో మెరిసిపోయే ఆ ఇల్లు నిజంగానే బొమ్మ రిల్లులా, చక్కటి పొదరిల్లులా ఉంటుంది. ఇంటి చుట్టూ తోట పెంచుకోవటం, దాని మీద మమత పెంచుకోవటం, ఎవరికైనా ఉండేదే. సొంత ఇంటి మీద కూడా ఎవరి కైనా మమకారం ఉంటుంది. కానీ పద్మ జకి ఆ ఇంటిమీద మమకారం ఉండటానికి వేరే కారణం కూడా ఉంది.

చాలాకాలం క్రితం, కొన్ని దశాబ్దాల క్రితం, పద్మజకీ, హరనాథ్‌కీ పెళ్లి జరి గింది. అత్తగారు వరలక్ష్మి కష్టపడి పిల్లల్ని పెంచి పెద్దచేసిన మనిషి. ఆవిడ పద్మజని చక్కగా చూసుకునేది. ఇంటిపనీ, వంటప నిలో సాయపడేది. హరనాథ్ చిరుద్యోగి. జీతం చాలక నానా తంటాలూ పడేవాళ్లు. ఇంతలో ఇద్దరు పిల్లలు కూడా పుట్టారు.

డబ్బు చాలక చాలా ఇబ్బంది పడుతు న్నారు. పద్మజ ఖర్చులు ఎంత తగ్గించినా బాధలు తప్పటంలేదు.

పద్మజా, వరలక్ష్మీ కూర్చుని ఆలోచిం చారు. అన్నిటికన్నా పెద్ద ఖర్చు ఇంటద్దె.

"సొంత ఇల్లు ఉంటే ఈ ఖర్చు తప్పిపో తుంది. మనింట్లో మనం ఉంటే హాయిగా బతకొచ్చు. తిన్నా, తినకపోయినా అడిగే వాళ్ళుండరు. నెలకి ఇంతింత అద్దె పెట్టు కుని ఉండటం దేనికి? సొంత ఇల్లు కట్టు కుంటే పోతుంది కదా" అంది పద్మజ.

హరనాథ్ హడలిపోయాడు.

"అది తీరని కల" అన్నాడు.

అప్పట్లో గృహరుణాలు ఇంత విరివిగా ఎవరూ ఇచ్చేవాళ్ళు కాదు. అప్పు పుట్టడం చాలా కష్టం. మధ్య తరగతికి ఇంకాస్త దిగువనే ఉన్న పద్మజ దంపతులకి సొంత ఇల్లు నిజంగానే ఒక తీరని కల. కానీ పద్మజ పట్టుదల గల మనిషి. నిజానికి పట్టుదల తప్ప వాళ్ళకి ఆ రోజుల్లో ఇంకో ధనం ఏదీ లేదు.

"తీరని కల అనుకోవటం దేనికీ? తీరే మార్గం ఉందా లేదా అని ఆలోచించాలి. అన్ని ప్రయత్నాలూ చేశాక అప్పుడు ప్రయత్నం మానుకోవచ్చు కానీ ముందే నా వల్లకాదు అని ఊరుకోవటం చేతకాని వాళ్ళ పని" అంది.

"ఆరంభించరు నీచ మానవుల్ అన్న పద్యం నాకూ తెలుసు. సరే. నేను నీచు డ్నని ఒప్పేసుకుంటాను. నా వల్ల కాదు"

అన్నాడు హరనాథ్.

"మీకు ఆఫీసు పనితోనే సరిపోతుంది. ఇంక ఇంటికోసం ఏం తిరుగుతారు? నన్ను నమ్మి నాకు అప్పగిస్తే, నేను స్థలం కోసం చూస్తాను" అంది పద్మజ.

"నా ఇంటి మహాలక్ష్మివి. నువ్వు చూస్తానంటే వద్దంటానా? సరే. నీ ఇష్టం. మన జీతం, ఖర్చులూ అన్నీ నీకు తెలుసు కదా. దానికి తగ్గట్టు ఏదన్నా వెతుకు. నీవేం చేసినా సరే" అన్నాడు హరనాథ్.

పద్మజ స్థలం వేట ప్రారంభించింది. అప్పుడు హైదరాబాద్ చుట్టుపక్కల బోలె డంత స్థలం ఉంది. ప్లాట్లు చేసి అమ్ముతు న్నారు. పద్మజ తన స్నేహితులతో కలిసి కొన్నిచోట్ల చూసి వచ్చింది. ఒక్కత్తే వెళ్ళి కొన్ని చూసి వచ్చింది. ఏదో కష్టపడితే రెండు వందల గజాల స్థలం కొనేయ వచ్చు కానీ ఇల్లు కట్టడం మాత్రం కష్టమే.

పద్మజ ఇంకేం ఆలోచించదల్చుకోలేదు. ముందు ఇంటిస్థలం కొంటే చాలు. ఆ తర్వాత సంగతి తర్వాత. ఏదో రెండు గదులు వేసుకోలేకపోమా అనుకుని తీవ్రంగా ప్రయత్నిస్తోంది.

స్నేహితులకి అంత పట్టుదల లేదు. వాళ్ళు కొంటే కొందాం లేకపోతే లేదు అన్నట్లున్నారు.

"ఎటుచూసినా ఖాళీస్థలం తప్ప ఇంకేం కనిపించటంలేదు. ఎందుకొచ్చిన గొడవ. దొంగలు పడి చావగొట్టినా దిక్కులేదు".

"అంతదూరాల్లో పంపు నీళ్ళు రావు. మాకు బావినీళ్ళు పడతాయో లేదో? "

"ఏమీ దొరకవు. అన్నీ కొనుక్కుని పెట్టు కోవాలి" అంటూ విమర్శలు చేసేవాళ్ళు.

పద్మజ అవన్నీ పట్టించుకోలేదు.

"అవే డెవలప్ అవుతాయి. కొన్నిచోట్ల క్రితం ఏడాది లేని ఇళ్ళు చాలా వచ్చాయి. ధైర్యంచేసి కొనుక్కోవాలి" అంది.

"ఏం డెవలప్ అవుతాయో. కొన్నిచోట్ల అయిదేళ్ళ క్రితం ఏ ఇళ్ళు చూశామో అవే ఉన్నాయి. ఏమీ డెవలప్ కాలేదు" అంది ఒక స్నేహితురాలు.

"అవి డెవలప్ అయ్యేలోపల మనం ఒక్కళ్ళం ఉండాలి కదా. ఎందుకొచ్చింది? ఈ లోపల దొంగలు తన్నిపోరని గ్యారంటీ లేదు కదా. ఏదో సొంత ఇల్లని అంతంత దూరాలు వెళ్ళి అన్నన్ని కష్టాలు పడి బతి కేకన్నా సెంటర్లో ఒక్క గదిలో ఉన్నా చాలు. మనం ఎట్లాగో బతికేసినా పిల్లలు కష్టపడాలి కదా. వాళ్ళు స్కూల్‌కి పోవా లన్నా బోలెడు దూరం రావాలి".

"పిల్లలకీ కష్టం సుఖం అలవాటు చేయాలి"

"ఏం చెయ్యటమో. వాళ్ళు పెద్దవాళ్ళ య్యాక ఎట్లాగూ కష్టం సుఖం తెలుసుకుం టారు. మనం చూస్తూ, చూస్తూ వాళ్ళని కష్టపెట్టటం దేనికి? "

పద్మజ చివరికి ఒక్కత్తే వెతుక్కుంది. ఆ ప్రయత్నాల్లో కొన్ని బెదిరింపులూ, హెచ్చరి కలూ కూడా ఎదుర్కొంది.

ఒక చోటికి వెళ్తే గూండాలు బెదిరిం చారు. ఆ స్థలం యజమాని తమ తండ్రికి రాశాడని చెప్పి తరిమేశారు. ఇంకొకచోట అయితే ఎవడు కొంటాడో చూస్తానని కర్రలు పట్టుకుని రెడీగా కూర్చున్నారు.

అన్నీ ఎదుర్కొని మంచి స్థలం కోసం నిరంతరాన్వేషణ సాగించింది.

ఒకచోట చివరికి పద్మజకి బాగా నచ్చిన స్థలం కనబడింది. ధర అందుబాటులోనే ఉంది. దూరాన రెండు ఇళ్ళు ఉన్నాయి. ఒక కిలోమీటరు లోపే బస్‌స్టాప్ ఉంది. పిల్లలు కాస్త నడిచివెళ్తే అక్కడ్నుంచి కోఠీకి బస్సు ఉంది. ఆ తర్వాత కొన్ని ఇళ్ళు పడితే ఒకటొకటే అన్నీ వస్తాయి. కూరగా యలు, చెట్లు పెట్టుకొంటే ఇంట్లోనే బోలెడు కాస్తాయి. చుట్టూ గోడ కట్టేందుకు

ఎట్లాగూ డబ్బు ఉండదు. కాబట్టి, దడి కట్టేసి, ఏ బచ్చలి కూర లాంటిదో వేసుకో వచ్చు. కాస్త ఓపిగ్గా పనిచేస్తే ఎన్నో కూరలు పండించుకోవచ్చు. ఒక్క అరటి చెట్టు వేసుకుంటే చాలు. ఎన్నో వండుకో వచ్చు. ఏమేం చెట్లు పెట్టాలో ముందే ఆలోచించుకుని ఆనందించేసింది.

అక్కడ ఉన్న కాసిన్ని ఇళ్ళకే ఒక అసోసియేషన్ కూడా ఉంది. పద్మజ స్థలం చూస్తుంటే దాని హెడ్ సుబ్బారావు అక్కడికి వచ్చాడు.

"మీరు ఈ స్థలం కొనాలనుకుంటున్నారా? " అడిగాడు.

"అవును" చెప్పింది పద్మజ.

"మీరు ఉండటానికి కొంటున్నారా? ఇన్వెస్ట్‌మెంట్‌గానా? " అడిగాడు.

"ఉండటానికే కొంటున్నానండీ. ఎందుకని అట్లా అడుగుతున్నారు? "

"ఏంలేదమ్మా. ప్రతివాళ్ళూ ఇన్వెస్ట్‌మెంట్‌గా కొందామని చూసేవాళ్లే. ఆ స్థలాలు చూడండి. ఎప్పుడో అమ్ముడుపోయాయి. కానీ అంతా ఎక్కడో ఒకచోట ఇల్లు ఉన్నవాళ్లే. మంచిధర పలికితే అమ్ముదామని పెట్టుకుని కూర్చుంటున్నారు. దానివల్ల ఇక్కడ ఇళ్లు రావటంలేదు. ఇళ్లు కడితేనే కదా కాలనీ అభివృద్ధి చెందేది. ఎవరూ ఇళ్లు కట్టేవాళ్లు కాకపోవటంతో ఇదెప్పటికీ డెవలప్ కావటం లేదు" అన్నాడాయన.

"నా విషయంలో మీకా భయం అక్కర్లేదండీ. ఎట్లాగైనా, ఎంత చిన్నదైనా ఇల్లు కట్టితీరుతాను" అంది పద్మజ.

"అమ్మయ్య. ఆ మాట అన్నారు చాలు. మీకేమన్నా సాయం కావాలంటే చెప్పండి. నాకు చేతనైనంతలో చేస్తాను. నాలుగు ఇళ్లు పడితే కాలనీ అభివృద్ధి చెందుతుందని నా ఆశ" అన్నాడాయన.

ఇంటిల్లపాదీ వెళ్ళి మళ్లీ ఒకసారి చూసి వచ్చారు. "మీకు వెళ్ళి రావటం కష్టం. అయినా కొన్నాళ్లు సర్దుకుంటే ఇంకొన్ని బస్సులు వేస్తారు" అంది పద్మజ భర్తతో.

"నాదేం ఉంది? ఎట్లాగో వెళ్లివస్తాను. నిర్జనంగా ఉన్న కాలనీలో మధ్యాహ్నం నువ్వు ఒక్కదానివే ఉండగలవా? చూస్తే ఇప్పుడిప్పుడే ఏమీ ఇళ్లు వచ్చేట్లు లేవు" అన్నాడు హరనాథ్.

"ఏం పర్వాలేదు. అత్తయ్యగారు ఉంటారుగా. వెళ్లి రాగలనని మీకు ధైర్యం ఉంటే చాలు. నేను ఇంట్లో ఎట్లాగో ఒకలాగ ఉంటాను" అంది పద్మజ.

అడ్వాన్సు ఇచ్చి బేరం కుదుర్చుకున్నారు. నెలలోపలే స్థలం రిజిస్ట్రేషన్ అయిపోయింది. ఆ తర్వాత పద్మజ నిర్విరామంగా ప్రయత్నం చేసి, ఇంటి ప్లాన్ అప్రూవ్ చేయించింది. డబ్బు కూడబెట్టింది.

అసలు కథ అప్పుడు మొదలయింది.

సుబ్బారావు భార్యాపిల్లలూ మేం ఇక్కడ ఉండలేమని గొడవ పెట్టటం మొదలుపెట్టారు. నిజానికి అది కూడా సమర్థనీయమే. పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు. ఆడపిల్లకి పదమూడేళ్లు వచ్చాయి. పిల్లని ఒంటరిగా అంతంత దూరం బడికి పంపాలంటే తల్లిదండ్రులకి బిక్కుబిక్కుమంటున్నది. ఒకసారి ఇంట్లోకి పాము వచ్చింది. ఇంకోసారి దొంగతనం! ఇన్నాళ్ళూ సహించిన సుబ్బారావు కుటుంబం ఎందుకోగానీ ఇక సహించలేమంటూ ఎదురుతిరిగారు. ఇవి చాలక బందిపోటు దొంగలు వచ్చి ఊరు చివర కాలనీల్లో దోపిడీలు చేస్తూ, ఇళ్లవాళ్ళని చావగొట్టటం మొదలుపెట్టారు. అందర్నీ 'అక్కడ ఇల్లు కట్టండి బాబూ' అని బతిమాలిన సుబ్బారావు ఎవరికీ చెప్పకుండా అయినకాడికి ఇల్లు గుట్టుగా అమ్మేసుకుని వెళ్ళిపోయాడు. కనీసం ఇల్లు అద్దెకైనా ఇచ్చి ఉంటే అదో తీరుగా ఉండేది.

అక్కడ ఉన్నవే నాలుగైదు ఇళ్లు. కాస్త





# అడవిలో శివాజీ జయంతి




వినోబా, అతని సహాధ్యాయులు, అందరూ కలిసి ఒక సంవత్సరం శివాజీ జయంతిని జరుపదలిచారు. బడిలోగాని, ఊళ్లోగాని వీలుపడదని, అడవిలో చేయాలనుకొన్నారు. మరి బడికి గైర్హాజరైతే ఉపాధ్యాయుడు జరిమానా విధించవచ్చు. అందుకోసం తలా ఒక పావలా బిళ్ళను జేబులో ఉంచుకొని ఉపాధ్యాయుడు వేసే ప్రశ్నలకు నిజాన్నే చెప్పి, జరిమానా వేస్తే వెంటనే జేబులో నుంచి పావలాను తీసి ఆయన బల్లపై ఉంచాలని వినోబా తన సహాధ్యాయులకు బోధించాడు.



మరుసటిరోజు బడిలో వినోబా చెప్పినట్టే జరిగింది. ఉపాధ్యాయుడు వారి గైర్హాజరీకి కారణం అడిగాడు. శివాజీ జయంతిని అడవిలో జరుపుకున్నామని వినోబా చెప్పాడు. ఆ ఉత్సవం అడవిలోగాక బడిలోనే జరుపవచ్చు కదా అన్న ఉపాధ్యాయుడి ప్రశ్నకు, "బానిసత్వం చెలామణి అయ్యే చోట శివాజీ జయంతిని జరపడమా? " అని వినోబా ఎదురు ప్రశ్నించాడు. ఉపాధ్యాయుడికి కోపం వచ్చింది. "మీ అవిధేయతకు నేను జరిమానా విధించగలను తెలుసా? " అని బెదిరించాడు. వెనువెంటనే వినోబా తన జేబు నుంచి పావలా బిళ్ల తీసి ఆయన బల్లపై ఉంచి తన సీటుకెళ్లి కూర్చున్నాడు. సహాధ్యాయులూ క్రమశిక్షణ గల సైనికుల్లా వరుసగా వెళ్లి తలా ఒక పావలా ఆ బల్లమీద ఉంచి తమ తమ స్థలాలకు వచ్చి నిలబడ్డారు. ఆ ఉపాధ్యాయుడు నివ్వెరపోయి స్థాణువై నిలబడ్డాడు.

సందడిగా తిరిగే సుబ్బారావు లేకపోయేసరికి అది దాదాపు నిర్మానుష్యంగా అయిపోయింది. కాస్త దూరంలో చిన్న ఊరు ఉంది. అక్కడ అడిగితే మేస్త్రీలు, కూలీలు దొరుకుతారు.

కానీ పద్మజ దురదృష్టం. స్వార్థపరుల కన్ను ఆ స్థలాలమీద పడింది.

ఎవరూ కట్టకపోతే, ఎవరూ స్థలాల్ని కొనటానికి రాకపోతే, ఆ స్థలాల్ని చౌకగా కొట్టేసి, వీలైతే ఆక్రమించేసుకుని, లాభాలు ఆర్జించుకోవాలని వాళ్ల ఆలోచన.

అక్కడ పద్మజ తప్ప ఇంకెవ్వళ్ళూ కట్టేవాళ్లు లేరు. ఆమెకి పనివాళ్ళు దొరకకపోతే ఇల్లు కట్టటం కష్టం. కబ్జాదారులు ఊళ్ళోవాళ్లని బెదిరించారు.

"వాళ్ళకి కూలీల్ని గానీ, మేస్త్రీల్ని గానీ సప్లై చేయాలని చూస్తే జాగ్రత్త" అన్నారు.

పద్మజకి మేస్త్రీలు దొరకలేదు.

కూలీలు అసలు దొరకలేదు. కట్టటానికి మనుషులే లేరు.

చచ్చీచెడీ ఏదో రెండు గదులు వేసుకుని తలదాచుకుందామన్నా వీల్లేకుండా ఏమిటీ పరిస్థితి? మనుషుల స్వార్థం, వైషమ్యాలు తీరని వ్యధ కలిగించాయి.

ఎట్లాగ ఇల్లు కట్టుకోవటం?

ఏం చెయ్యాలి? ఏంచేసి వాళ్ళని ఒప్పించాలి? ఈ సహాయ నిరాకరణను ఎలా మాన్పించాలి? ఏమీ తోచక ఉక్కిరి బిక్కిరయింది.

ఊరివాళ్లు భయపడుతున్నారు. ఎవరూ తమ దగ్గర పనిచెయ్యటానికి రారు. పద్మజకి ఆ సంగతి బాగా అర్థమైంది.

ఇల్లు కట్టటానికి కావల్సిన ఇసుక, సిమెంట్, ఇటుకలు దూరంగా ఉన్న ఇంకో ఊరుకి వెళ్ళి కొనుక్కోవాలి. వాళ్లు ఎప్పుడు డబ్బులిస్తే అప్పుడు లారీలో పంపుతామన్నారు. కానీ మేస్త్రీగానీ, కూలీ గానీ లేకుండా ఇసుకా, ఇటుకా తెచ్చుకుని ఏం

లాభం? సిటీనుంచి కూలీల్ని తెచ్చుకునే స్థోమత పద్మజకు లేదు.

పద్మజ ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. తన స్నేహితురాళ్ళతో చెప్పుకుని బాధపడింది.

"ఏం చేస్తాం? ఎక్కడికి పోయినా ఏవో బాధలుంటాయి. కబ్జాదారులదే రాజ్యం ఈ రోజుల్లో. ఆ ఊళ్ళోవాళ్లు వాళ్ళకి భయప డటం సహజం. ఇక్కడ్నుంచి కూలీల్ని పట్టుకెళ్లి చేయించుకుంటే, తడిసి మోపెడ వుతుంది. భరించలేవు. మరి ఆలోచించి ఏదో నీకు తగ్గ ఉపాయం చూసుకో" అంది ఒక ఫ్రెండ్.

"ఇల్లు కట్టి చూడు, పెళ్లి చేసి చూడు అన్నారు. ఊరు చివర కట్టి చూడు అని దానికి జోడించాలి. మా బాబాయి కూడా శివార్ల అవతల బోలెడు డబ్బుపెట్టి ఇల్లు కట్టాడు. కడుతుండగానే ఇటుకల దగ్గ ర్నుంచీ ఎవరో దొంగతనం చేసేవాళ్లు. పూజచేసి ద్వారాలు పెట్టేవాడో లేదో ఆ ద్వారం ఎవరో తీసుకుపోయేవాళ్ళు. అయినా మొండిగా ఇల్లు కట్టాడు. ఎంత కని కాపలా కాస్తాడు? చచ్చీ చెడీ ఇల్లు ఎట్లాగో పూర్తి చేశాడు. గృహప్రవేశం అయ్యాక కొన్నాళ్లు ఇల్లు తాళం పెట్టాడు. వారం తర్వాత వెళ్ళి చూస్తే ఏముంది? " ఆవిడ ఊపిరి తీసుకోవటానికి ఆగింది.

"తాళం బద్దలు కొట్టారా? " పద్మజ ఆ త్రుతగా ప్రశ్నించింది.

"లేదు"

"మరి? "

"చెపితే ఆశ్చర్యపోతావ్? "

"చెప్పు" పద్మజకి సస్పెన్స్ భరించటం కష్టంగా ఉంది.

"అసలు తలుపే లేదు. ఇంక తాళం ఎక్కడుంటుంది? "

"అంటే? "

"ఆ తలుపు టేకు తలుపు. ఖరీదైందే. కనీసం సింహద్వారం అయినా గొప్పగా ఉండాలని టేకు ద్వారం చేయించాడు. ఆ తలుపు పీక్కుని పోయారు. నువ్వు నమ్ము తావో లేదో ఇంట్లో వేసిన కరెంట్ వైరింగ్ అంతా విప్పుకునిపోయారు. వాష్‌బేసిన్ కూడా తీసుకుపోయారు"

"మరి ఎట్లా బతకాలి అతను? అక్కడ ఉండే ఛాన్స్ లేదుకదా? "

"లేదు. ఎప్పుడో ఒకరోజు ఇంటికి తాళం పెట్టక తప్పదు కదా. ఇంత దారుణంగా ఎత్తుకుపోతుంటే ఎవరు మాత్రం బతకగ లరు? అద్దెకిద్దామన్నా ఎవరూ రాలేదు. వచ్చినా వచ్చే అద్దె చాలా తక్కువ! ఎంతో ఖర్చుపెట్టి అంతంత దూరాల్లో ఇల్లు కట్టు కోవటం వేస్ట్ అనిపిస్తోంది"

"దూరాల్లో ఇల్లు కట్టాలంటే చాలా ధైర్యం, డబ్బూ ఉండాలి. ఇంటిమీద పెట్టే పెట్టుబడికి తగ్గ ఫలితం ఉండదు. కానీ కొన్నాళ్ళు పోయాక రేట్లు పెరిగినప్పుడు మాత్రం ఆ ధరలు నిజంగానే సంతోషం కలిగిస్తాయి. ఇన్వెస్ట్‌మెంట్‌గా కొంటేనే స్థలాలూ, ఇల్లూ లాభం కలిగించేది"

"అంతా బాగానే ఉంది. కానీ ఇన్వెస్ట్‌మెం ట్‌గా స్థలాలు కొనే డబ్బు నాకెక్కడిది. తల దాచుకునేందుకు ఒక గూడు కావాలి. ఈ అద్దె ఇళ్లల్లో ఆంక్షలూ, వాళ్ళు ఖాళీ చెయ్యమన్నప్పుడు చెయ్యటం ఇవన్నీ నేను భరించలేకుండా ఉన్నాను"

"అందుకే మరి ఓపిగ్గా కట్టుకోమరి" పద్మజ ఫ్రెండ్ నవ్వేసింది.

ఇంక ఆ విషయం ఎవరికి చెప్పినా ఏం లాభంలేదని పద్మజకి అర్థం అయింది.

ఊళ్ళోవాళ్లకి ఎదురునిల్చి, కూలీల్ని పంపాలంటే ఎవరివల్లా కాదు. గొడవలు అవుతాయి. ఎందుకొచ్చిన గొడవ అని ఎవ రికి వారు ఊరుకుంటారు.

ఇది తన సమస్య. తనే చూసుకోవాలి. తనే పరిష్కరించుకోవాలి. అంతే. పద్మజ

అత్తగారితో కలిసి ఆలోచించింది.

"నేను పాలు పితికాను, పిడకలు కొట్టాను. మట్టి పిసికాను. పొలం పనులు చేశాను. నాది కాయకష్టం చేసిన జన్మ" అంది వరలక్ష్మి.

"నేనూ అంతే. మా ఇంట్లో ఉన్నప్పుడు నేనూ మా ఆవు పాలు పితకటం దగ్గ ర్నుంచి అన్ని పనులూ చేసేదాన్ని. కాయ కష్టం చేయటానికి నేనూ భయపడను" అంది పద్మజ.

అత్తాకోడళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. మర్నాడు ఆ ఊళ్ళోవాళ్ళు అంతా విస్తు పోయే సంఘటన జరిగింది.

నడుం బిగించి, చీరె కుచ్చెళ్ళు ఎగగట్టి అత్తా, కోడలూ కూలీపనిలోకి దిగారు.

ఇది ఎవరూ ఊహించలేదు.

పునాదికి సున్నంతో గుర్తులు తీశారు. పారా పలుగూ పుచ్చుకున్నారు.

ఒకళ్ళు తవ్వుతుంటే మరొకళ్ళు మట్టి ఎత్తిపోశారు. వాళ్ళకి కష్టపడి పనిచె య్యటం అలవాటే. కానీ అంత కష్టమైన పని చేస్తుండేసరికి చేతులు బొబ్బలెక్కి పోయాయి.

వాళ్ళు వెనక్కి తగ్గలేదు.

ఊరివాళ్ళు చూస్తూ ఉండగానే పునాది తవ్వారు. ఎండకి ఎండారు. బరువులు మొయ్యటానికి వెనుకంజ వెయ్యలేదు.

పద్మజకి పట్టుదల రోజురోజుకీ పెరుగు తోంది. కష్టపడుతున్నకొద్దీ ఆ పట్టుదల మరింతగా పెరుగుతోంది.

ఎన్ని అడ్డంకులు వచ్చినా వెరవకూడదు. ఇల్లు కట్టితీరాలి.

పునాదిరాళ్ళు మోయటం వీళ్లవల్ల కాదులే అనుకున్నారు అంతా. అత్తా, కోడలూ వాటిని సునాయాసంగా మోశారు.

తాపీ, దారం అన్నీ కొనుక్కుంది పద్మజ. ఏయే పాళ్లల్లో ఇసుకా, సిమెంట్ కలపాలో నేర్చుకుంది. పునాదిరాళ్ళు వేసి, తాడుతో సరిచూసి మధ్యలో మాల్ వేసి దానిమీద

## కొత్తగాలి...

**నాలో నువ్వు సగం**
**నేను సగం అన్నావు!**
**నేనిప్పుడు ఆలోచిస్తున్నది..**
**నాలో నువ్వులేని మిగతా సగం**
**నాకు మాత్రం ఎందుకని?**

– భాస్కరభట్ల, హైదరాబాద్

మరో రాయి పెట్టి పునాది పూర్తి చేశారు. చూస్తుండగానే పునాదిగోడలు తయార య్యాయి. తర్వాత ఇటుకమీద ఇటుకవేసి కట్టటం వాళ్ళకి చాలా తేలిక అనిపించింది.

తల్లీ, భార్యా అంత కష్టపడుతుంటే, తాను ఆఫీసుకి పోయి రావటం హరనా థ్ కి కష్టంగా అనిపించేది. కానీ ఏం చెయ్య లేని పరిస్థితి. సెలవు లేదు. జీతం నష్టం మీద సెలవు పెట్టుకునే పరిస్థితి లేదు.

"మీరేం బాధపడకండి. అంత కష్టంగా ఉంటే మేమే మానేస్తాం. మీరు ఆఫీసుకి వెళ్ళి పనిచేసుకోండి" అంది పద్మజ.

ఆదివారాలు, సెలవుదినాల్లో అతను కూడా వచ్చి ఒక చెయ్యి వేస్తున్నాడు.

గోడలు పూర్తి అయ్యాయి. ద్వారబం ధాలు కూడా బిగించారు.

ఇంక కప్పు వెయ్యాలి.

అప్పుడు ఊళ్ళో వాళ్లకి చలనం వచ్చింది. కోపం కూడా వచ్చింది. ఆ కబ్జాదారుల్ని అంతా కలిసి తిట్టిపోశారు.

"పాపం ఆడవాళ్ళు కష్టపడుతున్నారు. మీరు కబ్జా చెయ్యటానికి వీల్లేదు. మళ్ళీ ఈ చుట్టుపక్కల కనపడకండి" అని కబ్జా దారుల్ని తరిమేశారు.

ఆ తర్వాత సెంట్రింగ్ వాళ్ళని, డాబా వేసేందుకు మేస్త్రీల్నీ, కూలీల్నీ ఆ ఊరివాళ్ళే పంపించారు.

రెండు గదులూ, ఒక వంటగదితో

కంపార్ట్‌మెంట్‌లాంటి ఇల్లు తయారయ్యింది. దానికి పక్కన ఎప్పటికైనా అదే సైజుతో ఇంకో కంపార్ట్‌మెంట్ లాంటిది. కడితే, రెండు వాటాలూ కలిపి ఒక పెద్ద పోర్షన్ తయారవుతుంది.

చుట్టూ దడికట్టి, దానికి తను అనుకున్నట్లే బచ్చలితీగ పాకించింది పద్మజ. ఖాళీ స్థలంలో అన్ని రకాల కూరగాయ మొక్కలు పెట్టింది. సొర, బీర, గుమ్మడి, పొట్లలాంటి పాదుల్ని కూడా పెట్టింది.

పాలు పొయ్యటానికి ఊళ్ళోవాళ్ళు నిరాకరిస్తే హరనాథ్ సైకిల్‌మీద దూరాన ఉన్న మరో ఊరికి వెళ్ళి పాలు తేవాలని నిర్ణయం చేసుకున్నారు ఇదివరకు. కానీ ఊళ్ళోవాళ్లు సహాయ నిరాకరణ మానేశారు. పాలూ, కూరగాయలూ, ఇంకా తమ ఇతర సేవల్ని అందించేందుకు ముందుకి వచ్చారు. కానీ పద్మజకి పాలు తప్ప ఇంకేమీ అవసరం లేదు.

అక్కడ ఆ విధంగా కష్టపడి ఇల్లు కట్టుకుంది పద్మజ. అందరూ డబ్బు కోసం, ఇంకా దేనికోసమో కష్టపడతారు. కానీ పద్మజ ఇంటికోసం పడే శ్రమంతా పడటమే కాక ఇంకా ఎక్స్‌ట్రాగా శ్రమజీవనం కూడా గడిపింది. ఆ ఇంట్లో ప్రతి ఇటుకా ఆమె చేత్తో పేర్చి కట్టిందే. అందుకే దాని మీద అంత మమకారం ఆమెకి.

గృహప్రవేశం అంటూ ఏమీ లేదు. ఏం చేద్దామన్నా డబ్బు మిగలలేదు. చివరికి మంచి రోజున కొబ్బరికాయ కొట్టి, దేవుడికి దండం పెట్టుకుని ఇంట్లోకి ప్రవేశించారు.

పిల్లల్ని ఆ పరిసరాలకు బాగా అలవాటు చేసినా, పూర్తిగా అక్కడే నివసించేటప్పుడు కొన్ని కష్టాలు మొదలయ్యాయి.

ఒకరోజు పద్మజ, వరలక్ష్మి కలిసి సరుకులు తేవటానికి మార్కెట్‌కి వెళ్ళారు. పిల్లలిద్దరే ఇంట్లో ఉన్నారు.

ఇంతలో ఒక నాగుపాము ఇంట్లోకి వచ్చింది. పాప రమ్యా, బాబు హర్ష మాత్రం ఉన్నారు. పాముని చూసి గగ్గోలుగా ఏడ్చారు.

ఇంట్లోంచి బయటకు వచ్చేసి వీధిలో ఏడుస్తూ నిల్చున్నారు. వరలక్ష్మి, పద్మజా మార్కెట్ నుంచి వచ్చి, విషయం తెలిసి అలా నిలబడిపోయారు.

కాస్సేపయ్యాక ఏదైతే అది అయిందని ధైర్యంచేసి ఇంట్లోకి వెళ్ళారు.

పాము ఎక్కడా కనిపించలేదు. పిల్లల్ని లోపలికి రమ్మంటే రాలేదు. "పాము లేదు. వెళ్ళిపోయినట్లుంది. రండి" అని ఎంత పిలిచినా రాలేదు.

చివరికి వాళ్ళకు రెండు తగలనిచ్చి, తిట్టి, లోపలికి తీసుకొచ్చారు. తెచ్చారే కానీ అత్తా కోడళ్ళిద్దరికీ భయంగానే ఉంది. లోపల భయపడుతున్నా, పైకి ధైర్యం నటించాల్సిన పరిస్థితి. ఏం చెయ్యగలరు? పాము ఉన్నా, పెద్దపులే ఉన్నా ఆ ఇంట్లోనే కాలక్షేపం చేసితీరాలి. తప్పదు.

రాత్రి హరనాథ్ వచ్చాక చెప్పారు.

అతను కంగారుపడ్డాడు.

"పోనీ ఇల్లు ఖాళీ చేసేద్దాం" అన్నాడు.

"ఏడిసినట్లుంది. ఖాళీచేసి అద్దెలు పెట్టి బతకగలమా? చావో బతుకో ఇక్కడే" అంది పద్మజ.

"అంత చావుకి తెగించి మరీ ఇక్కడే బతకాల్సిన అవసరం ఏముంది?" హరనాథ్ అన్నాడు.

"మాటవరసకి అన్నాను కానీ ఎందుకు చస్తాం? ఊరు బయట ఇళ్ళల్లో పాములు రావడం మామూలే. మనుషుల అలికిడికి అవి పారిపోతాయి. మనం వాటిని చూసి భయపడినట్లే పాపం అవీ మనల్ని చూసి భయపడతాయి" అంది పద్మజ.

★ ★ ★

"పాము వచ్చిందండీ. మా ఇంట్లోకి పాము వచ్చింది నిన్న" పద్మజ పొరుగింటి

గంగావతితో చెప్పింది. పొరుగిల్లు అంటే అర్ధకిలోమీటరు దూరంలో ఉంటుంది. కళ్ళకు కనిపిస్తుంటుంది. అంతే.

గంగావతి నవ్వింది.

"నవ్వుతారేంటి? పిల్లలు భయపడ్డారు"

"నవ్వకేం చెయ్యమంటారు? మా ఇంట్లోకీ పాములు వస్తుంటాయి"

"మరి మీకు భయం వెయ్యదా? "

"ఎందుకు వెయ్యదూ. కానీ ఏం చేస్తాం. అవి మన ఇంట్లోకి రాలేదు. మనమే వాటి పుట్టల దగ్గర ఇళ్లు కట్టుకున్నాం"

పద్మజ మౌనంగా వింటోంది.

"మనలాగే అవీ ఈ ప్రకృతిలో భాగం. వాటిని తరిమేసి మనం ఆక్రమించాం. వాటికి మనలా తెలివి ఉండదు కదా. పరిస్థితి ఏమిటో వాటికి తెలీదు. అమాయకంగా మన ఇళ్లలోకి వచ్చేస్తాయి"

"ఎలాగండీ మరి బతకటం"

"డబ్బులేని వాళ్ళు ఎలాగో ఒకలాగా బతికేయడం నేర్చుకోవాలి. డబ్బున్నవాళ్లు ఊరు మధ్యలో ఇళ్ళు కట్టుకుంటారు. మనకి ఆ పని చేసే శక్తి లేదు. కనీసం అద్దెకి ఉండే స్థోమత లేదు. ఇంకా నాజూగ్గా పాములంటే భయం, బంది పోట్లని చూస్తే దడ అంటూ మాట్లాడుతుంటే ఎలాగండీ? " గంగావతి అంది.

పద్మజకి ఆ మాటల్లో నిజం బోధపడింది. నిజం నిష్ఠూరంగా ఉంటుంది. కఠోరంగా కూడా ఉంటుంది. కానీ భరించక తప్పదు.

ఆ తర్వాత పద్మజ పాములకి భయపడటం మానేసింది.

కొద్దిదూరంలో ఇంకో ఇల్లు ఉంది. ఆ ఇంటి యజమాని పాముకాటు వేస్తే చచ్చిపోయాడు. అంతా షాకయ్యారు. కానీ ఏం చేస్తారు? కొద్దిరోజులు భయపడ్డారు. మళ్ళీ మామూలే.

వర్షాకాలం పాముల పుట్టలు జడివానలకి కొట్టుకుపోయాయి. అందులో ఉన్న పాములు కంగారుగా ఇళ్ళలోకి వచ్చేశాయి. ఒకపక్క జోరున వాన, ఇంట్లోకి నీళ్ళు వచ్చి మనుషులు కంగారు పడుతుంటే అది చాలక పాములు కూడా ఇంట్లోకే వచ్చాయి.

అంతలోనే దోపిడీ దొంగలు వచ్చారు. వాళ్ళు ఇళ్ళ తలుపులు పగలకొట్టి మరీ లోపలికి వచ్చేస్తున్నారు. నగలూ, డబ్బూ, మంచి సామాన్లూ దోచుకుంటారు. ఏమీ దొరక్కపోతే కొడతారు. వాళ్ళు అడిగింది ఇవ్వకపోయినా కొడతారు. మరీ కోపం వస్తే చంపేసిన సంఘటనలు కూడా ఉన్నాయి. వాళ్ళకి కోపం తెప్పించకూడదు. ఈ భాష కూడా కాదు. అయినా ఏదో ఒక భాషలో వాళ్ళక్కావాల్సినవి అడిగే తెలివి ఉంది. వాళ్ళు తెగించినవాళ్ళు కాబట్టి చంపేందుకూ, చచ్చేందుకూ కూడా సిద్ధంగా ఉంటారు. వాళ్ళకి భయపడి కొందరు ఇళ్ళు ఖాళీ చేశారు. పద్మజ తెగించిన మనిషి. వరలక్ష్మికి అసలు దేనికీ భయం లేదు. వాళ్లు భయపడి అక్కడ్నుంచి వెళ్ళిపోదల్చుకోలేదు.

పద్మజకి తమ జీవితం తల్చుకుంటే ఆది మానవుడి జీవితం గుర్తుకొస్తుంది. ప్రకృతిలోని శక్తులతో ఎదురొడ్డి పోరాడుతూ, జంతువుల్నీ, సర్పాల్నీ జయిస్తూ, కష్టపడి సంపాదించుకున్న తిండిని ఎవరూ కొట్టేయకుండా జాగ్రత్త పడుతూ, ప్రతికూల వాతావరణంలో తన పాట్లు తాను పడుతూ,

## కొత్తగాలి...

**విరిసిన పూలు వాడిపోయినా**
**పరిమళాలు గుర్తుండిపోతాయి**
**నీళ్లు ఇంకిపోయినా**
**కన్నీళ్లు మిగిలే ఉంటాయి**

*– రఘుపాత్రుని శ్రీనివాసరావు, శ్రీకాకుళం*

నిరంతర పోరాట జీవనాన్ని సాగించిన ఆదిమ మానవుడికీ తనకీ ఏం తేడా ఉందో పద్మజకి అర్థం కాదు. ఎంతసేపూ ఏదో ఒకదాని కోసం నిరంతర పోరాటం. ఇంతే జీవితం. ఎవరి జీవితమైనా ఇంతే. కొందరు కొన్ని సుఖాలు, సౌకర్యాలు అనుభవిస్తారు. కానీ మొత్తానికీ ఎప్పటికీ హాయిగా బతికేసిన జీవితాలు కొన్నే ఉంటాయి. తనది ఇంకాస్త పోరాడిన జీవితం. అంతే.

అన్నిటికీ మొండికి తేలిన పద్మజ పట్టుదల, కృషి ముందు ప్రకృతీ, పాములూ, దొంగలూ తల వంచారు.




**హా**రనాథ్‌కి వేలువిడిచిన మేనమామ ఒకాయనున్నాడు. ఆయన కొడుకుని ముద్దుగా బాబీ అని పిలుస్తారు. బాబీకి ఇరవై మూడేళ్లు వచ్చినా ఇంకా ఉద్యోగం రాలేదు. తండ్రి బాబీ ఉద్యోగం గురించి దిగులు పెట్టుకున్నాడు. చూస్తుండగానే పాతికేళ్లు నిండే తరుణం కూడా వచ్చింది. ఇరవై మూడేళ్లకి దిగులు పడడం మొదలు పెట్టిన అతని తండ్రి పాతికేళ్ళు వచ్చేసరికి పూర్తిగా బేజారయ్యాడు. ఎవరిని చూసినా కొడుకు ఉద్యోగం గురించే చెపుతుండేవారు. బాబీ కూడా ఉద్యోగం రాదేమోనని భయపడుతున్నాడు. అతని తల్లి అయితే చిక్కి శల్యమైంది.

ఇంతలో బాబీకి చచ్చీ చెడీ ప్రయత్నించగా ఒక ఉద్యోగం వచ్చింది. కానీ వాళ్ళు సెక్యూరిటీ అడిగారు. రెండు లక్షలు క్యాష్ గానీ, ఆస్తి గానీ చూపించమన్నారు. బాబీ తండ్రికి రెండూ లేవు.

పోనీ ఎవరిదైనా ఆస్తి సెక్యూరిటీగా చూపించవచ్చని ఆ కంపెనీవాళ్ళు అన్నారు.

బాబీ తండ్రికి హరనాథ్ తప్ప ఇంకెవ్వళ్లూ కనిపించలేదు. నేరుగా హరనాథ్ ఆఫీసుకి వచ్చేశాడు.

"బాబ్బాబు. ఈ సాయం చేసిపెట్టు. చచ్చి నీ కడుపున పుడతాను. మీ ఇంటిని సెక్యూరిటీగా చూపించు, వాడికి ఉద్యోగం వస్తుంది. రెండేళ్ల వరకే ఈ సెక్యూరిటీ. కాగితంమీద ఒక్క సంతకం. అంతే. నీ ఒక్క సంతకంతో వాడికి ఉద్యోగం వస్తుంది" బాబీ తండ్రి బతిమాలాడు.

హరనాథ్‌కి ఏంచెయ్యాలో తోచలేదు.

"ఆలోచించుకుని చెపుతాను" అన్నాడు.

"నువ్వు ఆలోచించేసరికి పుణ్యకాలం దాటిపోతుంది. ఇవి చేతులు కావు కాళ్ళు" బాబీ తండ్రి హరనాథ్ చేతులు పట్టేసుకుని దాదాపు ఏడ్చేస్తూ బతిమాలాడు.

"రేపొద్దున్న ఏ సంగతీ చెపుతాను" అన్నాడు హరనాథ్.

ఇంటికి వచ్చాక ఆ రాత్రి పద్మజతోటీ వరలక్ష్మితోటీ ఆలోచన చేశాడు. అసలు ఆఫీసులోనే బాబీ తండ్రి బతిమాలటం చూసిన తోటి ఉద్యోగులు సంగతి ఏంటని అడిగారు. చెప్పాక ఒక్కళ్ళు కూడా పాజిటివ్‌గా మాట్లాడలేదు.

"వద్దు. ఇప్పుడిట్లాగే మాట్లాడతారు. రేపు ఎటుపోయి ఎటు వస్తుందో? మా బాబాయి కొడుక్కి ఇట్లాగే బతిమాలితే సంతకం పెట్టాను. వాడు ఇంకో ఉద్యోగం దొరికి రెండోనెల్లోనే ఈ ఉద్యోగానికి రిజైన్ చేశాడు. మొదటి ఉద్యోగంవాడు నేను సెక్యూరిటీగా ఉన్నాను కాబట్టి నాకే నోటీస్

పంపాడు. లక్ష రూపాయలు కట్టాల్సి వచ్చింది" అన్నాడు పక్క సీటాయన.

"రేప్పొద్దున్న ఇతను ఆఫీసులో ఏదన్నా చేసినా వాళ్ళు డబ్బు రికవర్ చేస్తారు".

"వాళ్ళకి నచ్చక వాళ్ళు తొలగించినా ఇతనే మానుకున్నా ఫలితం ఒక్కటే. మనమే డబ్బు కట్టాలి. ఏది జరిగినా జరగవచ్చు"

వాళ్ళ మాటలన్నీ పద్మజకి చెప్పాడు హరనాథ్. "ఏం చెయ్యాలి? అటు చూస్తే మామయ్య ఇద్దైపోతున్నాడు. ఇటు నమ్మి సంతకం పెట్టాలంటే భయం" అన్నాడు.

"వద్దు. చచ్చీ చెడీ ఈ ఇంటిని కట్టుకున్నాం. మన కష్టార్జితం, మన చెమట కలిపి, రక్తం ధారపోసి కట్టాం. దీనికేమన్నా అవుతుందేమోనని భయపడితేనే భరించలేక పోతున్నాం. తెలిసి తెలిసి పొరపాటు చెయ్యటం దేనికి? మనకి వాళ్ళతో మొహమాటం ఏముంది? మనకెవ్వళ్ళూ సాయం చెయ్యలేదు. నిర్మొహమాటంగా చెప్పేయండి" అంది పద్మజ. వరలక్ష్మి కూడా అంతే అంది.

హరనాథ్ ఇంటికి పొద్దున్నే వచ్చేశారు బాబీ, అతని తండ్రి. హరనాథ్ నిర్ణయం విని కాస్సేపు బతిమాలారు. బుజ్జగించారు. పద్మజ, వరలక్ష్మి అసలు వంటగదిలోంచి బయటకు రాలేదు. కాస్సేపు ప్రయత్నించి, లాభం లేకపోయాక బాబీ తండ్రి శాపనార్థాలు పెట్టాడు.

"చిన్న సాయం చెయ్యటానికే ఏడుస్తున్నావు. నీ మొహం చూస్తేనే అసహ్యం వేస్తోంది. ఏం మనిషివి? పశువుకీ నీకూ తేడా ఉందా? ఇల్లు శాశ్వతమా? ఇట్లా పాకులాడిన వాళ్ళెవళ్ళు బాగుపడలేదు" అని రకరకాలుగా తిట్టాడు.

వింటున్న పద్మజకి కోపం వచ్చి, వంటింట్లోంచి వచ్చేసింది.

"మీరు ఇప్పుడే ఇట్లా మాట్లాడుతున్నారు. ఇంక మిమ్మల్ని నమ్మి పత్రాలు ఇచ్చి, సంతకం పెట్టి ఉంటే మా గతి ఏమైఉండేదో" అనేసింది ఆవేశంగా.

"చాల్లేవమ్మా. ఇంత స్వార్థం పనికి రాదు. హుఁ పదరా" అనేసి బాబీ తండ్రి విసురుగా బయటకి నడిచాడు. బాబీ మౌనంగా తండ్రిని అనుసరించాడు.

ఇంక బాబీ కుటుంబంతో తమకి తెగ తెంపులై పోయినట్లే అని హరనాథ్‌కి అర్థం అయింది. అతని మనసు కాస్త బాధపడుతూనే ఉంది.

మధ్యతరగతి జీవికి ఇల్లు అనేది సర్వస్వం. ఇల్లు అంటూ ఉంటే గుట్టుగా అందులో కాలక్షేపం చెయ్యవచ్చు తిన్నా, తినకపోయినా బాధలేదు. తలదాచుకుందుకు గూడుంటే చాలు. తనకి ఇంకో ఇల్లు కూడా లేదు. ఉన్న ఒక్క ఇంటినీ బాబీని నమ్మి సంతకం పెట్టి వదులుకోవటమా?

"మనకి వాళ్ళతో మొహమాటం ఏముంది? ఊరికే బాధపడకు. అవసరానికి అడిగారు. మనకి కుదరదని చెప్పాం. అక్కడితో అయిపోయింది" అంది వరలక్ష్మి.

పద్మజ కూడా మనసు సరిపెట్టుకోవాలని చూసినా సరిపెట్టుకోలేకపోయింది.

స్కూల్‌కి తయారవుతున్న పిల్లలు ఏమైందని అడుగుతుంటే అప్పుడు పద్మజ మనసు సమాధానపడింది.

పిల్లల అమాయకపు మొహాలు చూసి గుండె తరుక్కుపోయింది. చచ్చీ చెడీ ఇటుక ఇటుకా పేర్చి కట్టిన ఇల్లు. ఇదంతా

## కొత్తగాలి...

**జ్ఞాపకాల పెట్టె నిండా**
**ఎన్నో**
**చిన్ననాటి**
**ఫోటోలు**

– ఆచార్య కొలకలూరి ఇనాక్,
హైదరాబాద్

పిల్లల కోసమే. వాళ్ళని చక్కగా పెంచి, పెద్దచేయాల్సిన బాధ్యత తనమీద ఉంది. వాళ్ళకోసమే తన తపన. తనుచేసిన పని మంచిదే. ఎవరు ఎప్పుడు ఎలా మారు తారో తెలియని ఈ రోజుల్లో దూరపు బంధువుల్ని ఎలా నమ్మగలం?

ఇరుగూ పొరుగూ అదే అన్నారు.

"మంచి పని చేశారు. అంతకుముందు ఎన్నడూ వచ్చిపోయిన మనుషులు కూడా కాదు. దగ్గర బంధువుల్లో ఎవరూ లేరంటారా? మనదాకా ఎందుకు రావాలి? " అన్నారు.

అప్పుడు గుర్తొచ్చింది హరనాథ్‌కి. బాబీకి సొంత మేనమామ ఒకాయన ఉన్నాడు. బాబాయి ఒకాయన ఉన్నాడు. వాళ్ళిద్దరికీ తనకన్నా మంచి ఇళ్ళున్నాయి. మరి వాళ్ళే ఇవ్వనిది తనకెందుకు బాధ?

★ ★ ★

పాపకి పుట్టిన రోజు వచ్చింది.

పద్మజ తనే గౌన్లు కుట్టటం నేర్చుకుంది. కాబట్టి పాపకి రెడీమేడ్ గౌన్లు వేసుకోవాలన్న ఆశ తీరలేదు. పుట్టిన రోజు నాడైనా రెడీమేడ్ ఫ్రాక్ వేసుకోవాలని పాప అనుకుంది. పాప మూడో ఏట, కొద్దిగా గౌన్ల తారతమ్యం గుర్తించటం మొదలుపెట్టినప్పట్నుంచీ చిగురించిన ఆశ ఎన్నడూ తీరనేలేదు. ఆ ఆశ తీరకుండానే పాప ఫ్రాక్‌లు వెయ్యటం మానేసి, లంగా ఓణీల లోకి ప్రవేశించింది.

చౌకగా బట్ట కొనటం, తోచిన డిజైన్‌లో కుట్టేయటం, అంతే. తనకి నచ్చిన ఫ్రాక్‌లు వేసుకోవటం లేదని పాప ఎంత నిరుత్సాహ పడుతోందో పద్మజకి తెలుసు. కానీ ఏం చెయ్యలేని పరిస్థితి. ఉన్న డబ్బేదో అప్పులకే సరిపోతోంది. జాగ్రత్తగా, పరమ జాగ్రత్తగా వాడాల్సి వస్తోంది.

పద్మజ తను కూడా ఎన్నడూ నచ్చిన బట్టలు వేసుకోనేలేదు. పెళ్ళి నాటిది తప్ప ఇంకోటి పట్టుచీరె అన్నది లేదు. తన కంటూ సొంతంగా ఏనాడూ చీరె కొనుక్కున్న పాపాన పోలేదు. పుట్టింటివాళ్ళు ఏడాదికి రెండు చీరెలు పెట్టేవాళ్ళు. ఇంకా అప్పుడప్పుడూ ఏ బంధువులో పెట్టిన చీరలు చాలా జాగ్రత్తగా వాడుతుండేది. అందువల్ల ఏనాడూ చీరె కొనకపోయినా, ఎట్లాగో ఒకలాగ కాలం గడిచిపోతుండేది. కొత్తచీరె అయితే, అది ఎంత తక్కువ ఖరీదుదైనా సరే బాగానే ఉంటుంది కాబట్టి దాన్ని పెళ్ళిళ్ళకీ, శుభకార్యాలకీ వాడుతుండేది. అందరూ మంచి మంచి చీరెలు కట్టుకుని వచ్చినా ఏనాడూ తనకు లేదని బాధ పడేది కాదు.

ఇళ్ళ దగ్గర కూడా కొంతమంది చీరెలు కొనేవాళ్ళు. ఇన్‌స్టాల్‌మెంట్స్ మీద చీరెల దగ్గర్నుంచీ అమ్మేవాళ్ళు కొందరు ఆ కాలనీలోకి వచ్చేవాళ్ళు. ఆడవాళ్ళు ఎగబడి ఆ చీరెలు కొనేవాళ్ళు. అయినా పద్మజ వాళ్ళ దగ్గర కూడా ఎన్నడూ కొనలేదు.

అమ్మటానికి వచ్చినవాళ్ళు ఎవరో ఒకరింట్లో చాప పరిచి అన్ని చీరెలూ పేర్చేవాళ్ళు. వార్త తెలియగానే కాలనీలోని ఆడ జనాభా అంతా అక్కడికి చేరిపోయేది. ఊరికే చూద్దామని వచ్చేవాళ్ళు కొందరైతే, కొనటానికి వచ్చేవాళ్ళు మరికొంతమంది. ఎంత పిల్చినా పద్మజ మాత్రం వెళ్ళి చూసేది కాదు. కొంతమంది ఊరికే వచ్చి చూడు, మాకు ఏవి బాగుంటాయో చెప్పు చాలు అనేవాళ్ళు. అలా వెళ్ళి బాగున్న చీరెలు సెలక్ట్ చేసేది. అన్ని మంచి చీరెలు చూసినా, ఏనాడూ పద్మజ చీరెల మోజుకి లొంగిపోలేదు. స్థిరంగా కూర్చుని, బియ్యాన్నో మరో సరుకునో చూసినట్టే పట్టుచీరెల్ని కూడా చూస్తున్న పద్మజ నిగ్రహం చూసి అంతా మెచ్చుకునేవాళ్ళు.

"మాకు మీలాంటి నిగ్రహం ఉంటే

## కొత్తగాలి...

**ఏదేశంలో అయినా మహిళల**
**కన్నీళ్లకు కొదువలేదు**
**అవే**
**సముద్రాల్ని బతికిస్తున్నాయి!**

– పాయసం సుబ్రహ్మణ్య మహర్షి, నెల్లూరు

ఎంత బాగుండేది. చూసినందుకు ఏదో ఒకటి కొనెయ్యటం. తర్వాత బాగాలేవని బాధ పడటం, ఇంటినిండా చెత్త చేర్చుకోవటం తప్పేది" అనేవాళ్ళు. అమ్మేవాళ్ళకీ పద్మజని చూస్తే ఆశ్చర్యంగా ఉండేది.

తనకి మంచి బట్టలు లేనందువల్ల కొందరు తనని షాపింగ్‌కీ పేరంటాలకీ తోడు తీసుకెళ్ళటం లేదని పద్మజకి ఎప్పుడో అర్థమైంది. స్నేహానికి కులం, ప్రాంతం తోడవుతాయో లేదో తెలీదుగానీ ఆ కాలనీలో మంచి మంచి బట్టలు కట్టుకునేవాళ్ళంతా కలసి తిరిగేవాళ్ళు. ఏ కోరీకో వెళ్ళాలంటే ఆ గ్యాంగ్ కలిసి వెళ్ళేవాళ్ళు. పొరపాటున కూడా పద్మజని తీసుకెళ్ళేవాళ్ళు కాదు. పెళ్ళిళ్ళప్పుడు సరేసరి. కనీసం పాత పట్టుచీరె కూడా కట్టుకురాని పద్మజ అంటే అందరికీ చిన్నచూపు. భోజనాల దగ్గరా, కలిసి కూర్చునే దగ్గర అంతా వాళ్ళే కలిసి ఉండేవాళ్ళు.

పద్మజకూ, కూతురికీ అక్కడే వివాదం.

"మంచి బట్టలు లేకపోతే ఎవరూ మాట్లాడను కూడా మాట్లాడరు. నాకు మంచి బట్టలు కావాలి" అనేది రమ్య.

"బట్టలు చూసి మాట్లాడేవాళ్ళతో మనకి స్నేహం వద్దు. చదువుకో. బాగా చదువుకుంటే నీకు కావల్సినవన్నీ కొనుక్కోవచ్చు" అనేది పద్మజ.

స్నేహితులు కూడా జీవితంలో అవసరమే. పిల్ల వివక్షకి గురైతే మానసిక వేదన తప్పదని పద్మజకి తెలుసు. గొప్ప మాటలు చెప్తే పిల్లకేం అర్థం అవుతుంది.

పిల్లవాడి దగ్గర కూడా అదే విషయంలో ఘర్షణ జరిగేది. మంచి బట్టలు, బూట్లు లాంటివి అధిగమించి, వాడికి మరో కోరిక కలిగింది. బ్యాట్ కావాలన్న కోరిక తీరనేలేదు. అంతలోనే మరో కోరిక, సైకిల్ కావాలని కలిగింది.

సైకిల్ కొనే పరిస్థితి లేదు.

వాడికి కోపం వచ్చింది.

"అర్థం చేసుకో నాన్నా. మనం ఇల్లు కట్టుకున్నాం. దానికి బోలెడు ఖర్చయింది..." పద్మజ ఏదో చెప్పబోయింది.

"నాకేం చెప్పొద్దు. ఎప్పుడు చూసినా ఇల్లు కట్టాం అంటారు. ఎవరు కట్టమన్నారు. ఒక్క ఇంటికోసం అన్ని ఖర్చులూ మానుకోవాలా? ఇది కట్టకపోతే అన్నీ కొనుక్కునేవాళ్ళం" అన్నాడు గట్టిగా హర్ష.

పద్మజకి కోపం ఆగలేదు.

"నోరు మూసుకో, నాకు చెప్పేంత వాడివయ్యావా? ఇప్పుడిలాగే మాట్లాడతావు. నేనేం ఈ ఇల్లు పట్టుకుపోతానా? రేప్పొద్దున్న ఈ ఇంటి ఓనర్‌గా హాయిగా ఉంటావు. అప్పుడర్థం అవుతుంది ఎంత మంచిపని చేశామో" అంది పద్మజ.

"ఏడిసినట్లుంది. జీవితం అంతా బాధపడి ఎప్పుడో చచ్చేముందు సుఖపడతామా? " అనేశాడు వాడు.

పద్మజకి కోపం, ఏడుపు కూడా వచ్చాయి. వాడ్ని ఏదో అనేలోపల వాడు బయటకి తుర్రుమని వెళ్ళిపోయాడు.

"ఎక్కడికిరా. లోపలకు రా. చదువుకో" పద్మజ అరిచింది. వాడు వినిపించుకోలేదు. విసురుగా వెనక్కు తిరిగి, కోపంగా చూసి వెళ్ళిపోయాడు.

"వాడినెందుకు తిడతావు. మనకు పుట్టినందుకు పాపం వాళ్ళు (ఫ్రెండ్స్) ముందు చులకన అవుతున్నారు. ఎందుకరుస్తావు? వాళ్ళకి మెల్లగా నచ్చచెప్పాలి" అన్నాడు హరనాథ్.

"వాడికి ఇంకా నయం కదా. నన్నైతే అమ్మ కొడుతుంది కూడా" అంది రమ్య.

ట్యూషన్ పెట్టించారు ఇద్దరు పిల్లలకీ. దానికి ఇంకాస్త పొదుపు చెయ్యవలసి వచ్చింది. అందువల్ల ఇంకా కొన్ని విషయాల్లో కోత పడింది.

మార్కులు తక్కువ వస్తే పద్మజకి ఒళ్ళు మండిపోయేది. కష్టపడి ట్యూషన్ కూడా పెట్టించి చదివిస్తే తెచ్చుకునేవి ఇట్లాంటి మార్కులా? గుండె దహించుకుపోయేది.

అప్పుడు ఇంక తనను తాను కంట్రోల్ చేసుకోలేకపోయేది. పిల్లల్ని చితకబాదేది.

వాళ్ళు గగ్గోలు పెడుతూ ఏడ్చేవాళ్ళు. క్రమశిక్షణ విషయంలో ఏమాత్రం రాజీపడేదికాదు. హరనాథ్ అయితే వాళ్ళెంత అల్లరిచేసినా ఊరుకునేవాడు. కానీ పద్మజ చిన్న తప్పుకి కూడా బాగా దండించేది.

పద్మజ కొట్టటం చూసి ఒక్కోసారి ఇరుగూ పొరుగూ మందలించేవాళ్ళు.

కొన్నాళ్ళకి పద్మజ తనను తాను అర్థం చేసుకుంది.

తనకి పిల్లలంటే ప్రాణం. వాళ్ళకి కావల్సినవి అందివ్వలేని కారణంగా తన మీద తనకే కలిగిన కోపం వాళ్ళమీద విరుచుకుపడేట్లు చేస్తోంది. సైకిల్ కొనివ్వలేదని బాబు ఎంత బాధపడుతున్నాడో తెలిసినా ఏమీ చెయ్యలేని అసమర్థత. ఆ అసమర్థత వల్ల దెబ్బతిన్న అహం తనని వాళ్ళమీద విరుచుకుపడేట్లు చేస్తోంది.

రోజూ రాత్రిపూట ఒకసారి ఆరోజున తను ఏమేం చేసిందీ గుర్తుచేసుకునేది పద్మజ. ఆత్మపరిశీలన ముఖ్యం అని తీరిక దొరికినప్పుడు చదివిన పుస్తకాల్లో ఉంది. పిల్లల్ని గొడ్డును బాదినట్లు బాది ఆ తర్వాత బాధపడి ఏడుస్తూ కూర్చునేది. ఆత్మపరిశీలన మొదలుపెట్టాక తన ప్రవర్తన ఒప్పో, తప్పో, తను అట్లా చెయ్యటానికి గల కారణాలేంటి అని తెలుసుకుంది.

అట్లా తన తప్పులు ఏమిటో తెలుసుకుని బాగుపడటం, ఇంతకన్నా మెరుగైన జీవితం ఎట్లా జీవించటం తెలుసుకుంది.

పిల్లలని తనతోపాటు కూర్చోబెట్టుకుని అన్నీ వివరించి చెపుతుండేది.

ఎంత చెప్పినా పిల్లలు పిల్లలే.

వాళ్ళకి ఏం చెప్పినా వాళ్ళ మనసులూ, చేష్టలూ అన్నీ పిల్లలవే. వాళ్ళకి పెద్దరికం ఎక్కడినుంచి వస్తుంది? వాళ్ళు పిల్లల్లాగే ఉంటారు. పిల్ల ఆశలూ, పిల్లల కోరికలూ వాళ్ళకి ఉండనే ఉంటాయి. కానీ తల్లిదండ్రులు వివరించి చెప్పటం వల్ల ఆ కోరికల్ని అణిచివేసుకుంటారేమో కానీ ఆ కోరికలు అసలు కలగకుండా ఉండవు.

అది కూడా పద్మజకి అర్థం అయింది. చక్కటి ఆట వస్తువులూ, బొమ్మలూ, సైకిల్, క్రికెట్ బ్యాట్, ఇతర సామగ్రి ఏదైనా కానీ వాళ్ళను ఆకర్షించకుండా మాత్రం ఉండవు. కాకపోతే తమకు అందుబాటులో లేని వస్తువుల్ని గురించి తల్లిదండ్రులతో చెప్పరు. అడగరు. మనసులోనే ఆ కోరికని దాచుకుంటారు.

పద్మజకి తన అసమర్థత తల్చుకుని గుండె చెరువైపోయేది. ఒక్కోసారి సృష్టి మీదే కోపం వచ్చేది.

ఏంటీ లోకం? డబ్బున్నవాళ్లు, లేనివాళ్లు ఎందుకీ తేడాలు? పిల్లలకి కావల్సిన బొమ్మ కొనిపెట్టలేని తల్లితండ్రులెంత దుర్భర వేదన అనుభవిస్తారు. ఎందుకీ తారతమ్యాలు? అంతా ఒకటే అయితే, ఒకే తరగతి, ఇట్లా వాళ్లూ వీళ్లూ అని లేకుండా మనుషులంతా ఒకటే జాతి, ఒకే జీవితం ఉంటే ఎంత బాగుంటుంది.

భర్తకి చెపితే అతను నవ్వేశాడు.

"శ్మశాన వైరాగ్యం, ప్రసూతి వైరాగ్యం లాగా మాతృ కమ్యూనిజం వచ్చినట్లుంది నీకు. నీ పిల్లలకి బొమ్మలు కొనాలనేసరికి సంపదని జాతీయం చేసేయాలన్న ఆలో

## తెలుగోడిని కనుక్కోవడమెలా?

బాపూ–రమణ ద్వయం తెలుగు చలన చిత్ర పరిశ్రమలో చాలా ప్రసిద్ధి. బాపూ బొమ్మలు తెలుగువారికి విశేష ఖ్యాతిని తెచ్చిపెట్టాయి. రమణ చమక్కులు సరేసరి! వారి చతురోక్తులు కొన్ని...



ఒకరోజు ముళ్లపూడి వెంకటరమణగారి దగ్గరకు ఒక వ్యక్తి వచ్చాడు. ఇద్దరూ మాట్లాడుకుంటుండగా మాటల సందర్భంలో ఆ వ్యక్తి 'మద్రాస్‌లో ఎక్కువగా అరవవాళ్లే కదా ఉంటారు. మరి ఇక్కడ ఉండే తెలుగువాళ్లని ఎలా పోల్చుకోవడం?' అని అడిగాడు.

దానికి ముళ్లపూడివారు 'మీరు పేపరుకొని చదువుతుంటే, మధ్యలో ఆ పేపర్ని ఎవరు అడిగి తీసుకుంటారో వాడే తెలుగువాడు!' అన్నారట ఠక్కున.

చన కలుగుతోంది. ఎంతోమంది పిల్లలున్నా మనవాళ్లు ఎంతో నయం. కడుపు నిండా తింటున్నారు. మనం కడుపు మాడ్చుకునైనా వాళ్లకి కావాల్సిన చదువు చెప్పించేందుకు రెడీగా ఉన్నాం. మనకి సొంతగూడు ఉంది" అన్నాడు.

పద్మజకి ఉక్రోషం వచ్చింది.

"అట్లా ఏం కాదు. వెక్కిరించకండి. నాకు నిజంగానే అట్లా అనిపించింది. ఎంతమంది పిల్లలో కనీసం తిండి కూడా దొరక్క బాధపడుతున్నారు. వాళ్ల గురించి కూడా ఆలోచిస్తుంటాను" అంది.

"నిజమే. నువ్వు ఆలోచించటం లేదని కాదు. కానీ మనలాంటి వాళ్ల ఆలోచనలు అక్కడే ఆగిపోతాయి. ఆచరణలోకి రావు. అన్నంలేని పిల్లలకు పనికొస్తుంది. మన ఇల్లు వాళ్ల పేరున రాసి అద్దె ఇంటికి మారిపోదామా? " అన్నాడు.

పద్మజ మాట్లాడకుండా ఊరుకుంది.

ఆత్మ పరిశీలనలో ఆ విషయం కూడా చేర్చుకుంది ఆ రాత్రి. నిజమే. తనదాకా వస్తేగానీ నైజం బయటపడదు. వాళ్లు అలా చెయ్యాలి, వీళ్లు ఇలా చెయ్యాలి అనటం కాదు, మనమేం చేస్తున్నాం అని ఆలోచించుకోవాలి.

కానీ ఏం చెయ్యాలో మాత్రం బోధపడలేదు. మళ్లీ పిల్లల బాగోగుల్ని చూడ్డంలో మునిగిపోయింది. చాలాసార్లు చాలా చాలా చెయ్యాలనిపించినా, ఏమీ చెయ్యకుండానే కాలం గడిచిపోతోంది.

పద్మజకి సంసారం తప్ప మరేదీ పట్టదు. ఆఖరికి పుట్టింటికి కూడా మరీ అవసరం అయితే తప్ప వెళ్లదు.

★ ★ ★

సొంత ఇంటికి వెళ్లిన కొత్తలో అక్కడి ప్రకృతి సౌందర్యం ఎవరినైనా మైమరిపించేట్లు చేసేది.

అక్కడ చెట్లమీద చిలకలు, గోరువంకలు, ఇంకా పేర్లు తెలీని ఏవేవో పిట్టలు నివాసం ఉండేవి. పావురాలు ఎన్నో రకాలు ఉండేవి. తెల్లటివి, బూడిదరంగువి, చుక్కల చుక్కలవీ.. ఆ పావురాళ్ని చూస్తుంటే ఎంతో ముచ్చటగా అనిపించేది. ఇంకాస్త దూరంలో అస్సలు ఇళ్లులేని ప్రాంతంలో దట్టంగా చెట్లు మాత్రమే ఉండేవి. అక్కడ నెమళ్లూ, గుబురుగా ఉన్న పొదల్లో కుందేళ్లూ కనిపించేవి. అందాల పిట్టల్ని చూసి ఆనందించే అవకాశం లేకుండా రోజూ వేటగాళ్లు అక్కడికి వస్తుండేవాళ్లు. రకరకాల పిట్టల్ని పట్టుకుని పంజరంలో బంధించి, తీసుకుని పోతుండేవాళ్లు. విడిచిపెట్టమని ఎంత బతిమిలాడినా విడిచిపెట్టేవాళ్లు కాదు.

"పోమ్మా. మాకు ఎప్పట్నుంచో ఇదే

జీవనాధారం" అనేసేవాళ్లు.

"ఇవి తినటానికి పనికిరావు. మేము వీటిని చంపం, పంజరంలో పెట్టి అమ్మితే మీలాంటివాళ్లే కొనుక్కుంటారు. పళ్లూ, గింజలూ తినిపించి ప్రేమగా పెంచుకుంటారు. ఇక్కడ ఉంటే ఏ గరుడపక్షో వీటిని తన్నుకుపోతుంది. మేం వాటిని రక్షించుతున్నాం" అనేవాళ్లు.

వేటగాళ్లు ఎవరి మాటా వినరు. పక్షుల వేట అలాగే సాగిపోతుండేది. వాళ్లకి చెప్పి లాభం లేదని అర్థం అయాక అంతా మాట్లాడకుండా ఊరుకునేవాళ్లు. ఆ వేటగాళ్లు చాలదన్నట్లు కుందేళ్లనీ, నెమళ్లనీ వేటాడే వాళ్లు కూడా వస్తూనే ఉండేవాళ్లు. ఆ కాలంలో ఇన్నిన్ని చట్టాలు లేవు. జంతు సంరక్షణ, జీవకారుణ్యం చట్టాల రూపంలో ఏ విధంగా, ఎలా ఉన్నాయో లేదో కూడా ఎవరికీ తెలియదు. అందువల్ల ఆ పక్షుల వేటకీ, జంతువుల వేటకీ అడ్డులేకుండా ఉండేది. అందులో మారుమూల ప్రాంతంలో ఎవరికీ పట్టేది కాదు.

కాలం గడుస్తుంటే ఇంకొన్ని ఇళ్లు వచ్చాయి. పాత స్నేహితురాళ్లని కలిస్తే వాళ్ల స్థలాలు చూపించమని అడుగుతూనే ఉండేవాళ్లు. కొందరు కొనుక్కున్నారు. రానురానూ ధరలు పెరిగాయి. ధైర్యం చేసి, ఏదో ఒక రేటులో ఉన్నప్పుడు కొనేసుకున్నవాళ్లు కొనేసుకున్నారు. కొందరు ధరలు తగ్గాక చూద్దామనుకున్నవాళ్లు కొనలేకపోయారు. కొందరు పది రూపాయల ధర ఉన్నప్పుడు 'అమ్మో పది రూపాయలా' అనుకుని కొనలేదు. చూస్తూ ఉండగానే ధరలు పెరిగిపోయాయి. వంద రూపాయలు ఉన్నది రెండు వందలు, వెయ్యి రూపాయలదాకా వెళ్లి చివరికి ఒక్కో గజం పదివేలకి పైన చేరుకుంది. చుట్టూ కాలనీలు వచ్చాయి. పద్మజ వేసిన చెట్లు వృక్షాలయ్యాయి. మామిడి, జామ, కొబ్బరి, పనసలాంటివి విగరకాసి చూసే వాళ్లకి కనువిందు చేస్తాయి.

"మీకు భలే స్థలం దొరికిందండీ. మాకు ఎంత ప్రయత్నించినా ఇలాంటి ఇల్లు దొరకటం లేదు" అంటారు అంతా.

ఇప్పుడు అది భలే స్థలమే. కానీ అది కొన్నప్పటి నుంచీ తనుపడ్డ పాట్లు ఎవరికి తెలుస్తాయి? పద్మజకి వాళ్ల మాటలు వింటే నవ్వు వస్తుంది.

ఏదన్నా మొదట మొదలుపెట్టినవాడు ఎక్కువ కష్టాలు పడతాడు. పద్మజ పడ్డ కష్టాలు ఆ తర్వాత అయిదేళ్లకి కొన్నవాళ్లు పడలేదు. పాలవాళ్లు, కూరలవాళ్లు, పేపర్ బాయ్ అంతా ఇంటికి వచ్చేవాళ్లు, చిన్న పచారీ దుకాణం కూడా వచ్చింది. దేనికీ తడుముకోకుండా అన్నీ వచ్చాయి.

పిల్లలు మంచి చదువులు చదివి ఉద్యోగాల్లో చేరారు. పడ్డ కష్టానికి ఫలితం దక్కింది. పిల్లలు ప్రయోజకులయ్యారు.




"అనసూయ వస్తానని ఫోన్‌చేసింది" వరలక్ష్మి చెప్పింది. పద్మజ చేస్తున్నపని ఆపి ఆవిడవైపు చూసింది.

"ఏంటి కబుర్లు? ఊరికే చేశారా లేకపోతే ఏదన్నా విశేషమా? " అడిగింది.

"విశేషమే. అదిరిపోయే విశేషం" వరలక్ష్మి పద్మజ వైపు చూస్తోంది. ఆ చూపులో ఎన్నో ప్రశ్నలు.

"ఏంటా విశేషం? కాస్త మాకూ చెప్పు" అన్నాడు అక్కడికే వచ్చిన హరనాథ్.

"ఏముందిరా? అందరు పెద్దవాళ్లకూ ఉండేవే" అంది వరలక్ష్మి.

"అప్పుడు అది విశేషం ఎట్లా అవుతుంది కానీ విడమర్చి చెప్పు" నవ్వాడు హరనాథ్.

పద్మజ లేచి, గబగబా కాఫీ కలుపుకుని తెచ్చింది.

"మీకు పాలు? " అత్తగారిని అడిగింది.

"ఇప్పుడే వద్దు" అంది వరలక్ష్మి.

ఆ తర్వాత అనసూయమ్మ గురించి సంభాషణ సాగింది.

అనసూయమ్మ ఏనాడూ తన ఎనభై ఏళ్ల జీవితంలో దేనికీ వెనక్కు తిరిగి చూసింది లేదు. పైలాపచ్చీస్ అంటే అర్థం పహలా పచ్చీస్ అని ఒక మహానుభావుడు చెప్పాడు. అంటే నూరేళ్ల జీవితంలో మొదటి పాతికేళ్లూ హుషారుగా, ఊపుగా సాగిపోతాయి. ఆ ఉత్సాహం ఆ తర్వాత ఉండదు. అందుకని దాన్ని పహలా పచ్చీస్ అంటారు. ఆ తర్వాత అది పైలా పచ్చీస్‌గా మారింది. అనసూయమ్మ జీవిత మంతా హుషారుగానే సాగింది.

అనసూయమ్మ, వరలక్ష్మి కావటానికి అక్కచెల్లెళ్ళే అయినా ఇద్దరి జీవితాల్లో కొండంత అంతరం ఉంది. అనసూయమ్మ వరలక్ష్మికి అక్క. తొలి సంతానం కాబట్టి కట్నం బాగా ఇచ్చి మంచి సంబంధం చేశారు. ఆస్తిపరుల సంబంధం. భర్త కూడా ఆమెకి తగ్గట్లే దొరికాడు.

అనసూయమ్మ ఎంత డబ్బునైనా సరే నిమిషాల్లో ఖర్చుపెట్టగల మనిషి. ఎన్నాళ్లు కూర్చుని తిన్నా తరగని ఆస్తిని, ధుమ ధుమా ఖర్చుచేసి హారతి కర్పూరంలా కరి గించి వేసింది. పెళ్ళయిన కొత్తల్లో, ఆ పాత కాలంలోనే అనసూయమ్మ భర్తా బొంబాయికి వెళ్ళి కొన్నాళ్లు గడిపి వచ్చారు. దానికోసం కొన్ని ఎకరాలు కరిగి పోయినా అనసూయమ్మ ఏమాత్రం బాధ పడలేదు. ఏరోజు చూసినా చక్కటి చీరెలూ, నగలూ, పువ్వులూ వగైరా మేక ప్‌తో విలాసంగా గడిపేది. నిల్చున్న మనిషి అట్లాగే పెళ్ళికి వెళ్ళి రాగలిగినంత మేకప్‌తో నిత్యం అలరారేది. ఆ రోజుల్లోనే బోలెడన్ని ఫంక్షన్లు చేసుకుని, ఆ ఫంక్షన్లకి సినిమా వాళ్ళని కూడా పిలిచి, ప్రోగ్రా మ్‌లు ఇప్పించి బంధుమిత్రుల్ని హడలగొ ట్టేది. అనసూయమ్మ పలకరిస్తే చాలు అని బంధుజనం పులకరించేవాళ్ళు. వయ సులో ఉన్నప్పుడు రక్తిమార్గం, ఆ తర్వాత భక్తి మార్గం పట్టినా ఏ మార్గమైనా ఒక రిచ్‌లుక్ లేనిది ఆవిడకి నచ్చేదికాదు. భజ నలు చేసినా అవి కూడా మామూలు భజ నలు కాకుండా ఆవిడ లెవెల్‌కి తగ్గరీతిలో ఉండేవి. వచ్చేవాళ్ళు కూడా మామూలు మనుషులు కాకుండా ఒక రేంజ్‌కి తగ్గని మనుషులే. వాళ్ళకి తగ్గట్లే అనసూయమ్మ ప్రసాదాలూ, పిండివంటలూ గొప్ప గొప్ప వంటవాళ్ళతో చేయిస్తుండేది. ఆ పూలూ, దేవుళ్ళ అలంకరణలూ, ఆ వంటలూ చూసి హడిలిపోని మనుషులు లేరు.

కాలం ఎప్పుడూ ఒకేలా నడవదు. ఆ విధంగానే అనసూయమ్మకి కష్టాలు వచ్చి పడ్డాయి. కోడళ్ళకి కూడా అరవై ఏళ్ళు వస్తున్నాయి. ఇంతవరకూ ఏదో భయా నికో, భక్తికో అత్తగారి మాట విన్నారు. ఇప్పుడు అదీ కుదరటం లేదు. వాళ్ళకి కూడా కోడళ్ళు వచ్చారు. వాళ్లు తమ అత్త గార్లనే లెక్క చెయ్యటంలేదు. ఇక అత్తగారి అత్తగారు అనసూయమ్మని చూస్తే వాళ్ళకి ఏమాత్రం లెక్కలేదు. ఆస్తంతా తగలేసిం దని అనసూయమ్మ మీద కోడళ్ళకి కూడా కోపంగానే ఉంది. ఆ పైన అగ్నికి ఆజ్యం తోడయినట్లు వాళ్ళ కోడళ్ళు తయారవ య్యారు. చాలక అనసూయమ్మకి ఒంట్లో బాగుండటం లేదు. ఆవిడకి చాకిరీ చేసేం

దుకు ఎవరూ సిద్ధంగా లేరు.

అందువల్ల ఆవిడ్ని ఇంట్లోంచి తరిమెయ్యటానికే అంతా నిశ్చయించుకున్నారు. వార్ధక్యం మనిషిని ఎంత కృంగదీస్తుందో అనసూయమ్మకి అప్పుడు అర్థమైంది. అన్నాళ్ళూ పులిలా బతికిన మనిషి లేడిపిల్లలా యువతరం ముందు తలదించాల్సి వచ్చింది. ఆవిడకి ఏడుపు వచ్చింది. కోపం వచ్చింది. అవమానం అనిపించింది. వీటిల్లో ఏది వచ్చినా ఆవిడ లోకం మొత్తం తలకిందులు చేసేది. ఆ రోజులు పోయాయి. ఇప్పుడు తన గోడు అరణ్యారోదన. కనక వాళ్ళు చెప్పినట్లు వినటం తప్ప చేయగలిగిందిలేదు.

ఆవిడకి పెన్షన్ వగైరా ఏం లేవు. ఆస్తిని మొత్తం కరిగించేసింది. ఆవిడకి అంటూ ఏ మాత్రం ఏదీ లేదు.

ఇంక వాళ్ళు చెప్పింది వినక తప్పదు. వాళ్ళు నెలకి తలా వెయ్యి వేసుకుని ఇస్తామన్నారు. వృద్ధాశ్రమంలో చేరమన్నారు.

ఇక్కడ హైదరాబాద్ శివార్లలో ఒక వృద్ధాశ్రమం ఉంది. దాని పేరు ఆనంద స్వామి వృద్ధాశ్రమం. ఆనందస్వామి అనే స్వామీజీ ముసలివాళ్ళకోసం ఒక ఆశ్రమం పెట్టాడు. అందులో మరీ అనాథలైతే ఒక తీరు. అంతా ఫ్రీగా ఇస్తారు. కానీ అందరికీ కలిపి ఉంటుంది. ఒకే పెద్ద హాల్లో అంతా నిద్రించాలి. వాళ్ళు చెప్పినట్లు వినాలి. వాళ్లు చెయ్యమన్న పని చేస్తుండాలి. కానీ అదే ఆశ్రమంలో నెలకి ఇంతని డబ్బు కట్టించుకుని ఆశ్రయం ఇస్తారు. వాళ్లోగది ప్రత్యేకంగా వాడుకోవచ్చు. అటాచ్డ్ బాత్‌రూమ్ కూడా ఉంటుంది. వాళ్ళు ఏ పనీ చెయ్యక్కర్లేదు కూడా. వాళ్ళకి ట్రీట్‌మెంట్ కూడా బాగుంటుంది. వాళ్ళని ఎవరూ ఏమీ అనరు, అడగరు. కావాలంటే ఎక్కడికన్నా కొన్నాళ్ళు పోయి వస్తూండ వచ్చు కూడా. అన్ని విధాలా ముసలి వాళ్ళకి అది హాయిగా ఉంటుంది. వైద్య

**కొత్తగాలి...**

**నాగుండె పొలిమేరల్లో**
**నువ్వెప్పుడూ**
**మిణుక్కుమంటూ**
**వెలుగుతుంటావు**
**ఎందుకనో?**

**– డి.శిరీష, అనంతపురం**

సదుపాయం కూడా ఉంది. నెలకి అయిదు వేలు కట్టాలి. అనసూయమ్మ పిల్లలు ఆ అయిదువేలూ అందిస్తామన్నారు. అనసూయమ్మ పెట్టె సర్దుకుని హైదరాబాద్‌కి ప్రయాణమైంది. వస్తూ వస్తూ వరలక్ష్మికి ఫోన్ చేసింది.

అంతా అనసూయమ్మని తల్చుకుని నిట్టూర్చారు. జీవితం అంతా ఒక్క వెలుగు వెలిగిన అనసూయమ్మ చివరికి వృద్ధాప్యంలో ఇట్లా ఆశ్రమంలోకి చేరటం వాళ్ళకి బాధ కలిగించింది.

వాళ్ళకి ఇంతవరకూ తెలిసిన అనసూయమ్మ వేరు. ఆవిడ వైభవంతో వెలిగిపోతూ ఉండేది. ఆవిడ చుట్టూ ఎప్పుడూ కనీసం ముగ్గురైనా మనుషులుండేవాళ్ళు. ఇప్పుడు ఆవిడ ఒక్కత్తే వస్తున్నదిట. వృద్ధాశ్రమంలో చేరటం ఆవిడకి ఎంత బాధాకరంగా ఉందో ఏమిటో? ఆవిడని ఎట్లా సముదాయించాలి? అసలు ఎట్లా ఆవిడతో మాట్లాడాలి? అంతా భయపడ్డారు. ఆవిడ భోరుమంటే ఏం చెయ్యాలి? పోనీ తమ ఇంట్లో తమతో పాటూ ఉండమందమా? రకరకాల భయాలూ, ఆలోచనల మధ్య తెల్లవారింది.

అనసూయమ్మ బండి దిగింది. హరనాథ్ వెళ్ళి ఆవిడ్ని రిసీవ్ చేసుకున్నాడు. అనసూయమ్మ దిగులుగా లేదు. మామూలుగానే ఉంది. ఎప్పటిలాగే ఉంది.

## కొత్తగాలి...

**పడికట్టు పదాలు**
**పురుడు పోసుకుంటే**
**ప్రపంచీకరణలో**
**డాలర్లు దొర్లుతాయి**

– శ్రీమాన్ శ్రీకాశ్యప,
సింహాచలం

ఏమో అనుకుంటారు గానీ ఏదీ మనిషిని పెద్దగా ప్రభావితం చెయ్యలేదేమో అనిపించింది పద్మజకి. ఏదో ఒకటి జరిగిపోతుంటే చాలు, మనిషి జీవించేయగలడు. మరీ మిన్ను విరిగి మీద పడితే మాత్రం ఏమన్నా చలిస్తారేమో. లేకపోతే మాత్రం మామూలు కష్టాలు మనిషిని ఎన్నో రోజులు బాధ పెట్టలేవు.

అనసూయమ్మ మామూలుగానే ఉంది. నవ్వుతూనే మాట్లాడుతోంది. వృద్ధాశ్రమం కబుర్లన్నీ హుషారుగానే చెపుతోంది. పిల్లలు స్కూల్‌కి పోవటం, పెద్దవాళ్ళు ఉద్యోగాలకి పోవటంలాగే ముసలివాళ్ళు వృద్ధాశ్రమాల్లో చేరటం కూడా జీవన విధానంలో ఒక మలుపు అని ఆవిడకి అనిపించినట్లుంది.

ఆనందస్వామి గురించి కూడా హుషారుగా కబుర్లు చెప్పింది. ఆయన చిన్న వయసులోనే హిమాలయాలకి వెళ్లిపోయారుట. అక్కడ తపస్సు చేసి, బోలెడంత సాధనచేసి అనేక శక్తులు సంపాదించారుట. అక్కడ ఒక ఆశ్రమం కూడా స్థాపించుకున్నారుట. ఆయనకి బంగారాన్ని చేసే విద్య తెలుసుట. ఆకాశంలో ఎగురుతారుట. ఇంకా ఎన్నెన్నో మహిమలు శిష్యులకి చూపించారుట. ఆయన ఈమధ్యే సమాధి పొందారుట.

ఆయన శిష్యులు ఒక ట్రస్టుగా ఏర్పడి, కొన్ని కార్యక్రమాలు నిర్వహిస్తుంటారుట. అందులో ఒకటి ఈ వృద్ధాశ్రమం. కొన్ని ఖర్చులు వాళ్ళు భరించటం వల్ల అంత చవగ్గా దొరుకుతోందిగానీ, లేకపోతే అట్లాంటి ఆశ్రమానికి నెలకు పదివేలన్నా కట్టాలిట.

అనసూయమ్మ వచ్చిన సంగతి విని, చుట్టుపక్కల వాళ్ళు చూసిపోవటానికి వచ్చారు. అందరికీ అది ఒక విశేషంగానే ఉంది. కొందరు వృద్ధులు ఆశ్రమం గురించి తెలుసుకోవటానికి వచ్చారు.

"అక్కడికే పోతే మంచిదనిపిస్తోంది నాక్కూడా. ఏ జంజాటమూ ఉండదు. హాయిగా ఉండొచ్చనిపిస్తోంది" అంది రెండిళ్ళ అవతల ఉండే మామ్మగారు.

"ఎక్కడికి పోయినా ఉండే గొడవలు ఉండనే ఉంటాయి. అక్కడా పాలిటిక్స్ ఉంటాయి"

"రాజకీయాలు లేనిదెక్కడ? గ్రూపులు కట్టటం, గోతులు తవ్వటం అన్నిచోట్లా ఉంటాయి"

"ఇంకెందుకు అక్కడికి పోవటం? "

"ఏం చేస్తాం. ముసలి వాళ్ళంటే ఎవరికి లెక్క? ఇంట్లో చెత్త చేరితే బయట పారేస్తారు. ముసలివాళ్ళని ఆశ్రమాలకి తరుముతారు"

"అయ్యో అనసూయమ్మ తల్లీ. నీకెంత కష్టం వచ్చింది. సొంత పిల్లలు నిన్ను ఆశ్రమానికి తరిమేస్తుంటే బాధగా లేదూ? "

నలుగురూ నాలుగు రకాలుగా మాట్లాడుతుంటే పద్మజకి భయం వేసింది. పాపం అనసూయమ్మ ఏదో గుండె చిక్కబట్టుకుని, ఆశ్రమంలో చేరటానికి సిద్ధంగా ఉంటే వీళ్ళంతా కలిసి ఆవిడ మూడ్ చెడగొడతారేమోనని భయం కలిగింది.

అనసూయమ్మ వైపు చూసింది. ఆవిడ మొహంలో ఏ మార్పూ లేదు.

అనసూయమ్మ గొప్ప భోగి. ఆవిడ చీరెలూ, నగలూ, కార్లూ, మేడలూ, భోజన

విధానం అన్నీ చాలా గొప్పగా ఉండేవి. ఇవన్నీ వదులుకుని ఒక నియమబద్ధమైన, సామాన్య జీవితం గడపటం, అందులో తన వారెవ్వరూ లేకుండా ఎక్కడో ఉండటం ఆవిడలాంటి భోగికి చాలా బాధ కలిగించాలి. కానీ ఆవిడ మొహంలో మార్పులేదు. మామూలుగా ఉంది.

"అదంతా మనం అనుకోవటంలోనే ఉంది. అంతా మనవాళ్ళే అనుకోవాలి. ఆనందస్వామిగారు కూడా అదే చెప్పారు. ఆయన గ్రంథాలూ, ఉపన్యాసాల సీడీలూ మార్కెట్లో దొరుకుతాయి. మీరు కూడా తెప్పించుకుని చదవండి" అంది.

అనసూయమ్మ ఇదివరకే భక్తిమార్గం పట్టినా అది కేవలం షో బిజినెస్ తప్ప మరొకటి కాదని అందరికీ తెలుసు. సినిమాలు, షికార్లు, విహారయాత్రలూ షష్టి పూర్తి అయ్యాక కూడా విరివిగా వెళ్తుంటే బాగుండదని వాటికి బదులు ఎంచుకున్న కాలక్షేపం భక్తిమార్గం. మరి ఆవిడకి ఈ మార్గంలో ఆనందస్వామిగారు ఎదురయ్యారో లేదో ఎవరికీ తెలియదు. ఆవిడ ఆ స్వామిగారి గురించి ఎన్నడూ మాట్లాడలేదు. ఇప్పుడు ఆవిడ అవసరం ఆవిడ్ని అటు నడిపినట్లుంది.

ఆ తర్వాత అందరూ కోడళ్ళ గురించి చర్చించారు. "ఏంటో, అనసూయమ్మ తన కోడళ్ళని ఎంత బాగా చూసుకుంది. తన అత్తగారిని కూడా ఎంత బాగా చూసుకుంది. చివరికి ఆవిడకి చేయాల్సి వచ్చేసరికి ఇంత గొడవ చేస్తున్నారు."

"అంతే. అందరికీ అన్నీ చేస్తారుగానీ వాళ్ళకి చేసే వాళ్లుండరు"

"మా తోటికోడలి చెల్లెలు లేదూ... అత్తగారిని అడవులు పట్టించింది. మామగారు పోతే కూడా ఆవిడ్ని పట్టించుకోలేదు. చివరికి ఆవిడ్ని దిక్కులేని దానిలా వదిలేసింది. ఇవన్నీ చూడలేక ఆవిడ కూతురు అమెరికాలో ఉంటుంది, అమె వచ్చి తీసుకుపోయింది. అక్కడే స్థిరంగా ఉండిపోయింది ఆవిడ. అక్కడ ముసలివాళ్ళకి ఇచ్చే పెన్షన్ ఈవిడకి కూడా ఇప్పించారు. నెలకి చాలానే వస్తుందట. అక్కడి వృద్ధాశ్రమాలు కూడా చాలా గొప్పగా ఉంటాయిట. ఆవిడ బాగా పెద్దదైపోయింది. అక్కడ చేరిపోయింది. వాళ్ళకి నెలకింతని కట్టగా ఇంకా చాలా డబ్బు మిగుల్తోందిట. ఆవిడ ఆ డబ్బు మిగుల్చుకుని ఇక్కడ తన కోడలికి పంపింది. ఆమె సిగ్గులేకుండా ఆ డబ్బుతో రవ్వల దిద్దులు కొనుక్కుంది. అయ్యో అత్తయ్యగారిని ఏనాడైనా చూశామా? ఆవిడ డబ్బుమీద మనకి ఏం అధికారం ఉంటుందని అనుకుందా? ఆవి

## గ్రాంథికంతో తంటా

ప్రముఖ దర్శకుడు బాపు ఓ షూటింగ్ సందర్భంగా ఒక పరమాద్భుత జోక్ పేల్చారు.

ఒక సన్నివేశంలో ఓ నటి తన డైలాగ్



'బతుకు' పదాన్ని వ్యావహారికంలో ఒత్తు లేకుండా పలకమని బాపు పదేపదే చెప్పినా 'టేక్' సమయంలో ఆమె 'బ్రతుకు' అని గ్రాంథికంగా అంటోంది.

అప్పుడు బాపు 'అమ్మా నీకు 'బ్రా' వద్దమ్మా 'బా' చాలు' అన్నారు సందర్భోచితంగా.

ఆ నటి సహా సెట్‌లోని వారంతా ఫక్కున నవ్వేశారు.

డని అన్ని తిప్పలు పెట్టి సతాయించింది. అట్లాంటి మనిషికి అట్లాంటి అత్తగారు. అంతే మంచితనానికి కాలం కాదు."

"ఏం చేస్తాం? సొంత మనుషుల్ని కాద నుకోలేం కదా."

"అంతే."

ఎవరేం మాట్లాడినా అనసూయమ్మ నవ్వుతూ వింటూ ఉండిపోయింది. ఆశ్రమంలో చేరాక ఇక ఎవరేం అన్నా నవ్వుతూ ఉండిపోతే ఏ తగాదాలూ ఉండవు. ఆ చిట్కాని ముందే ప్రాక్టికల్‌గా పాటిస్తున్నట్లుంది.

అంతా వెళ్లాక పద్మజ నిట్టూర్చింది.

అత్తగారి మొహంలో కాస్త బాధ, భయం కనిపించాయి. ఏదో ఒకనాటికి నేను కూడా ఆ ఆశ్రమానికి వెళ్ళాలా అన్న దిగులు ఆవిడ కళ్ళల్లో కనిపించింది.

"ఏం కూర వండమంటారు అత్తయ్యా"

వరలక్ష్మి ఉలిక్కిపడింది.

"బీరకాయ వండు" అంది.

పద్మజ లేచి బీరకాయల్ని తరగటం మొదలు పెట్టింది.

మర్నాడు ఆనందస్వామి ఆశ్రమానికి బయల్దేరారు. ఊరికి చాలా దూరంలో ఉన్న ఆశ్రమం అది. అక్కడికి బస్సులు లేవు. ఆనందస్వామిగారి భక్తులంతా కార్లు ఉన్నవాళ్లేనట. ఎవరో, ఎప్పుడో కార్లు లేని వాళ్ళు వచ్చినా వాళ్ళూ అద్దె కారునో, ఆటోనో రానూపోనూ మాట్లాడుకునే వస్తారుట. ఆశ్రమం వాళ్ళకి బస్సులున్నాయిట గానీ అవెప్పుడు వస్తాయో తెలీదుట.

హరనాథ్ ఆశ్రమానికి రానూ పోనూ ఆటో మాట్లాడాడు. నాలుగు వందల రూపాయలకి బేరం సెటిలయింది. అక్కడ ఒక రెండు గంటలపాటు వెయిట్ చేస్తానన్నాడు. ముందుగా వెళ్ళి అన్నీ చూశాకే ఆవిడ్ని చేర్పించాలనుకున్నారు.

ఊరు దాటాక చాలా దూరం ప్రయాణించి, పక్కనున్న మరో రోడ్డువైపు ఆటో వెళ్ళింది. అక్కడ్నుంచి మనోహరమైన ప్రకృతి దర్శనమివ్వసాగింది. రోడ్డుకి రెండువైపులా చెట్లు, తోటలు. అక్కడక్కడా వరి కూడా పండిస్తున్నారు. అంతటా పచ్చదనం, చల్లదనం. దూరంగా అందమైన కొండ. కొండమీదికి తారురోడ్డు. కొండ మీద ఆనందస్వామిగారి ఆశ్రమం.

మామూలుగా ఉంటుందనుకున్న పద్మజ, హరనాథ్ ఆ కొండనీ, చెట్లనీ, లోపల భవనాలనీ చూసి ఆశ్చర్యపోయారు.

కొండ చుట్టూ ఉన్న తోటల్ని కూడా ఆశ్రమంవాళ్ళు కొనేశారుట. ఆ తోటలోనే వృద్ధాశ్రమం ఉంది. పైన ఉన్న కొండమీద బిల్డింగులు ట్రస్ట్ మెంబర్స్ ఉండటానికి.

ఒక ప్రదేశాన్ని సుందరవనంగా ఎట్లా తీర్చిదిద్దవచ్చో చెప్పాలంటే ఆ ఆశ్రమం గురించి చెప్పాలి. ప్రతి అంగుళంలో ఒక అందం, ప్రతి అణువులో ఒక రమణీయత. ఆ ఆశ్రమం దగ్గరికి వెళ్ళగానే సువాసనలు గుప్పుమంటున్నాయి. జాజి, మల్లె, మాలతి, విరజాజి, తీగెలు తీగెలుగా అల్లుకుపోయి ఉన్నాయి. మరువం, దవనం, లిల్లీలు, చేమంతులు, గులాబీలు, బంతులు, మందారాలు, రాంబాణాలు ఒకటేమిటి, అన్నిరకాల పూల చెట్లూ ఉన్నాయి. పళ్ళ తోటల్లో ఉన్న మామిడి, పనస, అరటి, జామ, సపోటా, బొప్పాయిలాంటి రకరకాల చెట్లు ఏపుగా ఎదిగి ఉన్నాయి. ఆ తోటల పోషణ అంతా వృద్ధాశ్రమంలోని వాళ్ళే చూస్తారుట.

ముందుగా ఆలయంలోకి వెళ్ళి దైవ దర్శనం చేసుకున్నారు. అందమైన పాలరాయి శ్రీ కృష్ణుడి విగ్రహం. పూలమాలలు, పూలతో మండపం అంతా అలంకరించారు. వాటి పరిమళంతో గుప్పుమని మనసుకి హాయికలుగుతోంది. అగరు

# ఇకలే.. పోదాం!

అనాటి నిజం

మహావైద్యనాథయ్యార్ 19వ శతాబ్దిలో తిరువాయూరులోని ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు. ఆయనది కంచు కంఠం. అందువల్ల ద్రుతంలో పాడే వారు. అయినా ఆ గానంలో స్వరం, ఉచ్చారణ విడి ముత్యాలవలె స్ఫుటంగా ఉండేవి. మంచి కంఠస్వరం కోసం భోజనంలో నిత్యం మిరియాల చారు ఉండాల్సిందే! మధ్యాహ్నం నిద్ర నిషిద్ధం. స్త్రీ పొందును కూడా త్యజించాడు. అందుచేత ఆయన ఒంటరి. అన్నగారూ అతనితో ఉంటూ కంటికిరెప్పలా చూసుకునేవారు.



వైద్యనాథయ్యర్ సంగీత కచ్చేరీల వ్యవహారాలను అన్నగారే చూసుకొనేవారు. ఒకసారి ఓ ధనికుని ఇంట్లో కచ్చేరి. విద్వాంసుడికి సంభావనగా ఇవ్వదలచిన అమూల్య వస్త్రాభరణాల తట్ట సభ మధ్యలో ఉంచారు. అయ్యర్ భైరవిరాగం, రూపక తాళాలలో 'చింతయ మాకంద మూలకందం' కీర్తనతో ప్రారంభించారు. అద్భుతంగా పాడి సభికులను గంటకు పైగా సమ్మోహనం చేశారు.

ఇంతలో షావుకారుకు మరో కీర్తన వినాలనిపించింది. ఆ పాట పల్లవిని చీటిపై రాసి, దానిని మహావైద్యనాథయ్యార్ అన్నగారి చేతిలో ఉంచారు. దాన్ని చదువుకొని కోపోద్రిక్తుడైన ఆయన తమ్ముడితో 'తంబూరాకు ముసుగు వేసి, లేచి పద' అన్నాడు. అయ్యార్ మారుమాట్లాడకుండా లేచాడు. దీంతో ఆ షావుకారు 'తప్పు చేశాను. క్షమించండి' అని చేతులెత్తి మొక్కాడు. సభికులందరూ అచ్చెరువొందారు.

అయ్యర్ అన్నగారు, 'కళాకారులకు స్వాతంత్ర్యం పోయే కాలం వచ్చింది. తన మనస్సుకు నచ్చినది కాకుండా శ్రోత ఇష్టానుసారం పాడాల్సివస్తే ఈ కచ్చేరీలెందుకు? ఇకపైన నీ సంగీతం నీ ఆత్మానందానికి, ఆత్మోద్ధరణకే గాని, కచ్చేరీలకు గాదు. ఇక పోదాం పద' అని తమ్ముడిని పిలుచుకొని సభ విడిచి వెళ్లారు. మహావైద్యనాథయ్యార్ గారికి అదే ఆఖరు కచ్చేరి.

సుగంధం, గంధం సువాసన ఆ పరిస రాళ్ని ముంచెత్తుతున్నాయి. తోటలు, ఆ పూలు, ఆ గుడి మనసుకి ప్రశాంతత కలిగిస్తున్నాయి. చీకాకులని తొలగించటానికి పరిసరాలు దోహదపడతాయని అందుకే కాబోలు అంటారు.

అక్కడ కాస్సేపు గడిపి, ఆఫీసుకి బయల్దేరారు. ఆఫీసు మేనేజరు రంగరాజమ్మ. ఆవిడ ఎప్పుడో ఆనందస్వామికి భక్తురాలై ఆయన్నే నమ్ముకుని, చేస్తున్న ఉద్యోగం వదులుకుని వచ్చిందిట. ఆవిడ ప్రభుత్వోద్యోగం చేసిందట. ఏ చీకూచింతా లేని ఉద్యోగం. రిటైరైతే పెన్షన్ కూడా వచ్చే ఉద్యోగం. అయినా సరే స్వామిని నమ్ముకుని, వదులుకుందిట. స్వామి ఆవిడకి కలలో దర్శనం ఇచ్చి అన్నీ వదులుకుని తనని అనుసరించమన్నారుట.

"ఎట్లా స్వామీ. ఇంకో అయిదేళ్లు పోతే నాకు ఇరవై ఏళ్ల సర్వీసు పూర్తవుతుంది. అప్పుడు నాకు పెన్షన్ వస్తుంది. ఈ లోపల ఉద్యోగం మానుకుని ఏం లాభం? " అందట రంగరాజమ్మ.

స్వామి నవ్వారట.

"నువ్వు పెన్షన్ నమ్ముతావు గానీ నన్ను నమ్మవా? " అని అడిగారుట.

అంతే. రంగరాజమ్మకి పట్టుదల వచ్చేసిందిట. నమ్మకం అంటే పూర్తి నమ్మకం ఉండాలి. ఊరికే నమ్మాను అనుకుంటే లాభం లేదు. సర్వం స్వామికి అర్పించి, ఆత్మసమర్పణ చేసుకుంటే ఇంక ఆయనే అంతా చూసుకుంటారు. అంతే. మర్నాడే ఉద్యోగం వదిలేసి, స్వామిని అనుసరించింది. ఆ తర్వాత ఆమె దేనికీ బాధపడాల్సిన అవసరం రాలేదు. అన్ని అవసరాలూ ఏ లోటూ లేకుండా స్వామి చూసుకున్నారు. ఆయన సమాధి చెందాక



కూడా ఆవిడకి మంచి గుర్తింపే ఉంది. దేనికీ లోటు లేకుండా గడిచిపోతోంది.

"నమ్మిన వాళ్ళకి స్వామి ఏనాడూ ఏ లోటూ రానివ్వరు. అన్నీ ఆయనే చూసుకుంటారు" ఆవిడ నవ్వుతూ చెప్పింది.

వాళ్ళకి అక్కడ జరిగే కార్యక్రమాలన్నీ వివరంగా చెప్పింది.

"పొద్దున్న పాలూ, కాఫీ, హార్లిక్స్ ఇస్తారు. ఏది కావాల్సిన వాళ్ళు అది తాగొచ్చు. తొమ్మిది గంటలకి ఇడ్లీ, ఉప్మా లాంటివి పెడతారు. ఒంటిగంటకి లంచ్. సాయంత్రం బిస్కెట్లు, టీ లాంటివి ఉంటాయి. రాత్రి ఏడు గంటలకి భోజనం. మధ్యలో ఆవిడ కావాలంటే ఆశ్రమం కార్యక్రమాల్లో పాలుపంచుకోవచ్చు. లేకపోతే తన గదిలోనే టీ.వీ. చూసుకోవచ్చు. చదువుకోవాలంటే లైబ్రరీ ఉంది. అంతా ప్రేమగా, ఆత్మీయంగా పలకరిస్తారు. ఇంట్లో ఉన్న దానికన్నా హాయిగా ఉండవచ్చు" చెప్పింది ఆవిడ.

ఆ వాతావరణం, ఆ పరిసరాలు చూసి అనసూయమ్మ ఆనందంగా తల ఊపింది.

"నేను చేరిపోతాను" అంది.

హరనాథ్, పద్మజ తల ఊపారు.

అడ్వాన్స్ కట్టి, ఆమెకి ఇవ్వబోయే రూమ్ చూశారు. గాలీ, వెలుతురూ బాగా వస్తాయి. అటాచ్డ్ టాయిలెట్ ఉంది.

"బాగుంది. నాకు నచ్చింది" అంది అన



సూయమ్మ. హరనాథ్ తల ఊపాడు.

మళ్ళీ అందమైన తోటల మధ్య నుండి నడుస్తూ తిరిగి వచ్చి, ఆటో ఎక్కారు.

"ఏం ఆశ్రమం సార్ ఇది" ఆటోడ్రైవర్ అడిగాడు.

"ఆనందస్వామి ఆశ్రమం"

"మీరు ఆయనకి భక్తులా? "

"కాదు. ఇక్కడ ముసలివాళ్లకి ఆశ్రమం ఉంది. ఈమె మా పెద్దమ్మ. ఇక్కడ చేర తానంటే వచ్చాము"

"అట్లాగా సార్. మా పెద్దమ్మకి కూడా వయసైపోయింది. ఎవరూ లేరు. ఇక్కడ చేర్పించుకుంటారా? " అడిగాడు అతను.

"అడిగి చూడు" అన్నాడు హరనాథ్.

ఈ ఆశ్రమం వాళ్ళు బీదవాళ్ళని కూడా చేర్పించుకుంటారు. ఆ సంగతి చాలామందికి తెలియదు. నిజానికి ఇప్పుడు అనసూయమ్మతో వచ్చిందాకా తనకూ తెలియదు.

"ఏమో సార్ ఎందుకులెండి? ఎందులో ఏ మోసం ఉందో" అన్నాడు ఆటోడ్రైవర్.

"సరే నీ ఇష్టం. ఫోన్ నెంబర్ ఇదుగో. కావాలనుకుంటే వాళ్ళకి ఫోన్‌చేసి మాట్లాడు" అన్నాడు హరనాథ్, అడ్రస్ కాగితం అతనికిస్తూ.

ఆ చెట్లూ, తోటా, ప్రకృతీ చూస్తూ తిరిగి ఇంటిదారి పట్టారు.

మర్నాడే అనసూయమ్మ ఆనందస్వామి గారి ఆశ్రమంలో చేరిపోయింది.

వెళ్తున్నప్పుడు మాత్రం వరలక్ష్మిని కౌగి లించుకుని కన్నీరు పెట్టుకుంది.

"అదృష్టవంతురాలివి. నీకు తగ్గ కోడలు దొరికింది" అంది.

అనసూయమ్మ ఎక్కిన ఆటో కనుమ రుగై పోయేంతవరకూ వరలక్ష్మి చూస్తూనే ఉండిపోయింది.

అనసూయమ్మ మహాభినిష్క్రమణం చూడటానికి చుట్టుపక్కలవాళ్లు చాలా మంది వచ్చారు.

అంతా వరలక్ష్మినీ, ఆమె అదృష్టాన్నీ పొగిడినవాళ్లే.

వరలక్ష్మి కాసేపు వాళ్లతో మాట్లాడి, తిరిగి ఇంట్లోకి వచ్చింది.

నిజానికి నిన్నటివరకూ వరలక్ష్మి తన అక్క అనసూయమ్మ అదృష్టానికి ఆనం దిస్తూ ఉండేది. కానీ నిన్నటినుంచి సీన్ మొత్తం మారిపోయింది. అంతా వరల క్ష్మిదే అదృష్టం అంటున్నారు.

అసలు అదృష్టం అంటే ఏమిటి? కష్టం అంటే ఏమిటి?

అనుకున్న విధంగా జీవించగలగటం అదృష్టం. ఇష్టం లేనిది కష్టం.

మరి అనసూయమ్మ జీవిత చర మాంకం వరకూ హాయిగా, తాననుకున్న విధంగా జీవించేసింది. చివరి దశలో ఈ స్థితి వచ్చింది. ఇప్పటికీ సౌకర్యాలకి ఏ లోటూ లేదు. తనవాళ్ళు దగ్గర లేరన్న లోటు తప్ప ఏ లోటూ లేదు.

కానీ తను? జీవితమంతా ఒక గొప్ప పోరాటం జరిపింది. ప్రతిరోజూ ఒక గొప్ప శ్రమదినం. నిరంతర శ్రమ ఫలితంగా నేమో, ఈరోజు భగవంతుడు కాస్త ప్రశాం తమైన వృద్ధాప్యాన్ని ప్రసాదించాడు.

వరలక్ష్మి నిట్టూర్చింది. జీవితమంతా ఒక ఎత్తు, వార్ధక్యం మరో ఎత్తు అన్నారు కొందరు.

"ప్రతీవాళ్ళకీ వార్ధక్యంలో సుఖంగా, శాంతిగా ఉండే భాగ్యం ప్రసాదించు తండ్రీ" వరలక్ష్మి దేవుణ్ని ప్రార్థించింది.




ఆరోజు పొద్దున్న పనంతా అయ్యాక తీరిగ్గా కూర్చుంది పద్మజ. ఇంతలో ఫోన్ మోగింది.

"ఏం చేస్తున్నావు? మా ఇంటికి రాకూడదూ? " పద్మజ స్నేహితురాలు రంగమణి అడిగింది.

"అమ్మో... అంత దూరం రాలేను బాబూ" పద్మజ నీరసంగా అంది.

"అంత దూరం అనకు. ఇప్పుడు మీ పక్క కాలనీకి వచ్చేశా" రంగమణి నవ్వింది.

"అవునా? అదేంటి? అసలు..." పద్మజ అడగబోతుంటే రంగమణి ఆపేసింది.

"రా... వచ్చాక అన్నీ తీరిగ్గా చెపుతాను. అడ్రసు రాసుకో" రంగమణి చెప్పింది. ఫోన్ నెంబర్ ఇచ్చింది.

"కావాలంటే ఇక్కడికి వచ్చాక ఫోన్ చెయ్యి. నేను వచ్చి నిన్ను భద్రంగా మా ఇంటికి తీసుకెళ్తాను" అంది రంగమణి.

"అవసరం లేదులే. గుర్తులు కూడా చెప్పావు. ఇన్నాళ్ళనుంచీ ఉంటున్నాను. పక్కనే ఉన్న కాలనీని కూడా గుర్తుపట్ట లేనా ఏంటి? నువ్వు నిశ్చింతగా నీ పనులు చేసుకుంటూ ఉండు. అరగంటలో నీ ముందు వాలతాను" అంది పద్మజ.

అన్నట్లే అరగంటలో రంగమణి ముందు ప్రత్యక్షమయ్యింది పద్మజ.

రంగమణి ఇల్లు అప్పటికే అంతా సర్దేసుకుని ఉన్నట్లుంది. కొత్తగా వచ్చిన ఇల్లులా లేదు. సామానంతా పొందిగ్గా అమర్చి ఉంది. ఇల్లు చాలా చిన్నది. రెండు గదులు, ఒక వంటగది. సామాను చాలా తక్కువగా ఉంది కాబట్టి ఇరుగ్గా లేదు. అంతా చాలా చక్కగా ఎక్కడ ఉండాల్సినవి అక్కడ ఉన్నాయి.

నాలుగు ఫోల్డింగ్ చెయిర్స్, డైనింగ్ టేబుల్, రెండు మంచాలు, వంటింట్లో కాస్త సామాను. అంతా చూస్తే కొత్తగా కాపరానికి వచ్చినట్లుగా అనిపిస్తోంది.

రంగమణికి ఒక్కడే కొడుకు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. ఆమధ్యే పెళ్లయింది. కోడలు కూడా ఏదో కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. కొడుకు పెళ్ళయ్యాక వాళ్ళ డబ్బూ, వీళ్ళ డబ్బూ కూడా కలిపి ఆపైన కాస్త అప్పు కూడా చేసి చాలా గొప్ప ఫ్లాట్ కొన్నాడు. విశాలమైన మూడు బెడ్‌రూమ్‌లు, పెద్ద హాల్, ఆధునికంగా ఫర్నిష్ చేసిన ఫ్లాట్ అది. దాన్ని చూసినవాళ్ళంతా అదిరిపోయి పొగిడి తీరాల్సిందే. అంత అందమైన ఫ్లాట్ అది. రంగమణి కొడుకు మంచి కారు కూడా కొన్నాడు. "ఎంత ముచ్చటగా ఉంది వీళ్ళ ఫ్యామిలీ" అని అంతా మెచ్చుకునేవాళ్ళు. కోడలు కూడా బాగానే కలిసిపోయింది. ఇంక జీవితంలో చెయ్యటానికేమీ లేదు అని అన్పించేంత తృప్తి అయిన జీవితం రంగమణిది. ఒక బెడ్‌రూములో ఆమె, భర్తా, కొడుకూ కోడలూ మరో బెడ్‌రూమ్‌లో, ఇంకొకటి గెస్ట్‌లు ఎవరన్నా వస్తే అన్నట్లు వాడుకునేవాళ్ళు. కిచెన్ చూస్తే చాలా కడుపు నిండిపోయినట్లుండేది.

"జీవితాంతం అద్దె ఇళ్ళల్లో, చాలీచాలని కొంపల్లో కష్టాలు పడ్డావు. ఇన్నాళ్ళకు దేవుడు నీ కష్టాలు తీర్చాడు. హాయైన జీవితం. ఈ ఫ్లాట్ ఒక చిన్న ప్రపంచంలా ఉంది. విశాలంగా ఉంది. చక్కగా ఫర్నిష్ అయింది. ఇప్పటికైనా సుఖంగా వండుకుని, హాయిగా తినే యోగం పట్టింది" అన్నారు బంధువులు.

రంగమణికి ఉన్నది ఒక్కడే కొడుకు. కానీ ఉన్నదంతా వాడికోసమే ఖర్చు పెట్టే వాళ్లు. వాడికి ఏ లోటూ రాకుండా పెంచారు. మంచి స్కూల్లో వేశారు. ట్యూషన్లు పెట్టారు. వాడికోసం వాళ్ళు పడని కష్టం లేదు. వాడిని మంచి పొజిషన్‌లో చూడాలని వాళ్ళు ప్రతిక్షణం తపన పడేవాళ్ళు. వాళ్ళు ఏంతిన్నా తినకపోయినా వాడికి మాత్రం మంచి తిండి, ఆటోలో స్కూల్‌కి వెళ్ళటం, మిగిలిన గొప్ప వాళ్ళ పిల్లల్లాగే విహారయాత్రలు అన్నీ ఉండేవి. వాళ్ళ శ్రమని వాడు వృథా కానివ్వలేదు. చక్కగా చదివి, మంచి ఉద్యోగం సంపాదించాడు. తనకు నచ్చిన అమ్మాయే అయినా వాళ్ళ అనుమతి పొంది మరీ పెళ్లి చేసుకున్నాడు.

మరి సడన్‌గా ఈ మలుపేంటో పద్మజకి అర్థం కాలేదు.

"ఇక్కడకి వచ్చావేంటి? ఇంత చిన్న ఇల్లు. అదీ ఈ ప్రాంతంలో?" అడిగింది.

"అదొక పెద్ద కథ" రంగమణి నవ్వేసింది. "నీకు ఒక్కసారిగా చెప్తే బోర్ కొడుతుందేమో. ఇదుగో ఇవి తింటూ

## కొత్తగాలి...

**కళన్నా, కవితన్నా**
**సుబ్బారావుకి తెగిష్టం**
**కట్‌చేస్తే!**
**కళ ఎదురింటమ్మాయి!**
**కవిత పక్కింటమ్మాయి!!**

– ప్రభాకర్ తల్లాప్రగడ, హైదరాబాద్

విను" రంగమణి చేగోడీలూ, సున్నుండలూ ఒక ప్లేట్‌లో పెట్టి అందించింది. పద్మజ తింటూ ఉండగా, కాఫీ కలుపుతూ రంగ మణి చెప్పిన కథ సారాంశం ఏంటంటే...

కొడుకూ కోడలూ వచ్చాక రంగమణి చాలా సంతోషించింది. అంతా ఒకే ఇంట్లో ఉండేవాళ్ళు. కోడలు దుర్మార్గురాలేం కాదు. చాలామందికన్నా చాలా మంచిది. రంగ మణి అంటే ప్రేమగానే ఉండేది.

ఫ్లాట్‌లో కోడలు లోన్ తీసుకుని చాలా సామాన్లు నింపింది. రంగమణి సంసారం చేస్తూ ఇదివరకు వాడిన పాత డొక్కు సామాన్లన్నీ బీదవాళ్ళకి ఇచ్చేశారు. కొత్త ఫ్లాట్, కొత్త సామాన్లు.

కొడుకూ కోడలూ ఇద్దరూ ఉద్యోగం చేస్తారు. వాళ్ళకి టైమ్ ఉండదు కాబట్టి రంగమణి వంటపని మొత్తం చేసుకునేది. ఇంటికి వాళ్ళ స్నేహితులు వస్తే మర్యాదలు చేయాలి.

కొడుకూ, కోడలు రాగానే చెరో సెల్ ఫోన్‌లో మాట్లాడుతూ సెటిల్ అయిపోతారు. ఏం చెప్పాలన్నా సైగలు చేసి అడగాల్సిందే కానీ వాళ్ళు ఒకపట్టాన ఆ సెల్ ఫోన్ సంభాషణ ఆపరు.

వాళ్ళు తరచూ పార్టీలకి పోతారు. అర్ధ రాత్రిళ్ళు వస్తారు. మేలుకొని తలుపు తీయాలి. ఒక తాళంచెవి వాళ్ల దగ్గరుంచుకుంటే ఆటోమాటిక్ లాక్ ఉంది కాబట్టి తలుపు ఎవరూ తెరవాల్సిన అవసరం లేకుండానే వాళ్లు లోపలకు రావచ్చు. కానీ వాళ్ళు వచ్చిందాకా కాచుకుని కూర్చోవటం అలవాటు. వాళ్ళు వచ్చాక వాళ్ళకి వడ్డించి, వాళ్ళు తృప్తిగా తిన్నాకే నిద్రపోతుంది. కానీ ఒక్కోసారి వాళ్ళు ఎక్కడో తినేసి వస్తారు. ఆఫీసులో లేట్ అయితే తప్పదు. కానీ ఊరికే ఫ్రెండ్స్‌తో గడిపినప్పుడు కూడా లేట్‌గా వస్తారు. వాళ్ళు దాదాపు నిశాచరులు. వాళ్ళకి ఏం చెప్పినా అర్థం కాదు. మనుషులు మంచివాళ్ళేగానీ రంగ మణి బాధని అర్థం చేసుకోరు. వాళ్ళకి ఎంతసేపూ పనీ, ఖాళీ దొరికితే ఎంజాయ్ చెయ్యటం, అంతే. వాళ్ళు పార్టీలకి చెప్పి వెళితే అదో తీరు. కానీ అట్లా చెయ్యరు. వంట అంతా వండాక ఫోన్ చేస్తారు. "అమ్మా, ఇవాళ ఇంట్లో తినడంలేదు" అంటారు. వండింది వేస్ట్ అవుతుంది. చద్దికూరలూ, అన్నాలూ తినరు మళ్ళీ. ఏ పూట వంట ఆ పూట చెయ్యాల్సిందే. వంట అట్లా వేస్ట్ చెయ్యటం రంగమణికి ఇష్టం లేదు. పోనీ మర్నాటికి ఉంచుకుని తామే తిందామన్నా, చద్దన్నాలు తింటే ఒంటికి పడటంలేదు. వండిన వంట అనవసరంగా వేస్ట్ అవుతుందని బాధగా ఉండేది. ఈమధ్య కాలంలో రంగమణీ, భర్తా ఒక ఆధ్యాత్మిక గురువుని ఆశ్రయించారు. ఆయన కొన్ని బోధలు చేశాడు.

"బీదవాళ్ళకి ఏదైనా ఇచ్చినా అవి మీరు కూడా వాడుకునే లెవెల్లోనే ఉండాలి. మీరు తినలేని చద్దన్నాలు వాళ్ళకి పెట్టడం, మీరు కట్టుకోని చినిగిన బట్టలు వాళ్ళకు ఇవ్వటం ఇట్లాంటివి చెయ్యకూడదు. మీరు తినేవి, ఎంత మామూలు తిండైనా సరే, మీరూ తినేవే పెట్టాలి. మీరు కట్టుకునే లాంటి బట్టలే వాళ్ళకి ఇవ్వాలి. ఇంతకన్నా మంచివి కూడా చెయ్యవచ్చుగానీ, ఆ స్థాయికి మాత్రం తగ్గకూడదు"

అందుకని రాత్రి వండినవి పొద్దున్న బిచ్చగాళ్ళకి ఇవ్వటానికి మనస్కరించేది కాదు. ఆ వంటని పారెయ్యబుద్ధీ పుట్టేది కాదు. పోనీ ఎవళ్ళకన్నా ఇద్దాం అన్నా, ఆ అర్ధరాత్రిపూట ఎవరికి ఇవ్వాలి?

కొడుకూ, కోడలూ అది అర్థం చేసుకునే వాళ్ళు కాదు.

"చెప్పి మానెయ్యాలంటే కుదరదమ్మా. ఒక్కోసారి సడన్‌గా ఎవరో డిన్నర్‌కి రమ్మని పిలుస్తారు. సొసైటీలో ఇవన్నీ




మానుకోవాలంటే కుదరదు."

"మానుకోమని అనటం లేదుగా. కాస్త ముందు చెప్తే బాగుంటుంది. ఊరికే వేస్ట్ అవుతుందని కదా మా బాధ. వృథా చేసే హక్కు మనకి లేదు. ఒక్కో గింజా పండిం చటానికి ఎంత బాధపడాలో ఆలోచించు"

"అట్లా అయితే వరదలో మరొకటో వస్తే ఉన్నదంతా వృథా అయిపోదా. లక్షల ఎకరాల్లో భూమి నీట మునుగు తుంది. ఇట్లా మాట్లాడితే కష్టం. పోనీ ఒక పని చేద్దాం. మేం ఇంట్లో తినటం మానేస్తాం. నీకూ, డాడీకి మాత్రం సరిపో యేంత వండుకుంటే చాలు. సమస్య సాల్వ్ అయిపోతుంది."

"అదేం మాటరా. ఇంట్లో తినకుండా రోజూ బయట తింటే మరి ఆరోగ్యం?"

"మా బతుకులే ఇంత. ఏ ఆన్‌సైట్ ప్రాజెక్టో వచ్చి ఏదో దేశానికి పొమ్మం టారు. అక్కడ ఇంట్లో తిండి దొరుకు తుందా? ఏది దొరికితే అది తిని, ఎప్పుడు తీరిక దొరికితే అప్పుడు నిద్రపోగలి గినవాడే ఈ రోజుల్లో బతకగలడు" కొడుకు జవాబిచ్చాడు.

వాళ్ళ పరిస్థితి కూడా రంగమణికి తెలుసు. పూర్తిగా టెన్షన్, స్ట్రెస్ ఉన్న ఉద్యో గాలు, ఉద్యోగ భద్రత లేదు. ఏ రోగమో వచ్చి మూలపడితే ఏమవుతారో తెలీదు. ఎప్పటికప్పుడు ఫ్రెష్‌గా ఉంటూ, ఉద్యోగా నికి తగ్గ సామర్థ్యం పెంచుకుంటూ పోవాలి. వీటన్నిటి మధ్యా వాళ్ళకి రిలీఫ్ ఇచ్చేవి చిన్నాచితకా పార్టీలూ, స్నేహితు లతో కలిసి సరదాగా గడపటం.

వాళ్ల సరదాలకి అడ్డురావటం రంగమ ణికి ఇష్టంలేదు. అట్లాగని పోనీ వాళ్లకి తగినట్లు జీవించే శక్తిలేదు. వాళ్లు తినకపోతే అవన్నీ పారెయ్యటం ఇవన్నీ ఎవరికైనా చిన్న సమస్యలుగా కనిపి స్తాయి. కానీ అనుభవించే వాళ్లకి వాటిని సహించటం చాలా కష్టం.

## ఎందరో మహానుభావులు



మునిపల్లె లక్ష్మీరమణ కుమారి

ఎం.కామ్ చదివి, అకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో అసిస్టెంట్ అకౌంట్స్ ఆఫీస ర్‌గా పనిచేస్తున్నాను. ఇంతవరకూ అయిదు నవలలు చతురలోనూ, రెండు నవలికలు ఆంధ్రభూమి మాసపత్రికలోనూ, ఒక సీరి యల్ నవల నవ్య వారపత్రికలోనూ ప్రచురి తమయ్యాయి. యాభైదాకా కథలు పత్రికలు, ఆకాశవాణి ద్వారా వెలుగు చూశాయి. వివిధ భాషల నుంచి కథలూ, వ్యాసాలూ తెలుగు లోకి అనువాదం చేశాను. నన్ను ప్రోత్సహిస్తు న్న మహానుభావులందరికీ వందనాలు.

**చిరునామా:**
**ఎం.లక్ష్మీరమణ కుమారి,**
అసిస్టెంట్ అకౌంట్స్ ఆఫీసర్,
ఐ.టి.ఎ. సెక్షన్, అకౌంటెంట్ జనరల్
కార్యాలయం, లక్డీకాపూల్, హైదరాబాద్

కోడలు చిన్నపని కూడా చెయ్యదు. అక్కడ పనిమనుషులు సులభంగా దొర కరు. ఇల్లంతా సర్దటం, శుభ్రం చెయ్యటం, వంట, వాళ్ల వేళలకి తట్టుకోవటం ఇవన్నీ రంగమణి చెయ్యలేకపోతోంది.

చివరికి వేరుగా ఉంటేనే మంచిదన్న నిర్ణయానికి వచ్చారు రంగమణీ, భర్తా. వాళ్లని విడిగా ఉంచితేనే బాధ్యతలు తెలు స్తాయి. వాళ్లకీ కష్టం, సుఖం తెలియాలి.

వాళ్లకి చెప్తే వాళ్లు నిర్ఘాంతపోయారు. కాస్త బతిమాలారు కూడా. రంగమణి

మాత్రం ఒప్పుకోలేదు.

ఫ్లాట్ కొనడానికి రంగమణి భర్త కూడా తనవంతు డబ్బు వేసి, కొంచెం అప్పు కూడా చేశాడు. కానీ రంగమణి ఫ్లాట్‌ని పూర్తిగా వాళ్లకే అప్పగించేసి, ఇక్కడ అద్దె ఇల్లు చూసుకుంది.

"అయితే నీకు ఆశ్చర్యంగా లేదా? నువ్వు తప్ప అంతా మమ్మల్ని చూసి విమర్శించిన వాళ్లే. ఇంత చిన్న విషయానికి వేర్లు పడేంతవరకూ వస్తారా? అని తిడుతున్నారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం అంటారు. వాళ్లకి దేనికెంత విలువ ఇవ్వాలో తెలిసి రావాలని చేశాం తప్ప మరేం లేదు" రంగమణి చెప్పింది.

"నాకేం ఆశ్చర్యం లేదు. చిన్నగా కనిపించేవే మనకి బాధ కలిగిస్తాయి. అట్లాంటప్పుడు మౌనంగా భరించడం కన్నా నోరు తెరిచి మన అభిప్రాయం స్పష్టంగా చెప్పడం నయం. నువ్వు ఎవరో అధ్యాత్మిక గురువు దగ్గరికి కూడా వెళ్తున్నానన్నావు కదూ. నీ సాధనకి కూడా పనికి వస్తుంది. ఒక బౌద్ధకథ చెప్పనా? " రంగమణి వైపు చూసింది పద్మజ.

"చెప్పు" ఉత్సాహంగా అంది రంగమణి.

"ఒక ఊళ్లో ఒక బౌద్ధ గురువు ఉండేవాడు. ఆయనకి కొందరు శిష్యులున్నారు. వాళ్లు రోజూ భిక్షాటన చేసి, ఆ తెచ్చిన భిక్షను గురువు ఎదుట పాత్రలలో పోసి సమర్పించేవాళ్లు. ఒకరోజు వాళ్లు అలా చేస్తున్నప్పుడు రెండు బియ్యపు గింజలు నేలమీద పడ్డాయి. శిష్యులు అది చూసుకోలేదు. గురువు అది చూసి "మీరు బియ్యం అట్లా వెదజల్లుతూ వచ్చిన కారణం ఏంటి? " అని గద్దించి ప్రశ్నించారు. శిష్యులు నిర్ఘాంతపోతారు. గురువుగారికి ఎంతో భక్తితో సమర్పించిన బియ్యం చూసి గురువుగారు అట్లా అంటున్నారేమిటని నివ్వెరపోతారు. అప్పుడు గురువు తన ఎదుట పడిన ఆ రెండు బియ్యపు గింజల్ని చూపించి, "ఈ గింజల్ని ఎందుకు కిందపడనిచ్చారు? ఒక్క బియ్యపుగింజ తయారవ్వాలంటే ఎన్నో ప్రకృతి శక్తులు కృషి చెయ్యాలి. అటువంటి గింజలు కొన్ని కలిసి మనకు ప్రాణాధారమై జీవితాన్ని ప్రసాదిస్తున్నాయి. మనం ఎంత సమర్థులమైనా, మన తెలివి ఉపయోగించి ఒక్క బియ్యపు గింజను కూడా ప్రకృతి సహకారం లేనిదే సృష్టించలేం. అటువంటి భగవంతుని సృష్టికి ప్రతిరూపాలు, ప్రాణాధారాలు అయిన ఈ రెండు బియ్యపు గింజలూ మీ దృష్టిలో హీనమైనవా? చేసే ప్రతి ఒక్క పనీ, వేసే ప్రతి ఒక్క అడుగూ పరిపూర్ణమైన శ్రద్ధతో చేయగలిగినవాడు మాత్రమే ఆధ్యాత్మిక సాధనకు అర్హుడు. అలా లేనివారు సాధనకి పనికి రారు" అని చెప్పాడు ఆ గురువు.

ఏ పనిలోనూ నిర్లక్ష్యం పనికి రాదనీ, ధాన్యాన్ని ఎంతో గౌరవంగా చూసుకోవాలనీ ఆ కథ చెప్తుంది.

"చాలాబాగుంది కథ" అంది రంగమణి.

ఈ కాలంలో పొదుపు గురించి ఎవరికి చెప్పినా నవ్వేట్లున్నారు. ఉన్నవాళ్లూ, లేనివాళ్లూ అంతా ఒకటే తీరు. ఏది చూసినా బోర్. కొన్నాళ్లు వాడాక అది ఎంత బాగా ఉన్నా వాడరు. దాన్ని అవతల పారేసి ఇంకోటి కొనాల్సిందే. ధనవంతులు డబ్బు ఉంది కాబట్టి కొంటారేమో. లేనివాళ్లు కూడా వాళ్లని అనుకరించి చివరికి అప్పుల పాలై తిప్పలు పడుతున్నారు. ఇదివరకు ఒక వాచీ కొంటే జీవితాంతం వాడుకునేవాళ్లు. మరి ఇప్పుడు? మనుషుల మోజులకి తగ్గట్లుగానే యూజ్ అండ్ త్రో, వాడి పారెయ్యి రకాలు మార్కెట్లో ఎక్కువయ్యాయి. ఇట్లాంటి రోజుల్లో జాగ్రత్తగా వాడండి అని చెప్తే నవ్వుతారు. ఎవరికీ టైం లేకపోవటం మరో కారణం.

★ ★ ★

"అమెరికా నుంచి వచ్చాను. తీరికున్నప్పుడు రా" ఫోన్ చేసింది అనూరాధ.

"ఆహా, అలాగా... వస్తాను" సంతోషంతో చెప్పింది పద్మజ.

అనూరాధ కూతురు అమెరికాలో ఉంటుంది. ఆమె డెలివరీకి అనూరాధని పిల్చారు. ఆమె హడావుడిగా వెళ్లిపోవడం వల్ల పద్మజకి వెళ్తున్నప్పుడు చెప్పలేదు. అనూరాధ భర్త కూడా రిటైర్ అయిపోయి ఇంటిపట్టునే ఉంటున్నాడు. ఆమె అమెరికా వెళ్లిందని పద్మజకి తెలియనేలేదు. ఒకసారి ఆయన రైతుబజార్‌లో కనబడితే పలకరించింది. అప్పుడు అనూరాధ వెళ్లిన సంగతి ఆయన చెప్పాడు.

"అట్లాగా. మరి మీరు కూడా వెళ్లకపోయారా? ఒంటరిగా ఇక్కడ ఉండటం దేనికీ? " అడిగింది పద్మజ.

ఆయన నవ్వాడు.

"మీకు ఒక విషయం చెప్పనా? "

"చెప్పండి"

"రిటైరయ్యాక మగవాడిని ఎవరూ కేర్ చెయ్యరండీ. ఆడవాళ్లకైతే అసలు రిటైర్‌మెంట్ లేదు. ఎప్పుడూ వాళ్ల సర్వీసులు కావల్సివస్తూనే ఉంటాయి. నేనూ అమెరికా పోదామని తాపత్రయపడ్డాను. కానీ నువ్వెందుకు అని నన్ను ఆపేశారు. వెళ్లి మాత్రం నేను చేసేది ఏముందిలెండి? అందుకే ఉండిపోయాను" నవ్వాడాయన.

"బాగుందండీ. వెళ్తే మీరు మాత్రం ఖాళీగా ఉంటారా ఏంటి? ఏదో ఒకపని అందుకుని చెయ్యరా? "

"ఏమోనండీ. చాలామందిని చూశాను. ఆడవాళ్లు పాపం గొడ్డు చాకిరీ చేస్తారు కాబట్టి అంతా వాళ్లనే రమ్మంటారు."

పద్మజ నవ్వి ఊరుకుంది.

అక్కడ్నుంచి వచ్చాక కూడా ఆయన మాటలే గుర్తు వచ్చాయి. ఆడవాళ్లు ఎంతైనా పని ఎక్కువే చేస్తారు. డెలివరీ సమయాల్లో ఆడవాళ్ల సాయం తప్పదు.

**కొత్తగాలి...**

**మది పుస్తకాన్ని**
**తెరచా**
**జ్ఞాపకాల అక్షరాలు**
**కోకొల్లలుగా..!**

**– యలమర్తి అనూరాధ, పెనుగొండ**

కానీ మామూలు సమయాల్లో, కాస్త పెద్ద పిల్లల్ని చూసుకోవాల్సి వచ్చినప్పుడు కూడా ఆడవాళ్లనే పిలుస్తారు. పిల్లలకి చేసినా, మనవలకి చేసినా ఆడవాళ్లే కష్టపడాలి.

అనూరాధని చూడటానికి వెళ్లింది పద్మజ. అనూరాధ సన్నబడి, కాస్త నల్లబడింది కూడా.

"అదేంటి. అమెరికాకి వెళ్లి తెల్లబడాలి కానీ నల్లబడ్డావేంటీ? " అడిగింది పద్మజ.

"ఏం చేస్తాం. ఏదో డైటింగ్ లేకుండానే సన్నబడ్డామని సంతోషించాలి. అంతే"

"ఏమేం చూశావు? "

"ఏమీ చూడలేదు. ఇక్కడ ఎక్కి అక్కడ దిగి నేరుగా ఇంటికి వెళ్లాం. మళ్లా తిరిగి వచ్చేరోజే వీధి మొహం చూశాను"

"అవునా? " నిర్ఘాంతపోయింది పద్మజ.

అనూరాధకి విహార యాత్రల మీద చాలా మోజు ఉంది. ఆయన ఉద్యోగంలో ఉన్నప్పుడు ఎల్.టి.సి సౌకర్యం ఉండటం వల్ల ఉత్తరభారతం, దక్షిణభారతం అన్నీ తిరిగి చూశారు. ఆంధ్రప్రదేశ్‌లో చూడాల్సినవన్నీ చూశారు. వీలైనప్పుడల్లా వ్యాన్ మాట్లాడుకుని ఊళ్లు చూసేవాళ్ళు. అనూరాధ గొప్ప ప్రకృతి ప్రేమికురాలు.

ఒకసారి వాళ్ళ బంధువులు ఒకరు అమెరికా వెళ్ళొచ్చారు. ఆవిడని ఒక పెళ్లిలో కలిసినప్పుడు అనూరాధ అమెరికా గురించి అడిగింది.

"ఆ, అమెరికాలో ఏముంది? ఏదో

వెళ్తాం గానీ నాకు అక్కడ ఏం గొప్ప కని పించలేదు" అంది ఆవిడ.

అనూరాధకి కోపం వచ్చేసింది.

"మీరు అమెరికాలో ఏం చూశారు? "

"ఏం చూడాలి? "

"ఏం చూశారని అడుగుతున్నాను? "

"ఏం చూడాలని అడుగుతున్నాను" ఆవిడ కూడా కోపంగానే అడిగింది.

"డిస్నీలాండ్ చూశారా? "

"లేదు"

"నయాగారా చూశారా? "

"లేదు"

"హాలీవుడ్ స్టూడియోలు చూశారా? "

"లేదు"

"మీరు ఏమీ చూడలేదు. మరి ఇంక ఏ గొప్పా లేదని ఎట్లా చెప్పగలరు? ఒకచోటికి వెళ్లినప్పుడు అక్కడ ఉన్నవన్నీ చూడాలి. చూశాక కదా అవెంత గొప్పవో మనకి తెలిసేది. ఎన్నో గొప్ప గొప్ప ప్రదేశాలూ, చూడదగ్గ విశేషాలూ ఉన్న దేశం వెళ్లికూడా చూడకుండా వచ్చారు. ఇంకా పైగా చూడ్డానికేముందని మాట్లాడుతున్నారు" ఆవేశంగా అంది అనూరాధ.

"అవును. నిజమే. నాకక్కడ ఏమీ చూసే అవకాశం లేకపోయింది. వాళ్ళకి పాపం తీరిక లేదు. ఏం చూడ్డానికీ లేకపోయింది" ఆవిడ ఒప్పేసుకుంది.

అట్లా వాదించిన అనూరాధ తను అమెరికాలో అన్ని రోజులుండి కూడా ఏమీ చూడకుండా తిరిగి వచ్చెయ్యటం ఆశ్చర్యం కలిగించే విషయం.

"ఏమన్నా చూసి రావాల్సింది. మళ్ళీ మళ్ళీ వెళ్ళే దూరాలా? " అంది పద్మజ.

"ఏం చేస్తాం. డెలివరీ అయిన పిల్లని చూసుకోవలసిన పనిమీద వెళ్లాను. అంతే. తల్లినీ, పిల్లనీ చూసుకున్నాను. తిరిగి వచ్చాను. ఇంక నా సరదాలు తీర్చుకుంటూ కూర్చుంటే బాగుంటుందా? "

"నువ్వు ఒక్కదానివే అయినా వెళ్లి కొన్ని అయినా చూడాల్సింది"

"పిల్లని చూసుకునే పనిమీద వెళ్లాను. చూసుకున్నాను. వచ్చాను. అంతే" అంది అనూరాధ.

కొడుకు ఇల్లయినా, కూతురి ఇల్లయినా వేరే దేశంలో ఉన్నప్పుడు తల్లి తండ్రులు వెళితే వాళ్లకి స్వతంత్రం ఎక్కడుంటుంది? వాళ్ళు చెప్పినట్లు చెయ్యవలసిందే.

★ ★ ★

నెలరోజులు గడిచాక ఒకరోజు మళ్ళీ హఠాత్తుగా ప్రత్యక్షమైంది రంగమణి.

మధ్యాహ్నం తీరిగ్గా కూర్చుని జాకెట్ కుట్టుకుంటోంది పద్మజ. రంగమణిని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏంటి.. ఫోన్ కూడా చెయ్యలేదు. ఏమైపోయావు? " అడిగింది.

రంగమణి ఒక్కత్తే రాలేదు. పక్కన పదేళ్ళ పిల్ల ఉంది. సన్నగా, పీలగా, బెరుకు కళ్ళతో చూస్తోంది. బాల్యంలో సరైన తిండి లభించకపోవటం వల్ల కాబోలు అదో మాదిరిగా ఎండిపోయినట్లుంది ఆ పాప శరీరం.

"మాకు చాలా దూరపు బంధువులవుతారు. పాప పేరు హిమానీ" అంది. హిమానీ చేతులు జోడించి, పద్మజకి నమస్కారం చేసింది.

"రండి, కూర్చోండి" అంది పద్మజ. టీవీలో పిల్లలకి నచ్చే ఛానల్స్ రెండు మూడు తిప్పి చూపించింది.

"నీకు కావల్సింది పెట్టుకో" అంది. ఆ పాపని ఇంకెట్లాగ ఎంగేజ్ చెయ్యాలో పద్మజకి తోచలేదు.

హిమానీ బెరుగ్గా రిమోట్‌ని అందుకుని నచ్చిన ఛానల్ కోసం ప్రయత్నిస్తోంది.

పద్మజా, రంగమణీ మాటల్లో పడ్డారు. హిమానీ టీవీ ప్రోగ్రామ్ ఎంజాయ్ చేస్తోంది. ఇంతలో పక్కింటావిడ గోడ

దగ్గర్నుంచి పిలిస్తే పద్మజ వెళ్లింది. రంగమణి కూడా పద్మజ వెనక వచ్చింది.

"ఊర్నుంచి బంధువులు తెచ్చారు" అంటూ పక్కింటావిడ పనస తొనలూ, జంతికలూ, లడ్డూలూ ఉన్న పెద్ద గిన్నె అందించింది.

"థాంక్సండీ. ఇదుగో మా ఫ్రెండ్ కూడా వచ్చింది. వాళ్ళకి ఏంచేసి పెట్టాలా అనుకుంటుంటే నాకు ఆ శ్రమ తప్పించారు" పద్మజ నవ్వుతూ గిన్నె అందుకుంది.

పద్మజా, రంగమణీ తిరిగి ఇంట్లోకి వచ్చారు. గిన్నెలోంచి ఒక్కోటీ తీసి ప్లేట్లలో సర్దుతోంది పద్మజ. కింద పనస తొనలు పెట్టి, ఆపైన అరిటాకు కప్పి, దాని మీద పేపర్ వేసి, లడ్డూలూ, జంతికలూ సర్దిన తీరును రంగమణి మెచ్చుకుంటుంటే బయట హిమానీ టీవీ చూడటంలో బిజీగా ఉంది.

"ఆ పాపని పెంచుకుంటున్నాను" అంది రంగమణి.

పద్మజ ఆశ్చర్యపోయి చూసింది.

"పాపం చాలా బీదవాళ్ళు. పాపకి తిండి కూడా పెట్టలేని స్థితిలో ఉన్నారు. ఈ పాప తర్వాత ఇంకో బాబు ఉన్నాడు. వాడికి రెండేళ్ళు. హిమానీని రెండోక్లాసు దాకా చదివించి, చదువు మాన్పించి ఇంట్లో కూర్చోబెట్టారు. పిల్ల పెద్దవుతోంది. దీన్ని ఎట్లా పోషించాలి? ఎట్లా చదివించాలి? ఎట్లా పెళ్లి చేయాలి అని దిగులు పడుతున్నారు. నాకు వాళ్ళ సంగతి తెలిసి వెళ్లి అడిగాను. పెంచుకోవటం అంటే దత్తత లాంటిదేమీ లేదు, ఆ పిల్ల బాధ్యత నేను తీసుకుంటానని చెప్పాను. ఈ ఏడాది స్కూల్స్‌లో వేసే టైమ్ దాటిపోయింది. ఈ లోపల ప్రైవేట్‌గా ట్యూషన్ పెట్టించి, నేనూ వీలైనంత నేర్పి, వచ్చే ఏడాదికి స్కూల్లో వేస్తాను" రంగమణి చెప్పింది.

పద్మజ మౌనంగా వింటోంది.

"నాక్కూడా బోర్ కొడుతోంది. ఒక్కళ్ళమే ఉండాలంటే కాస్త కష్టంగానే అనిపించింది. అందుకే అటు నాకు కాలక్షేపం, ఇటు వాళ్ళకి పాప సమస్య తీరటం, రెండూ నెరవేరుతాయి. మా ఆయన కూడా అభ్యంతరం చెప్పలేదు. పాపతో మాకు అనుబంధం కూడా ఏర్పడిపోయింది" అంది రంగమణి.

"మంచిపని చేశారు. బోర్, బోర్ అని ఫీల్ అయ్యేకన్నా ఇట్ల ఏదో ఒకపని, ఇతరులకి మేలు జరిగేది చెయ్యటం సంతోషించాల్సిన విషయం" అంది పద్మజ.

ప్లేట్లు ట్రేలో సర్ది, హాల్లోకి తీసుకొచ్చింది. హిమానీ లడ్డూని ఇష్టంగా తింటోంది.

'పాపని! నీకేసబ్జెక్ట్ ఇష్టం? ఏమేం ఆటలు ఆడతావు?' లాంటి ప్రశ్నలు అడిగింది పద్మజ.

హిమానీకి చదువుమీద శ్రద్ధ ఉన్నట్లు అమె జవాబులని బట్టి తెలిసిపోయింది. కాస్త ట్రెయినింగ్ ఇచ్చి మంచి స్కూల్లో చేర్పిస్తే రాణిస్తుంది. కాస్సేపయ్యాక హిమానీకి బెరుకు తీరినట్లుంది. లేచి ఇల్లంతా చూసింది. చిన్న కుండీల్లో ఉన్న మిరపచెట్టుకి కాసిన చిన్న చిన్న మిరప కాయల్ని చూసి నవ్వింది.

"ఇన్ని చెట్లు ఎట్లా పెంచుతున్నారు? పూలన్నీ ఎంత బాగున్నాయో!" అంది.

ఆ సాయంత్రందాకా పద్మజ ఇంట్లోనే

## కొత్తగాలి...

మనసు కరిగితే
ఆనంద కిరణాలు
మనసు రగిలితే
అగ్ని కణాలు

– సి.కామేశ్వరరావు,
కాశీబుగ్గ

## కొత్తగాలి...

**ఆప్యాయత, అనురాగం**
**ఇల్లు ఖాళీ చేస్తే**
**హంగు, ఆర్భాటం**
**ఆక్రమించాయి**

– పి.లక్ష్మీశారద, రాజమండ్రి

గడిపి, కావల్సిన పూలన్నీ కోసుకున్నారు వాళ్ళు. కొన్ని చెట్ల విత్తనాలూ, కొమ్మలూ తీసుకున్నారు.

"మా ఇంటికెప్పుడైనా రా" అంది రంగ మణి.

"వస్తాను" అంది పద్మజ.

★ ★ ★

"నిన్న ఎవరండీ మీ ఇంటికొచ్చారు? పక్కింటి మేడమీద అద్దెకుంటున్న పంకజం పలకరించింది.

"మా ఫ్రెండ్ రంగమణి" అంది పద్మజ.

పంకజంకి లోకంలో అక్కర్లేనివి లేవు. ఆమెతో మాట్లాడాలంటే ఎవరన్నా భయప డతారు. పంకజానికి వెయ్యి కళ్ళు. ఆమె దృష్టిలోంచి పడకుండా ఎవరూ తప్పించు కోలేరు. అన్నీ అడుగుతుంది. పెద్ద చదు వులు చదివి, కొన్నాళ్ళు లెక్చరర్‌గా కూడా పనిచేసింది. ఆ పిల్లలకి ఏం బోధించిందో, ఈమెతో వాళ్లెలా వేగారో తెలియదు. ఆ తర్వాత భర్తకి ట్రాన్స్‌ఫర్ అవటంతో ఆ ఉద్యోగం మానేసి ఇక్కడికి వచ్చారు.

"ఎవరో పిల్ల ఉంది పక్కన? "

"వాళ్ళ బంధువుల అమ్మాయి? "

"ఇప్పుడు స్కూల్స్‌కి సెలవుల్లేవుగా? "

"లేవండీ"

"పెంచుకుంటున్నానంది? " పంకజం అడిగింది.

పద్మజ మౌనంగా ఉంది.

"ఆవిడకి పిల్లలు లేరా? "

"ఉన్నారు"

"ఉంటే మరి ఈ పిల్ల ఎందుకండీ? "

"ఆవిడకి ఒక్కడే కొడుకండీ. ఆ అబ్బా యికి పెళ్లి అయింది"

"ఎక్కడుంటాడు? " పంకజం మాటల్లో పెట్టి సమాచారం అంతా లాగింది.

"ఏడిసినట్లుంది. కొడుకుతో పడి చావలే దుగానీ, ఇంక ఈ పిల్లతో పడుతుందా? "

"పడుతుందనే కదా తెచ్చుకున్నారు"

"నా మొహంలా ఉంది. ఆవిడకి కాల క్షేపం కావాలి. దానికి ఇంకేదో మార్గం చూసుకోవాలి గానీ, ఈ వయసులో పిల్ల లతో వేగటం ఆవిడవల్ల అవుతుందా? "

పద్మజ మౌనంగా ఉండటం చూసి పంకజం విజృంభించింది.

"కౌపీన సంరక్షణార్థం అయం పటా టోపః అన్నారు. అట్లా ఉంది" అంది.

పద్మజ మౌనం చూసి ఆమెకి ఆ మాట అర్థం కాలేదని పంకజం గ్రహించింది. ఉత్సాహంగా ఒక అడుగు ముందుకి వేసేసింది.

"మీకు అర్థం కాలేదు కదూ. దీని వెన కాల ఒక కథ ఉంది. ఒక ముని ఉన్నా డుట. ఆయన కౌపీనం అంటే ఒక గోచీ లాంటిది కట్టుకుని, తపస్సు చేసుకునే వాడుట. ఒకరోజు ఆ కౌపీనాన్ని ఎలుక కొట్టిందట. ఎలకల బారినుండి తప్పించు కోవాలని పిల్లిని పెంచాడుట. ఆ పిల్లికి పాలు కావాలని ఆవుని పెంచాడుట. ఆ అవుని చూసుకునేందుకు మనిషి కావాల్సి వచ్చాడు. దానితో తప్పనిసరై ఒక మని షిని కూడా ఆవుని సంరక్షించేందుకు పెట్టా డుట. ఆ మనిషి ఈ మునిలా ఒంటరిగా ఉండలేడు కాబట్టి అతని సంసారం కూడా వచ్చింది. ఆ లంపటాలన్నీ చూసి మునికి కనువిప్పు కలిగింది. ఒక్క కౌపీనం కోసం కదా ఇన్ని కావాల్సి వచ్చిందని తెలుసుకు న్నాడుట" పంకజం చెప్పుకుపోతోంది.

పద్మజని నోరు కూడా తెరవనివ్వలేదు.

"ఎందుకు చెప్తున్నానంటే ఆవిడకి యాభై ఏళ్ళుంటాయి. ఇప్పుడు ఇంక పిల్లల్నేం చూడగలదండీ. ఎన్ని కావాలి. ఇప్పుడు ఏ భక్తి మార్గంలోనో పడాలి. ఆవృత్తి మార్గంలో కాదు, ఆవిడ నివృత్తి మార్గంలో ఉండాలి" అంది పంకజం.

"ఆవృత్తి మార్గం అంటే ఇంకొన్ని బంధాల్ని ఏర్పరచుకోవటం నివృత్తి మార్గ మంటే బంధాల్ని తెంచుకోవటం" అంది పంకజం..

"ఎన్నాళ్ళు ఉంటుందిలెండి. నాలుగురోజులు పోతే వీళ్ళకి బోర్ కొట్టి, ఆ పిల్లని వాళ్ళ ఇంటికి పంపించేస్తారు" అంది మళ్ళీ.

పద్మజ ఇంకేం మాట్లాడకుండా లోపలకు వచ్చింది. ఆ తర్వాత కొన్నాళ్ళకి రంగమణి ఇంటికి వెళ్ళింది.

పంకజం చెప్పినట్లు ఏమీ కాలేదు.

హిమానీతో రంగమణి బంధం బాగానే కొనసాగింది. ఇద్దరూ తల్లికూతుళ్ళలాగే ఆప్యాయంగా మసలుకుంటున్నారు.

హిమానీకి ఇంట్లో ట్యూషన్ పెట్టారు. స్కూల్స్ తెరవగానే చేర్పిస్తారుట. మంచి స్కూల్‌లో అప్పుడే అడ్మిషన్ కూడా తీసుకున్నారు.




**"హ**రహర మహాదేవ, శంభోశంకర" ఉన్నట్లుండి కేకలు వినిపించాయి. ఆ వీధిలో ఉన్న వాళ్ళంతా హడలిపోయారు. అంత బిగ్గరగా ఉన్నాయి ఆ కేకలు.

అవి ఆగిపోయాయి. అంతలోనే 'నమః పార్వతీ పతయే' అనీ, 'శివశివ శంభో, హరహర శంభో' అనీ కేకలు.

అవి శ్రీరామ్మూర్తి ఇంట్లో నుంచి వినబడుతున్నాయి.

అంతా తొంగిచూశారు.

వాళ్ళ కళ్ళు పెద్దవయ్యాయి.

శ్రీరామ్మూర్తి మిలిట్రీలో పనిచేసి రిటైరయ్యాడు. ఆయనకిప్పుడు అరవై దాటాయి.

ఆ కాలనీలో వెయ్యిగజాల స్థలం కొనేశాడు శ్రీరామ్మూర్తి. పాతకాలం చవగ్గా దొరికింది. ఆయనకి ప్రశాంత జీవనం అంటే ఇష్టమట. అదేం కాదు ఆయన ఆటల్ని ఇక్కడెవరూ పట్టించుకోరని ఇక్కడ దిగాడని కొందరంటారు. కారణం మరి ఏదో, ఏది నిజమో శ్రీరామ్మూర్తికే తెలియాలి. శ్రీరామ్మూర్తి పేరుకి శ్రీరామ్మూర్తి గానీ ఆయన ఫేవరేట్ గాడ్ శ్రీకృష్ణుడే. ఆయన బోలెడన్ని రాసలీలలు జరిపాడని కొందరంటారు. అది ఎంతవరకూ నిజమో తెలియదుగానీ ఆయన ఇద్దరు భార్యలతో కలిసి వచ్చి పాతికేళ్ళ క్రితం కాలనీలో చేరాడు. పెద్దమేడ కట్టించి, చుట్టూ తోటలు, చెట్లు పెంచాడు. మామిడి, పనస, జామ, సపోటా, అరటి, నిమ్మ, నారింజ, కొబ్బరిలాంటి చెట్లు ఆయన ఇంటి చుట్టూ విరగబడి పెరిగి, కాయలు కాస్తున్నాయి. ఆ ఇంట్లో చేరేటప్పటికే ఆయన మిలట్రీలో పనిచేస్తున్నాడు. ఆయన ఇద్దరు భార్యలూ సఖ్యతగా ఉండేవాళ్ళు. వాళ్ళంతా ఒకే కార్లో షికార్లు పోయి వస్తుండేవాళ్ళు.

మగవాళ్ళు శ్రీరామ్మూర్తి అదృష్టానికి ఏడుస్తుండేవాళ్ళు.

"ఏం అదృష్టం. మనకి ఒక్క భార్య దొరికేసరికే చచ్చినంత పనైంది. ఆయన్ని

చూడు. ఇద్దరు పెళ్ళాలు. హాయిగా బతికే స్తున్నాడు" అని బాహాటంగానే ఒకళ్ళతో ఒకళ్ళు చర్చించుకునేవాళ్ళు.

"ఎవరి అదృష్టం వాళ్ళది" అని నిట్టూర్చేవాళ్ళు. ఆడవాళ్ళకి ఆయన భార్యలిద్దరూ పోట్లాడుకోకుండా ఎట్లా ఉంటున్నారో అర్థం అయ్యేది కాదు. వాళ్ళు సవతుల్లా కాదు, సొంత అక్కచెల్లెళ్ళలా ఉండే వాళ్ళు. వాళ్ళ గురించి కొందరు వాకబు చేశారు. వాళ్ళు సొంత అక్కచెల్లెళ్ళు కాదు సరికదా.. ఏ చుట్టరికమూ లేదు.

మగవాళ్ళందరితో, ఆ మాటకొస్తే కాలనీలో ఆడవాళ్ళందరితో కూడా చనువుగా ఉండి, ఆప్యాయంగా మాట్లాడేవాడు శ్రీరామ్మూర్తి. ఆ కాలనీలో అప్పట్లో అంత గొప్ప ఇల్లు కట్టింది ఆయనే. సొంతకారు ఉన్నదీ ఆయనకే. ఆఖరికి ఇద్దరు పెళ్ళాలు ఉన్నది కూడా ఆయనకే. కానీ తన హోదానీ, డబ్బునీ ఎన్నడూ వాళ్ళముందు ఆయన ప్రదర్శించేవాడు కాదు. వాళ్ళల్లో తనూ ఒకడే అన్నట్లు కలిసిపోయేవాడు.

అందుకే కొంతమంది ఆయన్ని నేరుగా అడిగేశారు. "ఏంసార్. ఏంటి? ఇద్దరు భార్యలున్నారు తమకి? " అన్నారు.

శ్రీరామ్మూర్తి నవ్వేశాడు.

"ఏం చేస్తాం? చేసుకోవాల్సి వచ్చింది"

"ఏం ప్రాబ్లం ఉండదా? "

"ఎట్లాంటి ప్రాబ్లమ్? ప్రభుత్వోద్యోగిని కాబట్టి అనా? "

అవతల వ్యక్తి మాట్లాడలేదు.

"నాయనా. ఒక భార్య కంప్లయింట్ చేస్తేనే కిరికిరీ. సర్దుకుపోతుంటే, ఇద్దరేంటి, కృష్ణుడిలా అష్టభార్యల్ని చేసుకున్నా అడిగేవాడు లేడు"

"మరి ఆవిడకీ సంతానం ఉన్నారు? "

"ఉన్నారు. ఒకే భార్య, అంటే పెద్ద భార్య సంతానం అని అఫీషియల్‌గా చెలామణీ చేయించాను" శ్రీరామ్మూర్తి చిద్విలాసంగా సమాధానం ఇచ్చాడు.

"అసలు ఇద్దర్ని ఎందుకు..." ఒకాయన అడగబోతుంటే శ్రీరామ్మూర్తి ఆపేశాడు.

"ఎందుకు చేసుకున్నాననే కదా నీ అనుమానం. నాది జాలిగుండె. నా పెద్ద భార్య జానకీ నేనూ హాయిగా కాపురం చేసుకుంటుండే వాళ్ళం. ఇంతలో సత్యవతి, అదే నా రెండో భార్య పరిచయమైంది. మా ఇంటికి వస్తుండేది. నేనంటే పడి చచ్చేది. నా రూపం, నా ధైర్యం, నా మాటలూ అన్నీ ఆమెకి ఎంతో నచ్చాయి. వీటన్నిటికన్నా నా మంచితనం మరీ ఆమెని ఆకట్టుకుందని చెప్పింది" ఆయన ఒక్క క్షణం ఆగాడు.

అంతా మౌనంగా వింటున్నారు.

"వాళ్ళింట్లో సంబంధాలు చూస్తున్నారు. అది ఇష్టంలేని సత్యవతి వద్దని చెప్పింది. వాళ్లు అప్పటికే పెళ్ళయిన నన్ను సత్యవతి పెళ్లి చేసుకోవటం ఎంత మాత్రం ఇష్టపడలేదు. ఆమెని కట్టేసి అయినా వేరే పెళ్ళి చెయ్యాలని చూశారు. సత్యవతి ఎట్లాగో తప్పించుకుని, నా దగ్గరకు పారిపోయి వచ్చింది. నా దగ్గర దాసీగా అయినా పడి ఉంటానన్నది. ఆమెని ఉండనిస్తే చాలని బతిమాలుకుంది. సత్యవతికి నేను తనని పెళ్ళి చేసుకోవాలని కూడా లేదు. కేవలం నన్ను చూస్తూ ఉంటే చాలు. నన్ను చూడకుండా తను బతకలేదు. అందుకని నాకూ ఇబ్బందిగా అనిపించింది. ఏం చెయ్యాలో తెలియలేదు. సత్యవతి ఎక్కడికీ పోను అంది. ఎంత చెప్పినా వినలేదు. ఇంతలో జానకి కలిగించుకుంది. 'మిమ్మల్ని నమ్ముకుని వచ్చిన అమ్మాయి, పాపం ఎక్కడికి పోతుంది? మీరే వద్దంటే ఎట్లా? ' అంది.

సత్యవతికి ఏడుపు ఆగలేదు. 'అక్కా, నీకు ఏ కష్టం కలిగించను. నీ ఇంట్లో ఊరికే ఉంటా. అంతే' అంది.

'అదే వద్దు' అంది జానకి. సత్యవతి

తెల్లబోయింది". శ్రీరామ్మూర్తి మళ్ళీ ఆగాడు. అందరివైపు ఒకసారి చూశాడు. అంతా అతన్నే చూస్తున్నారు.

"జానకి వైపు బిక్క మొహంతో చూస్తోంది సత్యవతి. జానకి చిరునవ్వు నవ్వింది. 'అవును సత్యా. నువ్వు ఊరికే మా ఇంట్లో ఉంటే లోకం నీమీద నిందలు వేస్తుంది. నా భర్తని ఇంతగా ప్రేమిస్తున్న మనిషి నిందలపాలవటం నేను భరించ లేను. నువ్వు ఆయన భార్యగా ఈ ఇంట్లోనే ఉండు' అంది. సత్యవతి ఒక్కసారిగా షాక్ అయింది. ఏం చెయ్యాలో కూడా తెలీనంత అయోమయంగా అయిపోయింది. ఆ తర్వాత ఒక్కసారిగా జానకి కాళ్ళమీద పడిపోయింది. 'మీకూ ఈ పెళ్ళి ఇష్టమేగా?' అంది జానకి నా వైపు చూస్తూ. సత్యవతిని బలవంతాన లేపి, సోఫాలో కూర్చోబెట్టింది. నాకు సత్యవతంటే ప్రేమ ఉంది. సత్యవతి భవిష్యత్తు పాడు చెయ్యటం ఇష్టంలేక ఊరుకున్నాను కానీ లేకపోతే ఏనాడో నా ప్రేమను ప్రకటించి ఉండేవాడ్ని."

ఆ తర్వాత జరిగిన కథ కూడా శ్రీరామ్మూర్తి పూస గుచ్చినట్లు వివరించాడు.

సత్యవతిని ఒక్కక్షణం కూడా అనధికారికంగా ఆ ఇంట్లో ఉంచుకోవటం జానకికి ఇష్టంలేదు. 'పెళ్ళి లేకుండా ఉంటే నిన్ను లోకం చిన్న చూపు చూస్తుంది. లేచి వచ్చావంటుంది' అన్నది.

ఆ క్షణానే పెళ్ళి ఏర్పాట్లు మొదలుపెట్టి గంటలో సత్యవతిని పెళ్ళికి సిద్ధం చేసింది. తన ఫ్రెండ్స్ కొంతమందికి కబురు పెట్టింది. వాళ్ళు పట్టుచీరె, జాకెట్టు, మంగళసూత్రాలు, ఇంకా పెళ్ళికి కావల్సినవన్నీ కొనుక్కువచ్చారు. సత్యవతికి పట్టుచీరె కట్టారు. పూలజడ వేశారు. నుదుట కళ్యాణ తిలకం దిద్దారు. శ్రీరామ్మూర్తికి పెళ్ళికొడుకు అలంకరణ జానకి తనే స్వయంగా చేసింది. పట్టు పంచె, నుదుట బాసికం, బుగ్గన చుక్కతో అతను పెళ్ళికొడుకు వేషంలో మెరిసిపోతుంటే జానకి మురిసిపోయింది.

"ఆ రోజు మన పెళ్ళిలో మిమ్మల్ని సిగ్గుతో చూడలేకపోయాను. ఈనాడు మిమ్మల్ని ఇలా చూడటానికి రెండు కళ్ళూ చాలటం లేదు. ఎంత అందంగా ఉన్నారండీ" అని ఆనందబాష్పాలు రాల్చింది.

"మీరు ఇంత చతురులు. అందగాళ్ళు. మీకు నేను సరిసాటి కాదు. అందుకే దేవుడు మీకు ఇంకో భార్యను కూడా ఇచ్చాడు" అంది.

అంతా దగ్గరుండి పెళ్ళి జరిపించి, ఆ రోజే శోభనం ఏర్పాట్లు కూడా చేశారు.

ఆనాటి నుంచే వాళ్ళిద్దరూ ఎంతో ఆప్యాయంగా, ఆత్మీయంగా ఉంటున్నారు.

శ్రీరామమూర్తి చెప్పింది విని అంతా నోళ్ళు తెరిచారు.

ఇట్లా కూడా జరుగుతుందా?

ఏమో. శ్రీరామ్మూర్తి మాయదారి మనిషిలా ఉన్నాడు. అతను భార్య ఉండగానే ఇంకో అమ్మాయిని ఆకర్షించి, పెళ్ళిలోకి లాగిన మాట వాస్తవం. మిగతా కహానీ అంతా ఏమిటో, ఎంత నిజం ఉందో అది శ్రీరామ్మూర్తికే తెలియాలి.

జానకీ, సత్యలతో శ్రీరామ్మూర్తి ఆనందంగా కాపురం చేస్తున్నాడు.

ఇంతలో మిలిటరీలోంచి రిటైర్ కూడా అయ్యాడు. పిల్లల్ని ఎక్కడో హాస్టల్‌లో ఉంచి చదివిస్తున్నాడు. అప్పటికి అతనికి దాదాపు యాభై ఏళ్ళ వయసు ఉంటుంది. కానీ మనిషి చూడ్డానికి ముప్ఫై అయిదులా కనిపించేవాడు. ఖరీదైన బట్టలూ, ఖరీదైన నల్ల కళ్ళజోడు, ఖరీదైన కారు, ఆకర్షణీయమైన రూపం, అలరించే మాటలతో మనిషి ఎవరినైనా ఆకట్టుకునేవాడు.

ఆయన ఏదో క్లబ్‌లో మెంబర్. అక్క

డికి అంతా డబ్బున్నవాళ్ళే వస్తారుట. అట్లాగే ఆ క్లబ్‌కి వచ్చే చందనతో ఆయనకి పరిచయం ఏర్పడింది. చందనకి డబ్బుతో పాటు అందం కూడా ఉంది. ముప్ఫై రెండేళ్ళు ఉంటాయి గానీ మనిషి పాతికేళ్ళదానిలా కనబడుతుంది. జీన్స్, కత్తిరించిన జుట్టు, పెదవులకి లిప్‌స్టిక్‌తో ఆధునికంగా ఉంటుంది. ఎం.బి.ఏ. చదివి కొన్నాళ్ళు అమెరికాలో కూడా ఉండి వచ్చిందిట. ఎట్లా కలిగిందో గానీ ఆమెకి శ్రీరామ్మూర్తి మీద వల్లమాలిన ప్రేమ కలిగింది. "నిన్ను విడిచి బతకలేను, నిన్ను చూడకపోతే నేను చచ్చిపోతాను" అంటూ ఒకరోజు అతని ఇంటికి వచ్చేసింది.

యాభై ఏళ్ళ శ్రీరామ్మూర్తి, ఇద్దరు భార్యలు ఉన్న శ్రీరామ్మూర్తి ఆమెని ఎట్లా ఆకర్షించాడో ఎవరికీ అర్థం కాలేదు. పోనీ అమాయకురాలు, మోసపోయిందేమో అనకుందామన్నా, అప్పటికే పెద్ద చదువులు చదివి, అమెరికాలో కూడా ఉండి వచ్చింది.

ముప్ఫై రెండేళ్ళ అందమైన చందన, యాభై ఏళ్ళ శ్రీరామ్మూర్తి అనధికార మూడవ భార్యగా ఆ ఇంటికి వచ్చింది.

అంతా నిర్ఘాంతపోయారు.

అప్పటికే ఇద్దరు భార్యల్ని తీసుకుని హాయిగా షికార్లు చేస్తున్న శ్రీరామ్మూర్తి మరోసారి ఆనందంగా పెళ్ళికొడుకయ్యాడు. ముగ్గురు భార్యల్నీ తీసుకుని ఆనందంగా తిరగటం మొదలు పెట్టాడు.

"అలా రాసిపెట్టి ఉంది" నిట్టూర్చారు కొందరు.

"ఏనాడో పెట్టి పుట్టాడు. ముగ్గురు భార్యలంటే మాటలా? హు" అని కొంతమంది కుళ్ళుగా చూశారు.

"ఎవరి అదృష్టం వాళ్ళది"

"వాళ్ళేం సవతులు? అంత కలివిడిగా ఎట్లా ఉంటున్నారు? "

"మహా మాయగాడు"

"అమ్మో... మాయదారి మనిషి."

శ్రీరామ్మూర్తి ఉద్యోగంలోంచి రిటైర్ అయ్యాక వచ్చే పెన్షన్‌నీ, ఉన్న ఆస్తినీ అనుభవించేస్తూ హాయిగా బతికేస్తున్నాడు. ఆ ముగ్గురు భార్యల్నీ తీసుకుని రోజూ సాయంత్రం షికార్లు చేస్తాడు. వాళ్ళంతా నవ్వుతూ, తుళ్ళుతూ హాయిగా ఊరంతా తిరుగుతారు.

జీవితాన్ని అన్ని విధాలా అనుభవించాలనీ, ఆనందాన్ని అన్ని పద్ధతుల్లో హాయిగా జుర్రుకోవాలనీ ఒక సిద్ధాంతం పెట్టుకున్నాడు శ్రీరామ్మూర్తి. పొద్దున్న లేవగానే తాగే కాఫీ దగ్గర్నుంచి, రాత్రి నిద్రపోయే ముందు బిగించే పెగ్గు దాకా అన్నీ క్వాలిటీ సరుకే. ఇక తిండి అంటే ఎందులోనూ ఎన్నడూ రాజీపడని తత్వం ఆయనది. వంకాయ కూర అయినా, చికెన్ బిర్యానీ అయినా, పడవలసిన పదార్థాలన్నీ పడాల్సిందే. ఆవకాయ పెట్టినా, ఐస్‌క్రీమ్ తిన్నా, అన్నీ రుచితో అదిరిపోవాల్సిందే. భోజనం ఎన్ని రకాలుగా ఎంత వైనవైనంగా తినవచ్చో ఆయన్నీ, ఆ కుటుంబాన్నీ చూసి తెలుసుకోవచ్చు కూరలు, పచ్చళ్ళు, పిండి వంటలు ఒకటేమిటీ, దేన్నయినా వివిధ రకాలుగా తయారు చేయించి, ఆనందంగా ఆస్వాదించేవాళ్ళు. ఎక్కడ ఏ హోటల్ కొత్తగా తెరిచినా, ఏ మిఠాయి కొట్టు ప్రారంభించినా, బేకరీలు వచ్చినా ముందు వెళ్ళితీరాల్సిందే. ఆంధ్రా, దక్షిణాది, ఉత్తరాది వంటలూ, ఆపైన ఎల్లలు దాటి యూరోపియన్, ఈజిప్షియన్, ఒక దేశమేమిటి ప్రపంచ వంటకాలన్నీ వాళ్ళు రుచి చూసేవాళ్ళు. సినిమాలు, షికార్లు, పిక్నిక్‌లు, యాత్రలు, వాళ్ళ సరదాలకి అంతూ పొంతూ ఉండేది కాదు.

ఒక్క మాటలో చెప్పాలంటే జీవితంలోని సర్వసుఖాలూ వాళ్ళు అనుభవిస్తున్నారు. సుఖానికి నిర్వచనం శ్రీరామ్మూర్తి

కుటుంబం.

పండగకో, పబ్బానికో గుడికి వెళ్ళి రావటం, రెండేళ్ళకో మూడేళ్ళకో ఒకసారి తిరుపతి పోయి రావటం తప్ప వాళ్ళకి భక్తి పెద్దగా లేదు. ఎన్నడూ, అంటే వేరే రోజుల్లో దేవుడికి ఒక దండం పెట్టుకున్నట్లు కూడా కనిపించరు. జీవితం అన్నది అనుభవించటానికే, ఆనందం తప్ప జీవితంలో మరేదీ లేదు అన్నట్లుగా ఎంజాయ్‌మెంట్ తప్ప మరొకటి వాళ్ళకి పట్టదు.

మరి ఈ రోజు ఆ కేకలు ఏంటి?

అసలేం జరిగింది?

అంతా వీధిలో కొచ్చి చూశారు.

శ్రీరామ్మూర్తిది రెండంతస్తుల మేడ.

ఆ మేడమీద రాత్రికి రాత్రి ఒక పూరి ఇల్లు వెలిసింది.

ఆ పూరి ఇంట్లోంచి ఆ కేకలు.

పద్మజ ఎదురింటావిడ వైపు చూసింది.

"ఏంటండీ ఆ కేకలు? ఎవరో బైరాగి వచ్చినట్లున్నారే" అంది.

కొందరు గేటు తీసుకుని శ్రీరామ్మూర్తి ఇంట్లోకి వెళ్తున్నారు.

పద్మజా, ఎదురింటావిడా కూడా వెళ్ళారు. శ్రీరామ్మూర్తి మూడో అంతస్తులో వెలసిన పూరిల్లు వైపు నడిచారు.

పూరిపాక ముందున్న విశాలమైన ఖాళీ స్థలంలో ఒక జంబుఖానా, కొన్ని చాపలు పరిచి ఉన్నాయి. వాటిమీద కూర్చున్న కాషాయాంబరధారి తంబురా వాయిస్తూ, తన్మయత్వంతో భజన గీతం పాడుతున్నాడు. ఆయన ముందు ముగ్గురు స్త్రీలు కాషాయ బట్టలు ధరించి, మెడలో తులసి మాలలు, విరబోసుకున్న జుట్టుతో అంతే తన్మయత్వంతో భజన చేస్తున్నారు.

ఆ కాషాయాంబరధారులు, శ్రీరామ్మూర్తి, ఆయన ముగ్గురు భార్యలూ.

ఇంత హఠాత్తుగా ఆయనకింత విరక్తి ఎలా కలిగిందో ఎవరికీ అర్థం కాలేదు. కలిగితే కలిగి ఉండవచ్చు కానీ తనతో పాటుగా తన ముగ్గురు భార్యల్నీ కూడా ఎట్లాగ ఒకేసారి వైరాగ్యమార్గంలోకి దింపాడో అంతకన్నా అర్థం కాలేదు.

★ ★ ★

శ్రీరామ్మూర్తి విరక్తినీ, వైరాగ్యాన్నీ చూసినా ఆయన అదే విరక్తి మార్గాన్ని అంటిపెట్టుకుని ఉంటాడని మాత్రం ఎవరూ అనుకోలేదు. ఎందుకంటే ఉన్నట్లుండి కొందరు ఇట్లాంటి మార్గాలు, అంటే వైరాగ్యమో, భక్తిమార్గమో పట్టటం, మళ్ళీ సంసారంలో పడటం చూస్తూనే ఉన్నారు.

కానీ అందరి అంచనాలూ తప్పు అయ్యాయి. శ్రీరామ్మూర్తి అంతకుముందు మంచి ఖరీదైన లిక్కర్ తాగేవాడు. ఇంట్లోనే ఒక మూల బార్ ఏర్పాటు చేసుకున్నాడు. ఎవరన్నా ఇంటికి వస్తే వాళ్ళకు కూడా కాస్తంత పోస్తే గానీ ఆయనకు మర్యాద చేసినట్లు ఉండేది కాదు.

"వద్దండీ" అని మొహమాట పడినా ఊరుకునేవాడు కాదు.

"చాల్లేవయ్యా. కాస్త పోసుకోగానే చెడిపోతావా? " అని బలవంతం చేసేవాడు.

కాలనీలో కాస్త తాగే అలవాటున్న వాళ్ళందరికీ ఆయన మహా ఆప్తుడు.

"మేలిరకం మందుంది వస్తావా? " అని లోపలకు పిల్చి మర్యాద చేసేవాడు.

రాత్రి తొమ్మిది దాటిందంటే బాగా తాగేసి కూర్చునేవాడు.

అట్లాంటి మనిషి తన ఇంట్లోని బార్‌లో ఉన్న సీసాలన్నీ పగలగొట్టేశాడు.

"అయ్యో... ఎందుకండీ అంతా నేల పాలు చేశారు. మేలురకం మద్యం వృథా అయిపోయింది. ఎవరికన్నా ఇస్తే తాగే వాళ్ళు కదా" ఆయన పగలగొట్టి పారేస్తుంటే చూసినవాళ్ళు వారించారు.

"తప్పు నాయనా. మద్యం తాగటం తప్పు. తప్పు చెయ్యటం మానుకున్నాను.

ఇంకోళ్ళని ఆ తప్పు చెయ్యమని అడిగితే నాకు మహా పాపం వస్తుంది" అన్నాడు.

పళ్ళు, పాలు, ఉడికించిన దుంపలు, తేనె, నానబెట్టిన శనగలు, పెసలు తప్ప ఆయనా, ఆయన ముగ్గురు భార్యలూ ఏమీ తినటం లేదు.

మితంగా, మృదువుగా మాట్లాడుతున్నారు. జోక్స్‌తోనూ, సరసాలతోనూ దద్దరిల్లిపోయే ఆ ఇంట్లో భజనలు చేసినప్పుడు తప్ప శబ్దాలు వినిపించటం లేదు.

ఆ విధంగా కొన్ని నెలలు గడిచిపోయాయి. శ్రీరామ్మూర్తిది క్షణికావేశం కాదనీ, బాగా నిర్ణయించుకునే భక్తి మార్గంలోకి ప్రవేశించాడనీ అందరికీ అర్థమైంది.

ఆయనే కాదు, ఆయన భార్యలు ముగ్గురూ కూడా ఆయనలాగే మారిపోయారు. వాళ్ళు కాషాయ బట్టలు తప్ప కట్టడం లేదు. పాలూ, పళ్ళూ, నానబెట్టి ధాన్యాలూ లాంటి సాత్వికాహారం తప్ప ముట్టడం లేదు. హరినామస్మరణ తప్ప మరోటి ఎంతో అవసరమైతే తప్ప వాళ్ళ నోట్లోంచి రావటం లేదు.

"వాళ్ళ పనే బాగుంది. ఇహమూ, పరమూ రెండూ దక్కించుకుంటున్నారు. అనుభవించినన్నాళ్ళు హాయిగా అనుభవించి, ఇప్పుడు సన్యాసం స్వీకరించారు. పూర్వం రాజులు కూడా ఇట్లాగే చేసేవాళ్ళట" అన్నారు కొందరు.

శ్రీరామ్మూర్తీ, ఆయన భార్యలూ మాత్రం దేన్నీ పట్టించుకోవటం లేదు. తమ భజనలు తాము చేసుకుంటూ పూర్తి వైరాగ్య, భక్తి మార్గంలో ఉన్నారు. ఏ మార్గం పట్టినా కావాల్సింది ముఖ్యంగా డబ్బు. అది వాళ్ళకు పుష్కలంగా ఉంది కాబట్టి తాము అనుకున్న మార్గం అనుసరిస్తూ శాంతిగా గడుపుతున్నారు.

"శ్రీరామ్మూర్తి గారేంటండీ, అట్లా ఉన్నట్లుండి భక్తిమార్గం పట్టారు" అంది పద్మజ హరనాథ్‌తో.

"ఆయన చాలా రోజుల్నుండి అంతర్మధనం ఉండి ఉండవచ్చు. అందరికీ చెపుతారా? భక్తి అనేది ఆయనకీ, భగవంతుడికీ మధ్య ఉన్న విషయం. దాన్ని ఇతరులతో పంచుకోవాల్సిన అవసరం ఏముంది? " అన్నాడు హరనాథ్.

"ఆయనకి నిజంగా భక్తి ఉందా అని? "

"అది నీకు అనవసరం. అయినా అడిగావు కాబట్టి చెబుతాను. ప్రతీ వాళ్ళలో అసలు జీవితమంటే ఏమిటి? భగవంతుడెవరు? ఆయన్ని ఎలా చేరుకోవాలి? అన్న ప్రశ్నలు చెలరేగుతూనే ఉంటాయి. అందరికీ ఆయనలా ఒక్కసారిగా అన్నీ వదులుకునే సాహసం ఉండదు. కానీ అంతర్లీనంగా ఆలోచనలు చెలరేగుతూనే ఉంటాయి" అన్నాడు హరనాథ్.

తన ఉద్యోగం తానూ తప్ప ఏదీ పట్టనట్లున్నా, హరనాథ్ దేన్నయినా సునిశితంగా పరిశీలన చెయ్యగలడు. అందర్నీ అర్థం చేసుకోగలడు. పద్మజకి ఆ విషయం చాలాసార్లు అర్థమైంది.




"వయసు పెరిగినకొద్దీ కష్టం. ఎవరూ కేర్ చెయ్యరు" అంది సునీత.

పద్మజ నవ్వేసింది.

"అది మన భ్రమ. ఎప్పటికీ ఏవో సమస్యలు ఏ వయసుకి తగ్గవి ఆ వయసులో ఉంటూనే ఉంటాయి. వార్ధక్యం

వచ్చాక ఒంట్లో ఓపిక ఉండదు కాబట్టి ఏవో రోగాలు రావటం సహజం. కానీ యాభై రాగానే ఏడుస్తూ ఇంక నా పనైపో యిందని బాధపడటం, ఎవ్వరూ కేర్ చెయ్యటం లేదనుకోవటం అనవసరం"

"అట్లా అంటున్నావా? యాభై ఏళ్ళు కాదు. ముప్ఫైకే ముసలాళ్ళం అయి పోయాం అనుకునే ఫీల్డులూ చూశాను"

"ఏ సినిమా ఇండస్ట్రీలోనో అట్లాగ ఉండ వచ్చేమో" అంది పద్మజ.

ఎప్పటికప్పుడు కొత్త హీరోయిన్లు వస్తున్న ఈ రోజుల్లో నాలుగేళ్ళు హీరోయి న్‌లా నటించటం గొప్పే. ఇదివరకు రోజుల్లోలా దశాబ్దాల తరబడి ఎవరూ హీరోయిన్లుగా వెలిగిపోవటం లేదు.

పద్మజకి ఒక ఫ్రెండు ఉంది. ఆమె అన్నయ్య సినిమా ఫీల్డులో పనిచేస్తాడుట. ముప్ఫై ఏళ్ళొస్తే ముసలాళ్ళ కిందే లెక్క. కథానాయిక వేషాలకి పనికిరారు అని చెప్పింది. ముప్ఫై వచ్చినా కొందరు అప్ప టికే ఫీల్డులో నిలదొక్కుకున్న వాళ్ళు హీరో యిన్‌గా వేస్తూ ఉండవచ్చు. వాళ్ళు చాలా కొద్ది సంఖ్యలో ఉంటారు. కొత్తగా కథానా యికగా పరిచయం చేయటానికి ముప్ఫై ఏళ్ళ వయసున్న ఎవర్నీ తీసుకోరు. అట్లా తీసుకున్న సంఘటన ఉంటే చెప్పు. అని ఛాలెంజ్ చేసింది. గ్లామర్ ఫీల్డ్ కాబట్టి అంటే అనుకోవచ్చు.

"సినిమా ఇండస్ట్రీ కాదు. నేను బెంగు ళూర్లో సాఫ్ట్‌వేర్లు ఉండే దగ్గరకి వెళ్ళి చూశాను. అక్కడ ఎవళ్ళూ ముప్ఫై దాటిన వాళ్ళు కనబడలేదు. మన హైటెక్ సిటీకి వెళ్ళి చూడు. అంతా కుర్రగ్యాంగ్. వాళ్ళ ముందు మనం ముసలాళ్ళల్లా ఉంటాం. మనమేంటి? మనకన్నా ఇరవై ఏళ్ళు చిన్న వాళ్ళు కూడా వాళ్ళ ముందు దిగదుడుపే" సునీత బాధపడింది.

"అవుననుకో. కానీ ఎప్పుడూ ఇంతేకదా. కొత్త నీరు రావటం సహజమే"

"ఏం కాదు. ఇదివరకు వయసుకి కాస్త విలువ ఉండేది. ఇప్పుడు కుర్రవాళ్ళని చూడు. కనీసం నమస్కారం పెట్టాలన్న జ్ఞానం కూడా ఉండదు. కొందరి ఇళ్ళకి వెళ్తే పిల్లలు టి.వి. మీద నుంచి కళ్ళు తిప్పి కనీసం చూడను కూడా చూడరు. ఎంతసేపూ వాళ్ళ ఫ్రెండ్స్, క్లబ్బులు, ఎంజాయ్‌మెంట్ చదువులు అంతే"

"అట్లా ఎందుకనుకోవాలి. కల్చర్ మారి పోయింది. ట్రెండ్ మారిపోయింది. ప్రతి దాని నిర్వచనం మారింది. మారే కాలంలో పిల్లలు కూడా మారతారు. వాళ్ళల్లో ఉన్న మంచి గ్రహించవేం? ఇది వరకు బుద్ధిమంతులూ, బాగా చదివే వాళ్ళూ సోడాబుడ్డీ కళ్ళద్దాలు పెట్టుకుని చదువు తప్ప మరే ధ్యాస పట్టనట్లు ఉండే వాళ్ళు. కానీ ఇప్పుడు అలా కాదు. వాళ్ళు బాగా చదువుతారు. గొప్ప గొప్ప విష యాలు తెలుసు. ఫ్యాషనబుల్‌గా తయార వటం తెలుసు. మనలాగా భద్రతతో ఒక మాదిరి చట్రంలో అమరిన జీవితం వాళ్ళకు లేదు పాపం. అయినా వాళ్ళు అంతటి అభద్రతా భావంతో గడుపు తున్నా సుఖంగా గడిపేస్తున్నారు. కష్టపడ తారు, ఎంజాయ్ చేస్తారు. ఒక నమ స్కారం పెట్టగానే మనమంటే భక్తి ఉన్నట్లు కాదు. వాళ్ళకి జీవితం తెలుసు. ఉన్న అవకాశాలు సద్వినియోగం చేసు కుంటూ, సుఖంగా గడపటం తెలుసు."

"ఏమో. నాకీ యువతరం ఎంతమాత్రం నచ్చటం లేదు" అంది సునీత.

"నచ్చకపోతే వాళ్ళ గురించి ఆలోచిం చటం మానెయ్యి. ఈ లోకం చాలా పెద్దది. మనకి కావాల్సినవి మనం వెతు క్కోవచ్చు" అంది పద్మజ.

"అంతేలే. కానీ కొన్ని చూస్తే బాధగా ఉంటుంది. మా ఇంటికి రా. నీకు కొన్ని

చూపిస్తాను" అంది సునీత.

"వస్తాలే" అంది పద్మజ.

"రేపు పొద్దున్న రా"

"వస్తాను"

మర్నాడు పొద్దున్న పదకొండు గంటలకి పద్మజ సునీత ఇంటికి వెళ్ళింది. సునీత ఇల్లు అక్కడికి చాలా దూరం. ఇంకా కొత్త కాలనీ కాబట్టి ఇళ్ళు ఎక్కువ పడలేదు. ఆ కాలనీకి ప్లాట్లు చేసి అమ్మిన సొసైటీ కాస్త హంగుగా కనబడితే జనం కొంటారని మంచిరోడ్లు వేసింది. ఆ కాలనీ దాటాక మరే కాలనీ లేదు. అంతా నిర్మానుష్యంగా ఉంటుంది. అక్కడో ఇల్లు, ఇక్కడో ఇల్లు తప్ప మరేం లేవు.

అక్కడికి వెళ్ళాక సునీతకి యువతరం మీద ఎందుకంత రోత కలిగిందో పద్మజకి అర్థమైంది.

ఆ కాలనీకి కాస్త దూరంలో సెంటర్‌గా ఉన్న మరో కాలనీ ఉంది. అక్కడ ఒక డ్రైవింగ్ స్కూల్ ఉంది. అందులో కారు డ్రైవింగ్, స్కూటర్ డ్రైవింగ్ అన్నీ నేర్పిస్తారు. లైసెన్స్ తొందరగా దొరుకుతుందనే నమ్మకంతో కుర్రకారంతా అక్కడే చేరుతారు. వాళ్లకి దగ్గర్లో కాస్త నిర్మానుష్యంగా ఉండి, మంచిరోడ్లు ఉన్న కాలనీ ఇదే. పద్మజ వెళ్ళేసరికే కొంతమంది కుర్రకారు రయ్యిరయ్యిమని స్కూటర్లు, కార్లు, మోటార్ సైకిళ్ళు వేసుకుని తిరుగుతున్నారు. వాళ్ళు అసలు నేర్చుకోవటానికొచ్చినట్లు ఎంతమాత్రం లేరు. ఆకాశంలో అయినా బండి నడిపేస్తాం అన్నంత ధీమాగా వాటిని నడుపుతున్నారు. ఇంకా ఆశ్చర్యం కలిగించే విషయం ఏంటంటే వాళ్ళల్లో యువకులే కాక పాలుగారే పసివాళ్లు ఉన్నారు. ఉత్సాహం ఉరకలు వేస్తుంటే ఎంతో ధీమాగా సులువుగా పెద్ద పెద్ద మోటార్ సైకిళ్ళు కూడా నడిపేస్తున్నారు. వాళ్లని చూస్తే ఎవరికైనా నవ్వు తన్నుకుని వస్తోంది. ఆ తర్వాత అంతంత

> # కొత్తగాలి...
>
> **గాలి ఒకటే**
> **వాసనలు వేరు**
> **మనిషి ఒకటే**
> **బుద్ధులు వేరు**
>
> **- ఆర్.ఎస్. హైమవతి, చెన్నై**

వాహనాలు వాళ్ళకి ఏ మాత్రం సందేహించకుండా ఇచ్చేసిన పెద్దవాళ్ళమీద కోపం వస్తుంది. వీళ్ళంతా ఇట్లా చేస్తుంటే పాదచారుల సంగతేంటి? ఇట్లాంటి వాళ్ళు చేసే పొరపాట్ల వల్ల పాదచారులు యాక్సిడెంట్ పాలుగారా? ఎన్నెన్నో సందేహాలు, కోపాలు వస్తాయి.

వాళ్ళు మాత్రం డోంట్ కేర్ అన్నట్లు నవ్వుకుంటూ నడిపేస్తున్నారు. పిల్లలకి ఇట్లా కార్లూ, మోటార్ సైకిళ్ళూ ఇచ్చి వాళ్ళెలా నడుపుతున్నారో కూడా పట్టించుకోని ఆ పెద్దవాళ్ళు అసలేం మనుషులు? యాక్సిడెంటైతే వీళ్ళకి కూడా దెబ్బలు తగుల్తాయన్న భయం కూడా లేదా?

అంతలో ఒక కారు వేగంగా వస్తూ, అక్కడ నడుస్తున్న ఒక కుక్కని డాష్ కొట్టింది. కుక్క వికృతంగా ఏడుస్తూ అరిచింది. పద్మజకి జలదరించింది. గుండె దడదడగా కొట్టుకుంది. కారు కుక్కని ఏ మాత్రం పట్టించుకోకుండా వేగాన్ని ఏమాత్రం కంట్రోల్ చెయ్యకుండా వెళ్ళిపోయింది. కారు వెళ్ళాక కుక్క దగ్గరికి పరుగెత్తింది పద్మజ. కుక్కకి కాలు విరిగినట్లుంది. లేచి కుంటుతూ నడుస్తోంది. అదృష్టం, కారు దాన్ని రాసుకుంటూ పోయినట్లుంది. డ్రైవర్ ఏ మూడ్‌లో ఉన్నాడో గానీ దాని మీదనుంచి పోనివ్వలేదు. అదే పదివేలు అన్నట్లు అంతా

## నిత్య ద్వివచనం?

'బాపు-రమణ' అంటే ముచ్చటపడే వ్యాకరణ పండితుడొకాయన తెలుగు భాషలో ఒక వ్యాకరణాఖ్యానం చెప్పాడు. 'దేవుడు- నిత్య ఏకవచనం, పాలు నిత్య బహువచనం.

సంస్కృతంలో తప్ప తెలుగులో ద్వివచనం లేదనుకుంటారుగాని, ఒకే ఒక్క నిత్య ద్వివచనం ఉంది. అది 'బాపు-రమణ'

### రాజు మంత్రి అవుతాడా?

పి.వి. నరసింహారావు దిగిపోగా 'ఆయన స్థానంలో ముఖ్యమంత్రి ఎవరు?' అన్న చర్చ జరుగుతోంది. నండూరి రామమోహనరావు అధ్యక్షతన చర్చలో పాల్గొన్న సినీ పెద్దమనుషుల్లో ముళ్ళపూడి, యమ్వీయల్, పులిదండి రాజుగారు, సీతారాముడు ఉన్నారు.



ఓ సూచన పారేస్తూ 'ఈసారి ముఖ్యమంత్రిగా మన పార్టనర్ రాజుగార్ని ఎన్నుకుంటే బావుణ్ణు' అన్నారు సీతారాముడు.

ముళ్ళపూడి అడ్డు తగులుతూ 'రాజు గారు 'రాజే'గాని, మంత్రి ఎలా అవుతారు?' అని చమత్కరించారు.

---

చూస్తూ నిలబడ్డారు. కుక్కని పట్టుకుని వైద్యం చేయిద్దామని అనిపించింది పద్మజకి. కానీ కుక్క పద్మజని దగ్గరికి రానివ్వలేదు. ఏ మనిషినీ ఎన్నడూ నమ్మనే నమ్మకూడదన్న భావం దాని కళ్ళల్లో కనిపిస్తోంది. కుక్కని దగ్గరగా చూసిన పద్మజ నివ్వెరపోయింది. అది మంచి జాతికుక్క. వయసైపోయి ముసలిదైపోయింది కానీ మంచి జాతికి చెందిన మేలు రకం కుక్క ఛాయలు దాన్లోంచి పోలేదు. అది ఎట్లాగో కాలు కూడదీసుకుని, లేచి పరుగుతీసి పారిపోయింది.

"ఇంత మంచి కుక్క? పాపం తప్పిపోయిందా?" అనుమానం కలిగింది.

"పోన్లే పాపం. పెద్దగా దెబ్బ తగిలినట్లు లేదు. అది పారిపోయిందంటే కాలు బాగున్నట్లేగా?" అంది పద్మజ.

"అవును. కానీ దానికి ఏదో జబ్బు ఉండే ఉండాలి. ఇవాళ కాకపోతే రేపన్నా చస్తుంది" నిర్లిప్తంగా అన్నాడు ఒకతను.

అతనూ, పద్మజా, ఇంకోతనూ తప్ప అక్కడ ఇంకెవరూ లేరు.

"ముందు మనం జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే ఏ కారో వచ్చి మనల్ని కొట్టేసి పోతుంది. ఇక్కడ పట్టించుకునేవాళ్ళు కూడా ఉండరు" అన్నాడు ఇంకో ఆయన ఒక్కదూకులో ఫుట్‌పాత్ మీదికి ఎగిరి.

పద్మజ కూడా ఫుట్‌పాత్ మీదికి దూకేసింది. ఇల్లు కనుక్కుందామని అటూ ఇటూ చూస్తోంది. ఉన్నవి కొద్ది ఇళ్ళే. అందులో ప్లాస్టరింగ్ లేని ఇల్లే తమదని చెప్పింది సునీత. ప్లాస్టరింగ్ లేని ఇంటి కోసం చూస్తోంది.

దూరంగా ఉన్న ఒక ఇంట్లోంచి సునీత లాంటి మనిషి బయటకు వచ్చింది. పద్మజ ఆమె వైపే చూస్తోంది.

ఆమె సునీతే. పద్మజని చూస్తూనే ఆనందంగా చెయ్యి ఊపింది.

"బస్‌స్టాప్‌కి వద్దామని అనుకుంటున్నాను. ఇంతలో నువ్వే వచ్చావు" అంది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. పద్మజ కుక్క సంగతి చెప్పింది.

"ఇంకాస్త దూరం నడిచే ఓపిక ఉంటే బోలెడు మంచి కుక్కల్ని చూపిస్తాను" అంది సునీత.

"అంటే?"

"నేను చెప్పను. చూడు అంతే."

"నాకు ఓపిగ్గానే ఉంది. నడవగలను" పద్మజ సునీతతో పాటు నడుస్తోంది.

ఇద్దరూ కాలనీ దాటి నిర్మానుష్యంగా ఉన్న ప్రాంతం చేరుకున్నారు. చెట్లు, పచ్చటి గడ్డి, అందమైన పరిసరాలతో ఉన్న ఆ ప్రాంతంలో అదోమాదిరి కంపు. భరించలేక ముక్కు మూసుకున్నారు.

"ఏదో జంతువు చచ్చిపోయినట్లుంది" అంది పద్మజ.

"రోజుకో జంతువు చస్తుంది" అంది సునీత నిర్లిప్తంగా. ఇంతలో కొన్ని కుక్కలు కనిపించాయి. వాటిల్లో కొన్ని మేలుజాతి కుక్కలు కూడా ఉన్నాయి. వాటికి వార్ధక్యంతోపాటు రకరకాల రోగాలు కూడా వచ్చినట్లున్నాయి.

"వీటిని చూస్తుంటే..." పద్మజ ఏదో చెప్పబోయింది.

"నువ్వేం అడగబోతున్నావో అర్థమైంది. ఇవన్నీ మేలురకం కుక్కలు. ఇవి చాలా చాలా గొప్పవాళ్ళ ఇళ్ళల్లో పెరిగి, ఇంగ్లీషు మాత్రమే అర్థం చేసుకునే స్థాయి కుక్కలు. కానీ ఏం లాభం? వాటికి కూడా వృద్ధాప్యం వచ్చింది. వాటిని కేర్ చెయ్యటం మానేశారు. కొన్నిటికి ఏవో రోగాలు వచ్చాయి. అంతే. మనిషి జంతువులన్నిటికన్నా క్రూరజంతువు. మిగతా జంతువులని వాడుకుని వదిలేయటం, తియ్యగా మాట్లాడి మోసం చెయ్యటం తెలుసు. ఇవి బాగా ఉన్నన్నాళ్ళు రకరకాల తిండి పెట్టి, ముద్దుగా చూసుకున్న యజమానులు, వీటికి రోగం వచ్చి మూలపడి, ఇక పనికిరావనుకున్నప్పుడు వాటిని కార్లలో ఎక్కించుకుని ఇట్లా ఊరు పొలిమేరలకి తీసుకొస్తారు. కార్లలో షికార్లు చెయ్యటం అలవాటే కాబట్టి ఆ అమాయక జీవులు పాపం కారు ఎక్కి కూర్చుంటాయి. అంతే, ఇట్లా శివారు ప్రాంతాలకి తీసుకొచ్చి వాటిని దింపి, కారు స్పీడ్‌గా నడుపుకుంటూ పోతున్నారు. అవి అంతవరకూ అలవాటు పడ్డ హైక్లాస్ కల్చర్ నుంచి ఒక్కసారి వీధికుక్క లెవెల్‌కి వస్తాయి. కానీ తమ పరిస్థితి అర్థం చేసుకోలేక కొన్నాళ్ళు కంగారు పడతాయి. ఆకలి అన్ని జీవులకూ ఒకటే. అకలి మండుతుంటే గొప్పా బీదా తేడాలు ఉండవు. అంతా ఒక్కటై ఆహారం కోసం పోట్లాడుకుంటారు. ఇక్కడ ఈ కుక్కలూ అంతే"

## కొత్తగాలి...



**ఇప్పుడసలు**
**గుండెలు చెమ్మగిల్లడమే లేదు**
**వర్షం వచ్చినప్పుడు**
**గోడలు తప్ప!**

- భాస్కరభట్ల,
హైదరాబాద్

సునీత మామూలుగా చెప్పుకుపోతోంది. పద్మజ మాత్రం తీవ్రంగా చలించిపోయింది. ఆ కుక్కల్ని చూసి మనసు ద్రవించిపోయింది. సునీత అంత యాధాలాపంగా ఎట్లా చెపుతోందో అర్థం కాలేదు. అంత స్పందన లేకుండా మనుషులెలా ఉంటారా అనిపించింది.

కానీ కొద్దిరోజుల్లోనే తన ఆలోచన తప్పని పద్మజకి తెలిసిపోయింది.

సునీత జంతు ప్రేమికులు నడుపుతున్న ఒక స్వచ్ఛంద సంస్థని సంప్రదించింది. వాళ్ళు ఆ కుక్కలన్నింటికీ వైద్యం చేశారు. అవన్నీ ఆరోగ్యంగా తయారయ్యాయి. వృద్ధాప్యం పట్టి పీడిస్తున్నా పుండ్లూ, గాయాలూ తగ్గి, విరిగిన కాళ్ళు నయమై, మామూలుగా నడుస్తున్నాయి. అక్కడ పూర్తి కాకుండా వదిలేసిన ఒక ఇల్లు ఉంది. ఆ ఇంటి యజమానికి ఇప్పట్లో దాన్ని పూర్తిచేసే అవకాశం లేదుట. అతనికి కొంత అద్దె చెల్లించి, ఆ కుక్కల్ని అక్కడ ఉండేట్లు ఏర్పాటు చేశారు. ఆ స్వచ్ఛంద సంస్థవాళ్ళే కుక్కలకి రోజు వ్యాన్‌లో ఆహారం తెచ్చి పెడతారుట.

ఊరికే మాటలు చెప్పేవాళ్ళు కొందరు. కానీ కొంతమంది మౌనంగా తాము చేసేది చేసి చూపిస్తారు. సునీత మాటల మనిషి కాదన్నమాట. తాను వాటి

గురించి చాలాసేపు బాధపడింది. కానీ ఏమీ చెయ్యలేదు. సునీత ఏమీ చెప్పలేదు. కానీ వాటన్నిటినీ కాపాడుతోంది.




పద్మజ వాకిట్లో కళ్లాపి చల్లడానికి వచ్చింది. ఇంకా చీకట్లు తొలగలేదు. చలి విపరీతంగా ఉంది. ఎవరూ ఇంకా ఇళ్ల ల్లోంచి బయటకు రాలేదు. నీళ్లు తగిలి చెయ్యి జిల్లుమంది.

ఏదో అలవాటు కాబట్టి అట్లాగే భరిస్తూ చల్లుతోంది పద్మజ.

ఉన్నట్టుండి ఎదురింట్లోంచి ఏడుపులు, శోకాలు వినిపించాయి. పద్మజకి గుండె ఝల్లుమంది. కాళ్లూ చేతులూ వణికాయి. ఏమైందోనని భయపడుతూ ఎదురింట్లోకి పరుగెత్తింది. చుట్టుపక్కల ఇళ్లల్లో వాళ్లు కూడా ఆ శోకాలకి హడలిపోయి, తలు పులు తెరుచుకుని బయటకు వచ్చారు.

ఎదురింట్లో పరమేశ్వర్రావు కుటుంబం ఉంటుంది. ఆయన భార్య పార్వతికి యాభై ఏళ్లుంటాయి. ఆయనకి యాభై ఐదు. ఆ ఇంట్లో ఆయనా, భార్య మాత్రమే ఉంటున్నారు. పిల్లలు హాస్టల్లో ఉంటారు. పరమేశ్వర్రావు తల్లి ఈమధ్య వచ్చింది. ఆవిడ ఎక్కడో తీర్థస్థలంలో గది తీసుకుని ఉంటుందిట. మళ్లీ వెళ్లిపోతుందిట. పార్వ తికీ, అత్తగారికీ పడదనీ అందుకే ఆవిడ వేరే ఊళ్లో ఒక్కత్తే ఉంటోందనీ జనం అనుకుంటున్నారు. మొత్తానికి పార్వతి అంటే పరమేశ్వర్రావుకి ప్రాణం. ఆ ఇల్లు మొత్తం పార్వతి అభిరుచులని వెదజ ల్లుతూ ఉంటుంది. ఇంటి ముందు పూల చెట్లూ, ఇంటివెనుక పళ్ల చెట్లూ అన్నీ పార్వతికి నచ్చినవే. ఇంట్లో ప్రతి వస్తువూ ఆమె ఇష్టప్రకారం ఏర్పరుచుకున్నదే.

ఇంట్లో వంట ఏం చెయ్యాలో అన్న దగ్గ ర్నుంచి పిల్లలకి ఏ చదువులు ఎలా చది వించాలన్నది కూడా ఆమె ఇష్టమే. అంతెం దుకు? తన జీతం సంగతి కూడా పరమేశ్వరరావుకి సరిగ్గా తెలీదని చెప్పుకుం టారు. ఏ.టి.ఎంలో డబ్బు పడుతుంది. ఆయనకి మెసేజ్ వస్తుంది. అది కూడా పార్వతే చూసుకుంటుందట. ప్రతీది ఆమె చూసుకుంటుంది. ఓకే, అలాగే- అనటం తప్ప ఆయనకి మరేదీ తెలియదని అంతా అనుకుంటారు. వాళ్లని చూస్తే చాలు ప్రేమకి రూపం ఎట్లా ఉంటుందో అంద రికీ తెలుస్తుంది. షాజహాన్.. ముంతాజ్ మహల్‌లాగా కనిపిస్తారు వాళ్లు. వాళ్ల ఇంటికి కూడా పార్వతీ నిలయం అని పేరు పెట్టుకున్నారు.

ఇప్పుడు ఏమిటీ ఏడుపులు? పార్వతి అత్తగారు కానీ..? పద్మజకి అనుమానం కలిగింది. పద్మజ పరమేశ్వర్రావు ఇంట్లోకి పరుగెత్తుకుంటూ వెళ్లిందో లేదో అంతా వెనకాలే వచ్చేశారు.

"ఏమైంది? ఏమైంది?" అడుగుతు న్నారు.

ఎదురుగా పార్వతి అత్తగారు శోకాలు పెడుతూ ఏడుస్తోంది. పరమేశ్వర్రావు "ఓరి దేవుడా" అంటూ కేకలు పెడుతు న్నాడు.

ఇద్దరూ ఉన్నారు. అంటే? పార్వతి? పద్మజ కాళ్లూ చేతులూ వణికాయి.

ఇంతలో అంతా ఏమైందని అడిగారు. పరమేశ్వర్రావు ఏడుస్తూ చెప్పాడు. రాత్రి

మామూలుగానే భోంచేసి పడుకున్నారు. ఆయన మధ్యలో ఒకసారి లేచాడు కూడా. పార్వతి హాయిగా నిద్రపోతోంది. పొద్దున్నే లేచే పార్వతి ఆ రోజు ఇంకా ఎందుకు లేవలేదా అని అనుమానం వచ్చి తట్టి చూశాడు. పార్వతి కదలలేదు. భయం వేసి కదిపి చూశాడు. పార్వతిలో చలనం లేదు. ముక్కుదగ్గర చెయ్యిపెట్టి నాడి పట్టుకొని చూశాడు. అప్పటికప్పుడు పరుగెత్తుకుంటూ వెళ్లి దూరంలో ఉన్న డాక్టర్‌ని పిల్చుకొని వచ్చాడు. ఆయన పార్వతి చచ్చిపోయిందని ప్రకటించి వెళ్లి పోయాడు. ఆయన పరీక్షలు చేసి డాక్టర్ కాబట్టి ప్రకటించాడు కానీ ఆ విషయం పరమేశ్వర్రావుకి కూడా ముందే అర్థమైపో యింది. ఆయన భోరుమని ఏడుస్తూ, అంతా వివరిస్తుంటే వినే వాళ్లకి కూడా ఏడుపు ఆగలేదు.

చైతన్య స్రవంతిలా గలగలమంటూ, నవ్వుతూ తుళ్లుతూ ఉండే పార్వతిని ఒక్క సారిగా నిర్జీవంగా, నిశ్చలంగా చూసేసరికి, చూసేవాళ్ల గుండె ఆగిపోయినట్లనిపిం చింది.

ఏమిటీ శరీరం? ఒక్క క్షణంలో అంతా ముగిసిపోతుంది. ఇన్ని కనుక్కున్నారు. ఇంత విజ్ఞానం పెరిగింది. కానీ ప్రాణం ఎట్లా వస్తోందో ఎట్లా పోతోందో తెలుసు కున్నవాళ్లు లేరు. రాత్రి తనతోపాటే భోంచేసి తన పక్కనే నిద్రించిన మనిషి ఏ క్షణంలో ప్రాణం పోయిందో పరమేశ్వరరా వుకి తెలియనే లేదు.

పరమేశ్వర్రావు వెక్కి వెక్కి ఏడుస్తు న్నాడు. చూస్తున్న వాళ్లకి ఎట్లా ఓదా ర్చాలో కూడా తెలియలేదు.

"అయ్యో... నేను పక్కనే ఉన్నానండీ. అయినా నన్ను వదిలేసి వెళ్లిపోయింది. అయ్యో... పార్వతి లేకుండా నేనెట్లా బతి కేది? " ఏడుస్తున్నాడు పరమేశ్వర్రావు.

ఎట్లా ఓదార్చాలో తెలియక అంతా

## కొత్తగాలి...

**మనసుకు**
**ముసురు పట్టిందేమో**
**కళ్లు**
**అదేపనిగా వర్షిస్తున్నాయి**

– పినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

కంగారు పడుతున్నారు.

"ఊరుకోండి. ఏంచేస్తాం? ఇంతే ప్రాప్తం"

"ఆవిడకేం అదృష్టవంతురాలు అనా యాస జీవనం. సునాయాస మరణం"

ఎవరికి తోచినట్లు వాళ్లు ఓదారుస్తు న్నారు.

"ఆవిడ అదృష్టవంతురాలేనండీ. నేనే దురదృష్టవంతుడిని. ఆవిడ లేకుండా నేను బతకలేను."

పరమేశ్వర్రావు మళ్లీ భోరుమన్నాడు.

ఆయన్ని ఓదార్చటం ఎవ్వరి తరం కావటం లేదు. ఏంచేసి కూడా ఆయన్ని ఓదార్చలేమన్నది అందరికీ తెలిసిన విష యమే. కాలమే ఆయన్ని ఓదార్చుతుందని అంతా నిట్టూర్చారు. ఆయనకి ఈ దుఃఖం భరించలేక గుండెపోటు వస్తే? రక్తపోటు హెచ్చి ఏ పక్షపాతమో వచ్చేస్తుందేమో? ఏం చెయ్యాలి? ఎట్లా ఆయనను రక్షించు కోవాలి? ఇదే అందరికీ మనసులో పీడి స్తున్న ప్రశ్న.

"అయిందేదో అయింది. ఇంక జరగా ల్సింది చూడండి. ఎంత ఏడ్చినా పోయిన ప్రాణం తిరిగి రాదుగా"

పరమేశ్వర్రావు కుప్పకూలిపోయాడు. ఆయన్ని ఓదార్చటం ఎవరివల్లా అయ్యేట్లు లేదు. ఇంక లాభం లేదని అంతా ఆయన్ని అడిగి, తామే పూనుకుని కావల్సిన వాళ్లకి ఫోన్లు చేశారు. జరగాల్సిన ఏర్పాట్లు

చూశారు.

మధ్యాహ్ననికి రావాల్సిన వాళ్లంతా వచ్చేశారు. డబ్బులు ఇచ్చేసరికి అంతా రెడీ అయిపోయింది. పాడె, కుండ అన్నీ రెడీ అయిపోయాయి. సాయంత్రం నాలుగ్గంట లకల్లా అంతా సిద్ధం అయిపోయింది. పార్వతికి స్నానం చేయించి పట్టుచీరె కప్పి, నుదుట పెద్దబొట్టు పెట్టారు. పాడె లేస్తుండగా పరమేశ్వర్రావుని పట్టుకోవడం ఎవరికీ సాధ్యం కాలేదు. గుండెలు బాదుకుని ఏడుస్తున్నాడు. ఆయనకి బ్లడ్ ప్రెషర్ ఉంది. ఈ దుఃఖంతో ఆయన్ని ఏ రోగం చుట్టుముట్టుతుందోనని అంతా వణికిపోయారు.

అంతా ఆయన్ని పొదివి పట్టుకుని ఓదారుస్తున్నారు. శవాన్ని లారీలో ఎక్కించారు. పరమేశ్వర్రావు తానూ అంతిమ యాత్రలో వస్తానని గోల చెయ్యడం మొదలుపెట్టాడు. ఆయన తట్టుకోలేడనిపించి అంతా ఆయన్ని వద్దన్నారు. ఆయన్ని బలవంతాన ఒక గదిలోకి లాక్కెళ్లారు.

పిల్లల్ని అయినా ఓదార్చగలిగారు గానీ, ఆయన్ని మాత్రం ఓదార్చలేకపోయారు అంతా. పిల్లలు రాత్రికి స్నానాలు చేసి అన్నం తిన్నారు. కానీ పరమేశ్వర్రావు మాత్రం అన్నం ముట్టుకోలేదు. ఎంత బతిమాలినా ఆయన చేత ఒక్క మెతుకు కూడా ఎవ్వరూ కొరికించలేకపోయారు. ఆయన బాధ వర్ణనాతీతం. అట్లాగే ఒక రోజు గడిచిపోయింది.

ఆయనచేత బలవంతంగా పాలు కూడా తాగించలేకపోయారు. ఆయన ఎవ్వళ్లతో ఒక్కముక్క కూడా మాట్లాడటం లేదు.

"చస్తావా ఏంటి? ఏదో ఒకటి తిను. ఊ..." ఆయనకి వరుసకి బాబాయి అయ్యే వ్యక్తి ఒకరు గద్దించాడు.

"ఏంటీ మూర్ఖత్వం? నువ్విలాగ ఏడుస్తుంటే పిల్లలు ఎట్లా? వాళ్లను ఓదార్చేది పోయి నువ్వే ఏడుస్తుంటావా? " బాబాయి తిట్టాడు.

పరమేశ్వర్రావు కదలలేదు.

చివరికి ఎంత బతిమాలినా ప్రయోజనం లేక అంతా ప్రయత్నం మానుకున్నారు. పరమేశ్వర్రావు తన గదిలోకి వెళ్లిపోయాడు. దూరపు బంధువులంతా ఎవరిదారిన వాళ్లు పోయారు. దగ్గరి బంధువుల్ని కూడా పరమేశ్వర్రావు తల్లి మళ్లీ రండని పంపేసింది. పిల్లలు చూస్తే చిన్నపిల్లలు. పరమేశ్వర్రావు అసలు మనుషుల్లో లేడు. మిగతా కార్యక్రమం ఎట్లా?

డబ్బులిస్తే మిగతా కార్యక్రమం అంతా కూడా తామే జరిపించే వాళ్లున్నారు. పరమేశ్వర్రావు డబ్బు ఇచ్చాడు.

ఆయన ఎప్పటికి కోలుకుంటాడో ఎవరికీ అర్థం కాలేదు. ఎవరితోనూ మాట్లాడటం లేదు. మౌనదీక్ష పాటించాడు. ఎక్కడికీ పోడు.

ఏ పనీ చెయ్యడు. ఆఫీసుకి కూడా ఎన్నాళ్ళు సెలవు పెట్టాడో తెలియదు. ఆఫీసుకి కూడా వెళ్లటం లేదు. మనిషి తన ఇంట్లోనే మగ్గిపోతున్నాడు. ఏ అఘాయిత్యం అయినా చేసుకుంటే? అంతా భయపడిపోయారు. పోనీ ఏమన్నా చెపుదామన్నా ఆయన తన చుట్టూ గిరిగీసుకుని కూర్చున్నాడు. ఏం చెయ్యాలి? ఏ క్షణం ఏ వార్త వినాల్సి వస్తుందోనని అంతా భయపడుతున్నారు.

ఇట్లాగే పదిహేను రోజులు గడిచాయి. ఆ రోజు పొద్దున్న పరమేశ్వర్రావు ఒక్కడే కారు వేసుకుని ఎటో పోతున్నాడు.

ఎటు పోతున్నాడు? మనిషి అసలే డిప్రెషన్‌లో ఉన్నాడు. ఆత్మహత్య చేసుకుంటాడా? లేకపోతే విరక్తితో సన్యసిస్తాడా?

ఏం జరగబోతోంది?

ఆయన చాలా ముభావంగా, నిర్లిప్తంగా

కనిపించాడు. పలకరించిన వాళ్ళకి ముక్త సరిగా జవాబు చెప్పాడు.

కారు వెళ్లిపోయింది.

వెళ్లిన కారు సాయంత్రానికి తిరిగి వచ్చింది. మామూలుగా రాలేదు. కారు నిండా పూలతో అలంకరించి ఉంది.

కార్లో పరమేశ్వర్రావు సూట్ వేసుకుని నవ్వులొలికిస్తున్నాడు. ఆయన పక్కన పట్టుచీరె, పూలజడ, మెడనిండా నగలు చేతినిండా గాజులతో నలభై అయిదేళ్ళ మహిళ. పరమేశ్వర్రావు ఎంత సంతోషంగా ఉన్నాడంటే ఆయన మొదటి పెళ్లికి కూడా అంత ఆనందంగా ఉండి ఉండడు. కళ్ళల్లో తళుకు, మొహంలో మెరుపు, పెదవులపై నవ్వులు.

అంతా ఓ. కే.

కానీ అసలు ఇంట్లోంచి బయటకే రాని పరమేశ్వర్రావు పెళ్లి సంబంధం ఎట్లా కుదుర్చుకున్నాడు?

ఇంటర్‌నెట్‌లో 'రెండో పెళ్లి కొడుకు డాట్ కామ్'లో తన ప్రొఫైల్ పెట్టాడుట. కొంతమంది అప్లై చేసుకున్నారు. వాళ్లతో వీడియో చాటింగ్ చేసి తనకి నచ్చిన పిల్లను కుదుర్చుకున్నాడు. ఎందుకైనా మంచిదని ఒక డిటెక్టివ్ ఏజన్సీని సంప్రదించి ఆ అమ్మాయి గురించి రిపోర్ట్ సేకరించాడు. అంతా సరిపోయింది. ఎవళ్ళకీ చెప్పలేదు. ఇవాళ పొద్దున్నే వెళ్ళి పెళ్ళి చేసుకుని వచ్చాడు.

అంతా అవాక్కయ్యారు.

ఇదివరకు రోజుల్లో పెళ్లి అంటే ఎంత తతంగం ఉండేది. ఈ రోజుల్లో ఇంటర్నెట్ పుణ్యమా అని సింపుల్ అయిపోయిన వాటిల్లో పెళ్లి ఒకటి. ఇదివరకు సర్కిల్ ఉంటేగానీ పెళ్లి సంబంధాలు కుదిరేవి కావు. ఇప్పుడు ఇంట్లో కూర్చునే పెళ్లి సంబంధాలు అన్నీ నెట్‌లోనే.

ఆ అమ్మాయి పేరు సుజనట. "సుజీ, సుజీ" అని పిలుస్తూ ప్రేమగా వెనకే తిరుగుతున్నాడు పరమేశ్వరరావు.

అంతా నిర్ఘాంతపోయి చూస్తున్నారు. ఏం అనుకోవాలో కూడా అర్థం కావటం లేదు అందరికీ. ఆయన ఏ అఘాయిత్యం చేసుకుంటాడో, ఏమైపోతాడోనని అంతా భయపడుతుంటే, హాయిగా పెళ్ళి చేసుకుని వచ్చేశాడు. ఏం మనిషి? అంత యాంత్రికంగా ఎట్లా చెయ్యగలిగాడు? పరమేశ్వర్రావు పెళ్లి చేసుకున్నాడంటే ఎవరికీ నమ్మబుద్ధి కావటం లేదు. ఎట్లాంటి మనిషి. ఇద్దరూ ఒకే ప్రాణం అన్నట్లు బతికారు. ఒకే మాటగా నడిచారు. ఒకే మనస్సు, ఒకే మనిషి అన్నంతగా బతికిన భార్యాభర్తలు. ఆమె మరణిస్తే కుప్ప కూలిపోయాడు. మళ్ళీ ఇక లేవడేమో అన్నంత భయపెట్టాడు. మౌనముద్రలోకి జారిపోయాడు. ఇంతా జరిగి పదిహేను రోజులు కూడా కాలేదు. ఇప్పుడు హాయిగా కొత్త పెళ్లి కొడుకుగా మారి తిరిగి వచ్చాడు.

సుజనకి భర్త పోయి రెండేళ్ళయిందిట. పిల్లలు లేరు. ఉద్యోగం చేస్తున్నదిట. పొద్దున్నే వెళ్తే రాత్రి ఎప్పుడో తిరిగి వస్తుందిట. ఇన్నాళ్ళు ఎవరో కాటరింగ్ సర్వీసెస్ వాళ్ళు కారియర్ పంపిస్తే తింటున్నదిట.

"ఇక వంట నేర్చుకోవాలి" ఎవరో అన్నారు.

"ఎందుకూ? నాకు వంట వచ్చు నేను చేస్తాను" అన్నాడు పరమేశ్వర్రావు వెంటనే.

పరమేశ్వర్రావుకి యాభై ఆరేళ్ళుట. పిల్ల చదువు పూర్తి అయిపోతోంది. వాళ్ళకి ఏమీ చెయ్యక్కర్లేదు. పిల్లలకి అమ్మ కావాలన్న అవసరం లేదు.

పోనీ తనకి వండి పెడుతుందన్న దాని కోసం కూడా కాదు. పరమేశ్వరరావు తల్లి ఆరోగ్యంగానే ఉంది. ఆవిడ తేలిగ్గా వంట చేసేస్తున్నది. రెండ్రోజుల్లో మళ్ళీ తన తీర్థ

యాత్రా స్థలంలో ఉంటున్న గదికి తిరిగి వెళ్లిపోతుంది తల్లి. ఇదివరకు పార్వతికీ, ఆవిడకీ పడలేదు కాబట్టి ఆవిడ విడిగా ఉంది. ఇప్పుడు కొత్త భార్యకీ, ఆవిడకీ కూడా పడదేమోనని సందేహించి రావు గారు ఆవిడకి ముందే టిక్కెట్టు రిజర్వు చేసి, ఆవిడ తిరుగు ప్రయాణానికి అంతా సిద్ధం చేసేశారుట.

అంటే కేవలం భార్య కావాలన్న కోరికతో మాత్రమే రావుగారు మళ్ళీ పెళ్లి చేసుకున్నారన్నమాట.

జీవితసారం అంతా పిండి, చేతిలో పెట్టినట్లు అనిపించింది అందరికీ.

ఎవరో అన్నారు. మానవ సంబంధాలన్నీ ఉల్లిపాయ లాంటివని, ఒక్కొక్క పొరా ఒలుచుకుంటూ పోతే ఏమీ మిగలదని దాని అర్థం.

ఇంతేనా భార్యాభర్తల అన్యోన్యత? భార్యాభర్తల అన్యోన్యతకి ప్రతిరూపంలా నిలిచిన పార్వతీ, పరమేశ్వరరావుగార్ల పవిత్ర దాంపత్యానికి అర్థం ఇదేనా?

"కొన్ని విషయాలను భార్యతో మాత్రమే పంచుకోగలరు. కొన్ని బాధల్లో భార్య అయితేనే పాలు పంచుకుంటుంది. మళ్ళీ పెళ్లి చేసుకున్నంత మాత్రాన ముందు భార్యపై మమకారం లేనట్లు కాదు" అన్నాడు హరనాథ్.

★ ★ ★

ఆ తర్వాత పద్మజ ఎప్పుడు సునీత ఇంటికి వెళ్ళినా సునీత బిజీగానే కనిపించేది. కుక్కలకి తిండి పెట్టటం, వాటికి సంరక్షణ చేయటం చేస్తూ ఉండేది.

"నీతో ఇంత మంచితనం ఉందని నాకు తెలీలేదు. చాలా సహనం, ఓర్పు ఉంది నీకు" అంది పద్మజ.

"ఇంకా నయం, మనలాగే అన్ని జీవులూ అనుకోవటం మంచితనం అంటావా? ఒకవేళ అది మంచితనమే అయితే అలాంటిది నాకు ఉందని నాకూ

## వెధవ రాతలు చదివినందుకే..

బాపు పత్రికల్లో వచ్చే కథలకు బొమ్మలు కూడా వేస్తుంటారు. ఒకసారో ప్రముఖ రచయిత మిత్రుడు 'కథకి బొమ్మవెయ్యటానికెంత ఇస్తారోయ్ పత్రికలవాళ్లు?' అని అడిగాట్ట.



'రెండొందల చిల్లర'

'అమ్మో... ఈ వెధవ గీతలకి అంత డబ్బా?'

'అంత డబ్బు వెధవ గీతలకి కాదు. వెధవ రాతలకి బొమ్మ వెయ్యాలంటే దాన్ని చదివి చావాలిగా?' అని తిప్పికొట్టారు బాపుగారు.

తెలీదు. ఆ జంతు సంరక్షణ వాలంటరీ ఆర్గనైజేషన్ వాళ్ళు నాకు తెలిసిందాకా నేను కూడా నాలో నేను బాధపడటం తప్ప ఏమీ చెయ్యలేక పోయాను" అంది సునీత.

"మేము అదీ చెయ్యటం లేదు కదా?"

"సరేలే. నా సహనం గురించి చెప్తున్నావు కదూ. మొన్న ఒకావిడను చూశాను. ఆవిడ తన ఇంట్లోనే మానసిక వికలాంగులకి ఆశ్రయం ఏర్పరచింది. అక్కడ నువ్వు నమ్ముతావో లేదో, పాతిక మంది పైనే ఉన్నారు. వాళ్లల్లో చాలామందికి అన్నం తినటం కూడా రాదు. ఆవిడ ఓపిగ్గా వాళ్లందరికీ తినిపిస్తుంది. ఎక్కడికీ పోదు. ఏ కాలక్షేపమూ, సరదాలూ లేవు. ఎప్పుడూ వాళ్ళ సంగతే చూస్తుంది. ఆవిడ గురించి తెలిసినవాళ్ళు వెళ్ళి ఏదో ఒక

సాయం, ధనమో, వస్తువులో ఇస్తారు. ఎట్లాగో గడిచిపోతోంది ఆవిడకి. ఆవిడ సహనం, ఓర్పు చూస్తే నాకు చాలా ఆశ్చర్యం కలుగుతోంది. కొంతమంది మానసిక వికలాంగులకి బీదవాళ్ళే అయినా, అయినవాళ్ళుంటూ ఉన్నారు. వాళ్ళు అప్పుడప్పుడూ ఇళ్ళకి పోయి వస్తారు. అందులో ఎనిమిది మందిని ఆవిడ రోడ్లమీద అనాథలై తిరుగుతుంటే తీసుకొచ్చింది. వాళ్ళు ఎక్కడికీ పోరు. ఎప్పుడూ వాళ్ళ సంగతి చూసుకోవాల్సిందే. ఆవిడ చాలా ఓర్పుగా అన్నీ చేస్తుంటుంది"

పద్మజ ఆశ్చర్యపోయింది.

"నిజంగానా? అంత ఓర్పు గల వాళ్ళున్నారా? "

"ఉన్నారు. అట్లాగే తమకి తోచినంతలో, వీలైనంతలో సాయం చేసేవాళ్ళు ఉన్నారు. మనుషుల్లో సామాజిక స్పృహ ఉంటుంది. దాన్ని ఉపయోగించుకునే వాళ్ళుండాలి. మంచితనం బంగారు గని లాంటిది. వెతికి తవ్వితే కావల్సినంత మంచితనం లోకంనిండా పుష్కలంగా ఉంది. బోలెడంతమంది మంచివాళ్ళు లోకం నిండా ఉన్నారు. మనం మనకి ఎదురైనప్పుడే వాళ్ళ గురించి తెలుసుకోగలం"

పద్మజ మౌనంగా వింటూ ఉండిపోయింది. అదోరకం భావం మనసుని ఆవరించింది. మనసూ, శరీరం తేలికైపోయినట్లుంది. అంతే మరి. ఏదన్నా చెడు విషయాలు విన్నప్పుడు, దుర్మార్గుల గురించి విన్నప్పుడు మనసు భారం అవుతుంది. మంచి మాటలు వింటే మనసు తేలికవుతుంది.

ఇంటికి తిరిగివచ్చాక కూడా ఆ అనుభూతిని ఫీల్ అవుతూనే ఉంది.

కానీ సాయంత్రం చెట్లకి నీళ్ళు పోస్తుంటే పంకజం పలకరించి ఆ అనుభూతి మీద నీళ్ళు చల్లి చెరిపేసింది.

"మీ ఇంటికి అప్పుడప్పుడూ వస్తూంటుంది, మీ ఫ్రెండ్ సునీత. ఆవిడేదో కుక్కల సంరక్షణా కేంద్రంలాంటిది పెట్టిందట కదా? " అంది.

మంచితనపు పరిమళాల మధురిమను ఆస్వాదిస్తున్న పద్మజ మనసు ఇంకా ఈ లోకంలోకి రాలేదు. దాంతో తను మాట్లాడుతున్నది పంకజంతో అన్న సంగతి మర్చిపోయి సునీత చేస్తున్న పని గురించి, సునీత చెప్పిన మానసిక వికలాంగులకి సేవ చేసే మహిళ గురించీ కూడా ఉత్సాహంగా చెప్పేసింది.

"ఎంతమంది మంచి వాళ్ళు ఉన్నారండీ ఈ లోకంలో. అందుకే జనం బతకగలుగుతున్నారు" అంది.

పంకజం మొహం చిట్లించింది.

"ఎవరు మాత్రం ఊరికే చేస్తారా చెప్పండి. ఎందుకు చేస్తారు? అందులో వాళ్ళకి బాగా లాభం ఉంటుంది. ఆ కుక్కల పేరు చెప్పి ఈవిడా, పిచ్చాళ్ళని చూపించి ఆవిడా బాగా డబ్బు దండుకుంటున్నట్లున్నారు" అనేసింది తేలిగ్గా చూస్తూ.

పద్మజ బిత్తరపోయింది.

"అదేంటండీ" అంది.

"అంతేనండీ. ఏదో ఒక పేరు చెప్పి డబ్బులు గుంజటం, వీలైనంత సంపాదించుకోవటం, ఆపైన ఏదో పెద్ద సహృదయుల్లా పోజుకొట్టటం, ఈ రోజుల్లో మామూలైపోయింది" అంది.

ఇతరుల్లో ఏ గొప్పనీ, ఆఖరికి మంచితనాన్ని కూడా సహించలేని పంకజంతో మాట్లాడకుండా ఉండాల్సింది. పద్మజ మనసులోనే తననితాను మందలించుకుంది.

పంకజం కళ్ళల్లో కనబడుతున్న ద్వేషం, కల్మషం పద్మజని భయపెట్టాయి.

దేనిలోనైనా చెడుని మాత్రమే చూడగల పంకజంలాంటివాళ్ళు ఎట్లా మారతారు?

★ ★ ★

పద్మజ చెట్లకి నీళ్ళు పెడుతున్నది. ఇంతలో గేటు తీసుకుని ఎవరో లోపలకు వస్తున్నారు. ఎవరో గుర్తు పట్టలేకపోయింది.

"ఏయ్ పద్మజా. గుర్తు పట్టలేదా? నేనే సత్యని. మొన్న మాకు ట్రాన్స్‌ఫరై ఈ ఊరు వచ్చాము. రాగానే నీ గురించి ఎంక్వైరీ చేస్తే మన పాత ఫ్రెండ్స్ నీ అడ్రస్ ఇచ్చారు" అంది సత్య.

"ఆ, నువ్వా ఎవరో కొత్త అమ్మాయను కున్నాను" అంది పద్మజ నివ్వెరపోతూ. ఆ మసక చీకట్లో సత్య మెరిసిపోతుంది. మెడలో, చెవులకి, చేతులకి రాళ్ళ గాజులు తళతళ లాడుతున్నాయి. జరీవర్క్ చేసిన ఫాన్సీ చీర, లేటెస్ట్ ఫ్యాషన్‌లో కుట్టించిన జాకెట్టు, మనిషి చిన్నపిల్లలా కనిపిస్తోంది.

సత్య గర్వంగా నవ్వేసింది.

పద్మజ నీళ్ళు పోయటం కూడా ముగిసిపోవటంతో పంపు కట్టేసి లోపలకు నడిచింది.

సత్యకి మేకప్ పిచ్చి చిన్నప్పట్నుంచీ ఎక్కువే. బాల్యంలోనే లిప్‌స్టిక్, కళ్ళకు ఐలైనర్, బుగ్గలకి రంగు లాంటి ప్రయోగాలు విజయవంతంగా చేస్తూ ఉండేది. మనిషి కాస్త చక్కనిదే. ఆ తర్వాత ఈ మేకప్ తళుకులు కూడా తోడయ్యి చాలా అందంగా కనిపించేది. బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగుపెట్టాక ఆ అలంకరణ పిచ్చి ఇంకా ఎక్కువైంది. ఆమె అభిరుచికి తగ్గట్లే ఒక మోస్తరు ఆఫీసర్ సంబంధం దొరికింది. భర్త ఉద్యోగరీత్యా నార్త్ ఇండియా అంతా తిరిగారు. ఆమెను చూసి చాలా రోజులైంది. ఎట్లా ఉందోనని ఫ్రెండ్‌ని అడిగి క్షేమ సమాచారాలు తెలుసుకుంటూనే ఉన్నా నేరుగా ఇంతవరకూ చూడలేదు.

## కొత్తగాలి... 

**అతి చిన్న బాధే**
**జ్ఞాపకాల దొంతర్లన్నిట్నీ**
**వెతకవలసొచ్చింది**
**దాని మూలాలకోసం**

– ఎ.వి.రెడ్డిశాస్త్రి,
శ్రీకాకుళం

మసక వెలుతురులో ఆమె రూపం మనోహరంగా కనిపించినా, లోపలకు వచ్చి ట్యూబ్‌లైట్ల వెలుగులో చూశాక అంత గొప్పగా లేదు. వయసు తెలుస్తూనే ఉంది.

పద్మజ లోపలకు వెళ్తుంటే సత్య ఆపేసింది. "ఇప్పుడు నా కోసం ఏమీ శ్రమపడకు. ఊరికే నిన్ను చూసి పోదామని వచ్చానంతే. అవునూ. ఏంటి ఇలా ముసలమ్మలా ఉన్నావు. కాస్త శ్రద్ధగా మేకప్ చేసుకుంటే ఎంత బాగుంటావు" అంది.

"ఇప్పుడింక నా మేకప్‌దేం ఉందిలే గానీ అసలు నువ్వేం చేస్తున్నావు? ఇద్దరు అమ్మాయిలు కదూ. వాళ్ళేం చేస్తున్నారు? "

"ఒకమ్మాయి ఇంజనీరింగ్, ఇంకో అమ్మాయి మెడిసిన్ చదువుతున్నారు"

"అట్లాగా. బాగా చదివిస్తున్నావు"

"వాళ్ళు అక్కడే హాస్టల్లో ఉండి చదువుకుంటున్నారు. నేనూ మా ఆయనా వచ్చాము. అంతే"

కాస్సేపు కబుర్లు చెప్పి తన అడ్రస్ ఇచ్చి వెళ్ళిపోయింది సత్య.

మనిషి మారలేదు. ఎప్పటిలాగే తన మేకప్ గురించీ, అందం గురించీ, తనని ఎవరే విధంగా పొగిడిందీ చెప్పి చెప్పి ఊదరగొట్టింది.

తననీ కూతుళ్ళనీ చూస్తే తల్లీ కూతుళ్ళని ఎవరూ అనుకోరుట. అంతా అక్కా

చెల్లెళ్ళని అనుకుంటారుట. కొంతమంది "ఏం చదువుతున్నారు, డిగ్రీనా?" అని అడిగారుట. ఆఖరికి వాళ్ళ ఆయన తనని పొగిడే కబుర్లు కూడా చెప్పింది. అందు లోనే పనిలో పనిగా 'నేను చూడు ఎంత బాగున్నానో కానీ నువ్వు చూడు ఎలా ఉన్నావో' అంటూ విమర్శించేసింది.

"అంతా నన్ను మూవీస్‌లో యాక్ట్ చెయ్యకూడదా అంటున్నారు. కానీ ఎక్కడా?" అంటూ చప్పరించేసింది.

తన యోగక్షేమాల గురించి కానీ, పద్మజ పిల్లల సంగతిగానీ అడగనేలేదు, చెప్పనూ లేదు. ఎంతసేపూ తన లావణ్యం గురించే గంటపైన మాట్లాడి నిష్క్రమించ టానికి లేచింది.

"అవునూ రేపు కోఠీకి రారాదూ. నాకు ఇక్కడ కొత్త. ఎక్కడ ఏమేం దొరుకు తాయో కాస్త చూపించు. షాపింగ్ పని ఉంది" అంది వెళ్తూ.

"వస్తాను. రేపు పదకొండింటికి కోఠీ ఆంధ్రాబ్యాంక్ ముందు నిలబడు. అవునూ ఏం షాపింగ్ చెయ్యాలో చెప్పు. దాన్నిబట్టి ఎక్కడ కొనాలో చెపుతాను" అంది పద్మజ.

"నాకు మాచింగ్ బ్లౌజ్‌లూ, గాజులూ, చెప్పులూ, కాస్మటిక్స్..." పద్మజ సత్య మాటలు పూర్తికాకముందే ఆపేసింది.

"సరే. సరే. అవన్నీ కోఠీలో దొరుకుతా యిలే. అయితే రేపు పొద్దున్న అక్కడ నిల్చో నేను వచ్చి నిన్ను కలిసి అన్నీ చూపిస్తాను" అంది.

ఇన్నేళ్ళయినా సత్య ఏమాత్రం మారక పోవటం పద్మజకి వింతగా అనిపించింది. అసలు అంతదూరం నుంచి ట్రాన్స్‌ఫరై వచ్చినప్పుడు ఇంటికి కావల్సినవి కొనాలని అనుకోవటం సహజం. అదేమీ లేదు. కేవలం దుస్తులూ, అలంకరణ సామాగ్రి కోసమేనని చెప్తోంది. ఇన్నాళ్ళకి కలుసు కున్న స్నేహితురాలితో ఇంకేమీ మాట్లాడ లేదు, తన మేకప్ తన అందచందాల గురించి తప్ప. వయసు యాభై దాటినా ఇంకా ఇట్లాగే ఉండే ఆడవాళ్ళని యిప్పుడే చూస్తోంది పద్మజ.

మర్నాడు అన్న ప్రకారం పదకొండు గంటలకి ఆంధ్రాబ్యాంక్ ముందు నిలబ డింది పద్మజ. ఒక అర్ధగంట వెయిట్ చేశాక సత్య బోలెడు మేకప్‌తో సినీతార లా తయారై ఆటోలో దిగింది. అంతసేపు నిలబెట్టినందుకు ఏమాత్రం పశ్చాత్తాపం లేదు.

"పద పోదాం" అంటూ మామూలుగా ముందుకి నడిచింది.

సత్య తనతోపాటు ఒక బస్తాలాంటి బ్యాగ్ తెచ్చింది. అందులో ఏం ఉన్నాయో పద్మజకి అర్థం కాలేదు. దాన్ని భద్రంగా ఆటోలోంచి దించి, ఇంకా భద్రంగా మోసు కుంటూ బరువుగా అడుగులు వేస్తోంది.

"ముందు మ్యాచింగ్ బ్లౌజ్‌లు కావాలి. రెడీమేడ్ బ్లౌజ్‌లు కూడా కొన్ని కావాలి" అంది.

పద్మజ తల ఊపి రెడీమేడ్ జాకెట్లు అమ్మే షాప్‌వైపు దారితీసింది.

నిన్న మసక చీకటిలో చూసినదానిమీద ఇంట్లోకి వచ్చాక ట్యూబ్‌లైట్ల వెలుతురులో కాస్త నాసిగా కనిపించిన పద్మజ రూపం ఇవాళ పట్టపగలు సూర్యకాంతిలో ఇంకాస్త నాసిగా ఉంది. కళ్ళకింద ముడుతలు, నడుం వెనక ముడతలు, కొద్దిగా జారిన మొహం, ఇవన్నీ మామూలు అలంకర ణలో అయితే కాస్త మరుగున పడేవేమో కానీ రంగులు రుద్ది, కేక్‌లు అద్ది మరికాస్త కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. పద్మజ చేతి గోళ్ళ నుంచీ తల వెంట్రుకదాకా ఎంతో శ్రద్ధ తీసుకుని మేకప్ చేసుకున్నా అదంతా కాస్త వెగటుగానే ఉంది. ఆమె నడుస్తుంటే కూడా అదోమాదిరిగా ఉంది. వయసుతో పాటు వచ్చే మార్పులతో మారిన నడక

ఆమె ఒయ్యారంగా నడవటానికి ప్రయత్నించటంతో మరీ అదోలా ఉంది.

మ్యాచింగ్ సెంటర్‌లోకి అడుగుపెట్టారు. రకరకాల బ్లౌజ్‌లు ఉన్నాయి అక్కడ. వాటిని చూడగానే సత్య మొహం వికసించింది.

"ఇదుగో ఇవే నేను అనుకున్న రకం" అంటూ కొన్ని జాకెట్లు చూపించింది.

అద్దాలు, తళుకు బిళ్ళలు కుట్టి రకరకాలుగా కత్తిరించిన జాకెట్లున్నాయి.

పద్మజ, సత్య వాళ్ళు చూపించిన చిన్న చిన్న స్టూల్ మీద కూర్చున్నారు.

పద్మజ ఆ జాకెట్టు వైపు చూస్తోంది. ఇంతలో సత్య తను తెచ్చిన బ్యాగ్‌లోంచి చీరెలు బయటికి తీసింది.

"ఇవన్నీ చాలా పాతవి. అయినా చాలా చాలా ఖరీదైనవి. ఇందులో కొన్ని కొత్తవి కూడా ఉన్నాయి. పాతవాటికి జాకెట్లు చిరిగిపోయాయి. వాటికి లేటెస్ట్ డిజైన్‌తో మ్యాచింగ్ బ్లౌజ్ కనక తీస్తే అదిరిపోతాయి. ఇప్పుడు పాత మోడల్ చీరలే మళ్ళీ వస్తున్నాయి. వాటికి కొత్త డిజైన్ చోళీ వేసుకోవాలి. దానికి తగ్గ గాజులు కొనాలి. దీనికి బార్డర్ కొనాలి. దానికి బుటాలు కుట్టడమో కుట్టించటమో చేయాలి" అంటూ వాటి గురించి చెప్పింది.

"ఇది నా ఎంగేజ్‌మెంట్ చీరె. ఇది నా పెళ్లి రిసెప్షన్‌కి కట్టుకున్నది. ఇది మా పెద్దపాప పుట్టినప్పుడు మా అమ్మా వాళ్ళ చీరె... ఇది మావారి..." అంటూ చీరెల గురించి చెప్పింది.

ఏమటాకామాటే చెప్పాలి. సత్య ఆ చీరెల్ని బ్రహ్మాండంగా మెయిన్‌టైన్ చేసింది. ఇన్నేళ్ళయినా అవి కొత్తగానే ఉన్నాయి. ఎప్పటికప్పుడు కొత్త చీరెలు కొంటూనే ఉండటం చేత స్టాక్ పెరిగి వాటిమీద వాడకపు భారం తగ్గినట్లుంది. మంచి మెరుపుతో తళుక్కుమంటున్నాయి.

**కొత్తగాలి...**

**యుద్ధంలో భయపడి పారిపోయి**
**బోర్లా పడేవాడు 'భీరువు'**
**జీవితంలో భయపడి పారిపోయి**
**బార్‌లో పడేవాడు 'బీరువు'**

– ఎం.హన్మంత్రావు, హైదరాబాద్

"అంత పాతవా? చాలా బాగున్నాయి. ఈ మధ్యే కొన్నట్లున్నాయి" అంది పద్మజ.

"అందుకే కదా పారెయ్యలేక తీసుకొచ్చాను. ఇదుగో దీనికి ఈ బ్లౌజ్ బాగుంటుంది. అబ్బా. ఎంత బాగుందో" దాదాపు అరుస్తున్నట్లు చెప్పింది సత్య.

పద్మజ ఆ బ్లౌజ్ వైపు చూసింది. చెమ్కీలూ అద్దాలు బ్లౌజు నిండా కుట్టి ఉన్నాయి. అవి చాలనట్లు అక్కడక్కడా పూసలు కూడా అతికించారు. వీపంతా ఓపెన్‌గా ఉంటుంది. అది నాజూగ్గా ఉన్న యువతులకి బాగుంటుదేమో కానీ సత్యలా యాభై ఏళ్ళ వయసూ, కండలు జారిన వీపూ ఉన్నవాళ్ళకి ఏమాత్రం బాగుండదు.

"ఏం బాగా లేదా?" సత్య గద్దించింది.

"కాస్త సన్నగా ఉంటే... బాగుంటుందేమో..." పద్మజ మాటలు పూర్తి కానే లేదు. సత్య విరుచుకుపడింది.

"ఇదుగో. ఇట్లాగే అనుకుంటూ పోతే మనకి నచ్చిన బట్టలు ఎప్పటికీ వేసుకోలేం. నేను ఇన్ని ఊళ్ళు తిరిగాను. ఇంత పొట్ట పెట్టుకుని వెనక కండలు పెంచుకున్న ఆడవాళ్ళు కూడా, టైట్‌గా ఉన్న జీన్ ప్యాంట్ టీషర్ట్ వేసుకుని, చకచకా నడిచి పోతుంటారు. అనవసరపు సంకోచాలు పెట్టుకుని మనం ఆఖరికి నచ్చిన జాకెట్టు కూడా వేసుకోలేం. ఇట్లాగే అనుకుంటూ అన్నీ మానేసుకుంటుంటే ఎప్పటికి మన ఆడవాళ్ళు ముందుకి పోయేట్లు?" అంది.

ఆడవాళ్ళ అభ్యుదయం అంతా ఎంత నప్ప కపోయినా కూడా తమకు నచ్చిన బట్టలు వేసుకు తీరటం మీదే ఆధారపడినట్టు. పద్మజ ఇంకేం మాట్లాడలేదు. అసలు మాట్లాడనివ్వకుండా సత్య అంతా తనే మాట్లాడుతోంది. ఆమెకి ఆ చీరెలూ, జాకెట్లూ అన్నీ తెగ నచ్చేశాయి. వాటిని చూసిన ఉత్సాహంలో మరేం తెలియటం లేదు. ఒక్కో చీరెకీ ఒక్కోరకం జాకెట్టు తీసుకుంది. కొన్ని చీరెలకి మాచింగ్ బ్లౌజ్ దొరకలేదు.

"ఇట్లా కుట్టించుకోండి. బట్ట తీసుకుని కుట్టించుకోవచ్చు. ఆ తానులో ఉన్న బట్ట దీనికి సరిగ్గా సరిపోతుంది. ఇందులో ఈ పీస్ ఆ చీరెకి సరిపోతుంది" షాప్ అతను తనకు తోచిన సలహాలు ఇచ్చాడు.

"అది కాదు. చుక్కలు ఉండి పైన గీతలు గీసినట్లు జరీ వచ్చి..." సత్య తనకు కావల్సిన బ్లౌజ్‌ని వర్ణించింది.

"అవా...? " సేల్స్ మాన్ నిరుత్సాహప డ్డాడు?

"ఇక్కడ లేవు. తెప్పిస్తాం కూర్చోండి"

"ఎక్కడ్నుంచి తెప్పిస్తారు? "

"మాదే పక్కన మరో షాప్ ఉంది"

"అలాగే తెప్పించండి" సత్య తీరిగ్గా కూర్చుంది.

అప్పటికే ఒక్కో జాకెట్టునీ పరీక్షగా చూస్తూ మ్యాచ్ అవుతుందో లేదో పరీ క్షిస్తూ బోలెడు టైమ్ గడిచిపోయింది. ఇంకా ఎంతసేపు పడుతుందోనని పద్మజకి భయం వేసింది.

సత్య మాత్రం సంతోషంగా వెయిట్ చేస్తోంది. వాళ్ళు ఆ జాకెట్లు తొందరగానే తెచ్చారు.

సత్య వాటిని పరీక్షించి పెదవి విరి చింది.

"ఇది కాదు" అంది.

"ఇవేగా. చుక్కలూ, జరీ గీతలూ..." సేల్స్‌మాన్ బాధపడ్డాడు.

"ఇవి కాదు. ఈ బట్ట చూడండి. ఎంత ముతకగా ఉందో. నేను చూసిన వెరైటీలో బట్ట చాలా మెత్తగా ఉంటుంది" అంది సత్య.

"అంతా ఇవే తీసుకుంటారు"

"నాకు మాత్రం వద్దు"

షాపు అతను చేసేది లేక సరేనని తల ఊపాడు.

"బిల్లు ఇవ్వండి" కార్డు అందిస్తూ చెప్పింది సత్య.

అతను కార్డు తీసుకువెళ్లి బిల్లు తీసుకుని వచ్చాడు. బిల్లుమీద సంతకం పెట్టి ఇచ్చింది సత్య.

అక్షరాలా ఐదువేలు.

పదహారు వందల ఖరీదు చేసే రకం జాకెట్లు మూడు, ఒక జాకెట్ బట్ట.

పదహారు వందల రూపాయల ఖరీదు గల జాకెట్లు ఉంటాయని కూడా అంతవ రకూ పద్మజకి తెలీదు. ఒక్కో జాకెట్టు పదహారు వందలా? ఇంకా అపన మ్మకంగానే ఉంది. బయటకు వచ్చారు.

"ఇంతంత ఖరీదు పెట్టి జాకెట్లు కొంటు న్నానని ఒకసారి మా పక్కింటావిడ బాధ పడింది. మనం కొంటేనే కదా వాళ్లకి సరుకు అమ్ముడుపోయేది. జాకెట్లు కుట్టే వాళ్లు, డిజైన్ కుట్టేవాళ్లు ఎంతమంది బతు కుతారు. మనం ఖర్చు పెడితేనే కదా డబ్బు చెలామణీ అయి మార్కెట్ నడి చేది" అంది సత్య.

"అవును. నిజం" ఒప్పుకుంది పద్మజ.

ఇంకొన్ని షాపులు తిప్పించింది సత్య. చివరికి ఆమెకి నచ్చిన జాకెట్లు దొరికాయి. దొరికిందాకా ఏ మాత్రం విసుగు చెంద లేదు. దీక్షగా పట్టుదలతో తిరిగింది.

"చూశావా? అంతా దొరకవు, దొరకవు అన్నారు. దొరికాయా లేదా? గట్టి ప్రయత్నం చెయ్యాలి. కాస్త ప్రయత్నిం

నిన్నటి నిజం

## మహోదాత

విద్వాంసులైన మైసూరు సదాశివరాయలు సదాచార సంపన్నులు. ఆయన స్వస్థలం ఉత్తర ఆర్కాట్‌లోని చిత్తూరు. ప్రాతఃకాలం నుంచి మధ్యాహ్నం వేళ వరకు ఆయన వీధి తలుపు దగ్గర నడుముకు తుండు బిగించి నిలబడేవారు. ఆ మార్గంలో వెళ్లే బ్రాహ్మణులను చేతులు జోడించి భోజనానికి ఆహ్వానించేవారు. అతిథులు చేరితేగానీ తృప్తి కలిగేది కాదు. వచ్చినవారందరికీ రసకవళం, భూరి దక్షిణ, నెయ్యి వడ్డించేటందుకు స్వయంగా రాయలే నిలబడేవారు. ఆయన గొప్ప త్యాగి. దేహి అన్నవారికి నాస్తి అన్నదే లేదు.



ఓసారి రామస్వామిశెట్టి అనే పెద్ద వస్త్రవ్యాపారి వేరే ఊరికి పోవలసి వచ్చింది. రాయలంటే అతడికి అత్యంత ప్రీతి, నమ్మిక. తను తిరిగి వచ్చేదాక అంగడి చూసుకోవాల్సిందిగా రాయలను ప్రార్థించాడు. జనాలకు ఇదొక సదవకాశమైంది. పెళ్లి, వడుగు పేర్లు చెప్పి రాయల సహాయం అర్థించారు. అంగడిలోని సరకును రాయలు వెనుకా ముందూ చూడక దానం చేశారు! రామస్వామిశెట్టి తిరిగి వచ్చేసరికి అంగడి ఖాళీ. రాయలు సావధానంగా అన్నారు, 'అయ్యా శెట్టి, నీ అంగడిలో వస్త్రాల్ని పూర్తిగా పేదలకు నేను దానం చేశాను. ఆ పుణ్యమంతా నీకే చెందాల్సి ఉంది. ఈ విషయంలో నీకు అసమ్మతి ఉంటే సరకుల ధర పూర్తిగా నేను చెల్లిస్తాను. దాని పుణ్యఫలం నాకు మిగలని'. షావుకారు మాట్లాడలేకపోయాడు. 'కృష్ణార్పణం' అన్నాడు. తరువాత కొన్ని నెలల్లోనే మళ్లీ అతని వ్యాపారం బాగా వృద్ధి అయింది.

చటం, ఇక దొరకదులే అని రాజీ పడిపోవటం నాకు నచ్చదు. ఏ మాత్రం కాంప్రమైజ్ కాను. నాకు నచ్చింది దొరికేదాకా తిరుగుతాను. దొరుకుతుంది. అంతా ఆశ్చ

ఇస్తే ఆ షాప్‌లో సేల్స్‌గర్ల్ ఆమె అన్నీ ఒక సెట్టుగా చేసి పెడుతోంది. రాళ్లగాజులు, తళుకు గాజులూ, పూసల గాజులూ గాజు గాజులతో కలిపి ఒక్క చీరెకీ అద్భు

## కొత్తగాలి...

**అబ్బాయి ఒక సాఫ్ట్‌వేర్**
**అమ్మాయి ఒక ఎన్ఆర్ఐ**
**అమ్మగారు ఔట్‌సోర్సింగ్**
**అయ్యగారు అందరికీ హార్డ్‌వేర్**

– వి.రాఘవేంద్రరావు, హైదరాబాద్

"ఇట్లా అంతా సెట్‌గా ఉంటేనే బాగుంటుంది. లేకపోతే షో రాదు. ఈ కాలంలో ప్రతిచోటా షో పుటప్ చెయ్యాలి. లేకపోతే ఎవరూ కేర్ చెయ్యరు. ముఖ్యంగా వయసులో ఉన్నప్పుడు ఏదో ఒకటి వేసుకుని తిరిగినా బాగానే ఉంటారు. కానీ కాస్త ఏజ్ వచ్చాక చక్కగా తయారవుతేనే గానీ చూడ్డానికి బాగుండరు. నువ్వు కూడా కనుబొమలు షేప్ చేయించుకుని కనీసం జుట్టుని పోనీటైల్ లాగా కట్టు. నీ చీరెలన్నీ నాకోసారి చూపించు. వాటిని ఎట్లా మార్చి కట్టుకోవాలో చూపిస్తాను. ఈ అద్దాల జాకెట్లు రెండు నువ్వు కూడా తీసుకోరాదూ. ఆ రంగురంగుల జాకెట్ తీసుకో. దేనికైనా మ్యాచ్ అవుతుంది" సలహా ఇచ్చింది సత్య.

"వద్దు. తర్వాత చూస్తాలే. ముందు నీ షాపింగ్ కానీ" అంది పద్మజ.

"నీకు ఎక్కడేవి దొరుకుతాయో తెలుసు కానీ ఎన్నడూ షాపింగ్ చేసినట్లు లేవు" అంది సత్య.

"నిజమే కానీ ఎట్లా కనిపెట్టావు? "

"ధరలు విని గుడ్లు తేలేస్తున్నావు కదా. నీకు ఇవి కొనటం అలవాటు లేదని అర్థమైపోయింది"

"ఓహో.. ఏం పరిశీలన? "

"అంతే. అంతా నా తెలివి చూసి చాలా మెచ్చుకుంటారు తెలుసా?

ఇప్పటికైనా ఏదన్నా కంప్యూటర్ కోర్స్ చేస్తే ఏ కార్పొరేట్ ఆఫీస్‌లోనో ఎగ్జిక్యూటివ్ పోస్ట్ ఈజీగా వస్తుందని అంతా ఒకటే ఇదిగా చెపుతారు. చెయ్యొచ్చు. కానీ అంత అవసరమా అని చూస్తున్నాను. నా స్మార్ట్‌నెస్, అందం, స్టైల్ అన్నీ కార్పొరేట్ లెవెల్‌లోనే ఉంటాయిట" సత్య మళ్లీ చెప్పింది.

"మరి ట్రై చెయ్యాల్సింది. ఇప్పుడు నీకు పిల్లల పని కూడా లేదుగా. తీరిగ్గా ఏ కోర్స్ అయినా చదువుకునే వీలు ఉంది" అంది పద్మజ.

"మనకెందుకు చెప్పు. అయినా అందరూ ఉద్యోగాల కోసం ఎగబడితే లోకంలో నిరుద్యోగులు పెరిగిపోతారు. నాకు వారిసంఖ్యని పెంచటం ఇష్టంలేదు" సత్య చెప్పింది.

సాయంత్రం దాకా తిరిగినా సత్యకి కావాల్సిన మ్యాచింగ్ బట్టలు కొన్ని దొరకనే లేదు. ఆమెకి కావాల్సిన బ్రాండ్ కాస్మటిక్స్ కొన్ని దొరకలేదు. ఒక వారం పోయాక వస్తే ఉంటాయన్నారు.

"సగం షాపింగ్ కూడా కాలేదు" సత్య నిట్టూర్చింది.

ఇంతింత టైమ్‌ని జనాలు ఆ షాపుల్లో ఎట్లా ఖర్చు పెట్టగలుగుతున్నారో పద్మజకి అర్థం కాలేదు. ఏదయినా కూడా ఆసక్తి మీద ఆధారపడి ఉంటుంది కాబోలు.

"అన్నట్లు చెప్పటం మర్చిపోయాను. మా పెద్దమ్మాయి పెళ్లి కుదిరింది. మరో పది రోజుల్లో ఎంగేజ్‌మెంట్ ఉంది. రావాలి" అంది సత్య.

"అట్లాగా. మరి చెప్పలేదేం? కంగ్రాచ్యులేషన్స్. బట్టలు తీసుకున్నావా? " అడిగింది పద్మజ.

"ఆ.. ఇక్కడ మాకేం తెలీదు కదా. అక్కడే మాకు తెలిసిన గొప్ప టైలర్ ఉన్నాడు. ఊళ్లో గొప్ప వాళ్లంతా అతని దగ్గరే కుట్టిస్తారు. నేను ఒక పట్టుచీరె తీసుకున్నాను. మా పాపకి పట్టుచీరె మీద

జరీ వర్క్ బోలెడు చేసి, కుందన్స్ కుట్టిన చీరె తీసుకున్నాం. మ్యాచింగ్ బ్లౌజ్ కూడా వాటిల్లోనే ఉంది. పాప వాటిని టైలర్‌కి ఇచ్చేసింది."

"ఆది జాకెట్లు?"

"అక్కర్లేదు. మన మెజర్‌మెంట్సన్నీ అతని రిజిస్టర్లో ఉంటాయి. మనక్కావల్సిన మోడల్ చూపించి, బట్ట ఇస్తే చాలు. కుట్టేస్తాడు" అంది సత్య.

"బాగుంది."

అప్పటికి రాత్రి అవబోతోంది.

"ఇంక వెళ్తాను. మళ్లీ కలుద్దాం" అంది పద్మజ. సత్య నిరుత్సాహంగా చూసింది.

"సరే. మళ్లీ ఫోన్ చేస్తాను. వారం రోజులైనాక ఆ మోడల్స్ వస్తాయన్నారు. మరి వారం రోజులయ్యాక వస్తావా?" అడిగింది సత్య.

ఆమె షాపింగ్ తీరు పద్మజకి అర్థమైపోయింది. సత్యది అంతులేని దాహం. ఎంత కొన్నా తృప్తి లేదు. దానికి తోడు డబ్బు కొరత కూడా లేదులా ఉంది. ఎన్నిసార్లు వచ్చినా ఆ షాపింగ్ అయిపోదు. అంతు లేని కథలా సాగిపోతుంది. సత్య ఎంగేజిమెంట్‌కి రమ్మని మరీ మరీ పిల్చింది.

పద్మజా, హరనాథ్ వెళ్లారు.

తల్లి ఇంత అలంకరణ పిచ్చి ఉంటే పిల్లలకి ఇంకెంతో ఉంటుందోననుకుంది పద్మజ. కానీ సత్య కూతుళ్లు ఇద్దరూ సింపుల్‌గా ఉన్నారు. చిన్నపిల్ల అయితే జీన్స్ వేసుకుని, టీషర్ట్ వేసుకుంది. మొహాన ఏ అలంకరణా లేదు. అయినా చాలా బాగుంది. పెద్దకూతురు కూడా అందమైనదే. ఆ అమ్మాయి కూడా మామూలుగా ఉన్న ఒక పట్టుచీరె కట్టుకుంది.

"ఇదేంటి? ఇంత మామూలు చీరె కట్టుకుంది?" వచ్చిన బంధువులు చెవులు కొరుక్కున్నారు.

వాళ్లు ఆరా తీసి కనుక్కున్న సత్యాన్ని

## కొత్తగాలి...

**రెప్ప చూరు నుంచి**
**ఊగూగి పడింది**
**కన్నీటి చినుకు**

**– ఆచార్య కొలకలూరి ఇనాక్,**
**హైదరాబాద్**

అందరికీ చెప్పి పగలపడి నవ్వుకున్నారు. పద్మజ చెవిలో కూడా ఆ మాటలూ, నవ్వులూ పడ్డాయి.

అసలు జరిగిందేమిటంటే సత్య ఒక మామూలు పట్టుచీరె కొనుక్కుంది. కూతురికి ఎంగేజ్‌మెంట్ సందర్భంలో కట్టుకోవటానికి ముప్పయి వేలకి ఒక గొప్ప చీరె, దానికి సరిపోయే జాకెట్టు ఉన్నది తీసుకుంది, ఇద్దరి కొలతలూ ఆ ఘనమైన టైలర్ దగ్గరున్నాయి. సత్య కూతురు తనదీ, తల్లిదీ జాకెటు బట్టలు టైలర్‌కిచ్చి ఏ మోడల్‌లో కుట్టాలో కూడా చెప్పింది. తల్లికి కాస్త మామూలుగా ఉన్న డిజైన్ చెప్పి, తనకి లేటెస్ట్ డిజైన్‌లో వెనక వీపంతా కట్ చేసి, అతుకులు కుట్టిన టైప్‌లో కుట్టమని నొక్కి వక్కాణించింది. అయినా ఆ టైలర్ మర్చిపోయాడు. ఆ మహాశయుడికి సత్యకి రకరకాల వీపు కటింగ్‌లూ, అనేక రకాల అద్భుతమైన డిజైన్ల జాకెట్లూ కుట్టి ఉన్న అపార అనుభవం ఉందిట. తల్లికి రకరకాల ఫ్యాషన్లలో కుట్టి, పిల్లలకి అతి సింపుల్‌గా కుట్టటం అతనికి అలవాటైపోయింది. కాబట్టి ఆ అలవాటైన చెయ్యి పెళ్లికూతురు కని తీసుకున్న ముప్పయి వేల రూపాయల చీరె జాకెట్టుని సత్యకి ఫ్యాషన్‌గా రకరకాల కటింగ్‌లు పెట్టి కుట్టేసాడు. పెళ్లికూతురికి మామూలుగా కుట్టాడు.

అంతా నవ్వుకున్నారు. చివరికి రెడీమేడ్

జాకెట్‌తో ఆ పట్టుచీరె కట్టుకుంది పెళ్ళికూతురు.

★ ★ ★

ఆ తర్వాత కూడా సత్య మారలేదు.

షాపింగ్‌కి రకరకాల చోట్లకి తిప్పి పెళ్లి కూతురితో సమంగా తనకూ చీరెలూ, గాజులూ అన్నీ కొని పెట్టుకుంది. పెళ్లి నాడు తను కట్టుకునే చీరె గురించీ, పెట్టుకునే నగల గురించీ, చేయించుకోబోయే శిరోజాలంకరణ గురించీ చెప్పీ చెప్పీ ఊదరగొట్టింది.

"అవునూ. నువ్వు ఏ పట్టుచీరె కట్టుకుని వస్తున్నావు? ఏ బ్యూటీ పార్లర్‌కి వెళ్లి మేకప్ చేయించుకుంటావు? పెళ్లి రోజున ఘనంగా కనపడాలి సుమా. అవునూ. మీకు కారు లేదు కదూ? కారు అద్దెకు తీసుకుని, కార్లోనే రా. మరీ ఆటోలో వచ్చావంటే బాగుండదు. వీడియో తీస్తారు కదా. వస్తున్న అతిథులందర్నీ కూడా కార్లోంచి దిగుతున్నప్పటి నుంచీ వీడియో తీస్తారు. నువ్వు పిచ్చి చీరెలు కట్టుకుని, ఏ[బాసి మేకప్‌లో వస్తే ఎట్లా? మాకు జీవితాంతం ఉండే వీడియోలు కదా" అంది సత్య.

"నాకు పట్టుచీరెలు లేవు, బ్యూటీపార్లర్‌కి వెళ్లి మేకప్ చేయించుకుని అద్దె కార్లో పెళ్లికి వచ్చే స్థోమత కూడా లేదు" అంది పద్మజ.

సత్య పద్మజని అప్పటికే బేరీజు వేసినట్లు ఉంది. సత్య పెళ్లికి పిలిస్తే తనకున్న చీరెలో ఏదో ఒకటి కట్టుకుని, ఎప్పుడూ ఉన్నట్లే పెళ్లికి వెళ్లాలనుకుంది. కానీ సత్యకి గొప్పల పట్ల ఉన్న మోజు వల్ల పద్మజ మామూలు వేషధారణలో వచ్చి తన లెవెల్ తగ్గిస్తుందేమోనని భయం కలిగినట్లుంది. అసలు పద్మజని పెళ్లికే పిలవలేదు.

"రక్షించింది" అనుకుంది పద్మజ.

వెళ్లి ఉంటే సత్యకీ సంతృప్తి ఉండేది కాదు. గొప్పలు తప్ప స్నేహం అక్కర్లేని స్నేహితురాల్ని చూసి తనకూ మనశ్శాంతి ఉండేది కాదు.

ఇద్దరికీ ఇప్పుడు సమస్య లేకుండా పోయింది.




శ్రీరామ్మూర్తి సన్యసించటం చూశాక చాలామందిలో దైవచింతన, ఆధ్యాత్మిక విషయాల పట్ల ఆసక్తి ఎక్కువయ్యాయి. పక్కింటావిడ, ఎదురింటావిడలతో కలిసి, పద్మజ కూడా గుళ్లో పురాణం వినటానికి వెళ్తోంది.

"దీపారాధన స్వామి ఊళ్లోకి వచ్చారుట. మన గుడికి కూడా ఆయన్ని ఆహ్వానిస్తే బాగుంటుంది" అన్నారు కొందరు.

"ఆయనదంతా ఖరీదైన వ్యవహారం. మనలాంటి వాళ్లు పిలిస్తే వస్తాడా?" కొందరు సందేహం వెలిబుచ్చారు. ప్రయత్నించి చూద్దామన్నారు కొందరు.

దీపారాధన స్వామిగారి అసలు పేరేంటో ఎవరికీ తెలియదు. ఆయన పొద్దున్నా, సాయంత్రం ఇంట్లో దీపారాధన తప్పకుండా చెయ్యాలంటారు. ఏ కార్యక్రమం అయినా దీపం వెలిగించిగానీ మొదలు పెట్టరు. మనసులో కూడా దీపం వెలిగించుకుని, జీవితం కాంతిమంతం చేసుకోవాలంటారు. దీపదానం చేస్తే ఆ వెలుగు మనం చచ్చాక కూడా వెంట

## కొత్తగాలి...

**పుస్తకమైనా**
**మస్తకమైనా**
**చెద పట్టక తప్పదు**
**లోకం చదవకపోతే..**

– అద్దేపల్లి భరత్‌కుమార్,
చిలకలూరిపేట

వస్తుందంటారు. ఏం చెప్పినా, ఏం చేసినా దాంట్లో దీపంతో ఏదో ఒక సంబంధం ఉండక మానదు. అందుకే ఆయనకు దీపారాధన స్వామి అని పేరు వచ్చింది.

పద్మజా, ఇంకో నలుగురూ కలిపి ఆయన బస చేసిన చోటుకి వెళ్లారు. అక్కడి కార్లూ, మనుష్యుల్లో కొట్టొచ్చినట్లు కనిపిస్తున్న ఐశ్వర్యం అన్నీ చూశాక స్వామి తమ గుడికి ఆహ్వానిస్తే వస్తారా అని వాళ్లకు కూడా సందేహం కలిగింది. గంటకు లక్ష రూపాయలు కూడా చెల్లించే వ్యక్తులు అక్కడ ఉన్నారు.

ఎట్లాగో వాళ్లకు స్వామి అపాయింట్‌మెంట్ మాత్రం దొరికింది.

"సరే. దర్శనం చేసుకున్నట్లన్నా ఉంటుంది" అనుకున్నారు.

లోపలకు వెళ్లారు.

ఆయన నవ్వుతూ ఆహ్వానించాడు. వయసు కూడా ఎక్కువేం ఉండదు. చిన్నతనంలోనే విరక్తి కలిగి, ఆధ్యాత్మిక మార్గం పట్టాడుట.

అంతా ఆయనకి నమస్కరించారు. ఆయన ఒక వెండి సింహాసనంలో కూర్చున్నాడు. ఆయన ఎదుట కుర్చీలున్నాయి. వాటిమీద కూర్చో వచ్చో లేదో తెలీక అంతా తికమకపడుతున్నారు.

"రండి కూర్చోండి. కుర్చీల్లో అయితే ఎవరికన్నా సౌకర్యంగా ఉంటుంది. అందుకనే కుర్చీలు వేయించాను" అన్నాడాయన. అంతా కూర్చున్నారు.

"చెప్పండి" అన్నాడాయన చిరునవ్వుతో.

"స్వామీ. మీరు మా కాలనీలో గుడికి రావాలి" అంతా ఆహ్వానించారు.

ఆయన ఒక శిష్యుడిని పిలిచాడు. "మనకి వీలు ఉందా చూడు" అన్నాడు. ఆ శిష్యుడు అసలు ఆలోచించను కూడా లేదు.

"లేదు స్వామీ. షెడ్యూల్ అంతా ఖరారైపోయింది" అన్నాడు భక్తిగా తలవంచి.

ఆయన చిరునవ్వుతో తల ఊపాడు.

ఆ శిష్యుడు వెళ్లిపోయాడు.

"సమయం కుదిరేట్లు లేదమ్మా" అన్నాడాయన. అంతా నిరాశగా చూశారు.

"అయ్యో! ఎన్నో అడగాలనుకున్నాం" అంది ఒకామె. ఆయన చిరునవ్వు నవ్వాడు.

"మీకు ఇప్పుడు పది నిమిషాలు కేటాయిస్తాను. ఏమేం అడగాలనుకున్నారో అడగండి. సూక్ష్మంగా బోధించటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు.

"మేము ఏమీ సాధించటం లేదు. మామూలుగా బతికేస్తున్నాం" ఒకావిడ గోడుగా చెప్పింది.

"ఏమి సాధించాలని అనుకుంటున్నారు? " ఆయన అట్లాగే చిరునవ్వుతో అడిగాడు.

"అంటే... ఆధ్యాత్మికంగా ఏదీ సాధించలేదని మా బాధ."

"ఆధ్యాత్మికంగా సాధించాలని అంటే అంత తేలిగ్గా కుదరదు. మనం అనుకోవటం కాదు. ఆ పరమాత్మ కూడా మన గురించి అనుకోవాలి. అప్పుడే మనం కటాక్షించబడతాం. అయినా మీరు ఏదో తపస్సు చేసేయాలనో, పూజలు చేసేయాలనో, యజ్ఞం చెయ్యాలనో లేదు. మనస్సు లగ్నం చేసి ఒక్కక్షణం ఆ పరమాత్ముడిని తల్చుకున్నా చాలు. ఈ కలియుగంలో మనకి అదో వరం. అందుకే ఎక్కడెక్కడి

మునులూ కలియుగంలో పుట్టాలని అనుకునే వాళ్లుట. మీకో కథ చెపుతాను వినండి." స్వామీజీ కంఠం చాలా మధురంగా ఉంది. ఆయన చూపులు చాలా ఆప్యాయంగా ఉన్నాయి. ఆయన మాట్లాడుతుంటే అట్లాగే వినాలనిపిస్తోంది.

ఆయన కథ మొదలుపెట్టాడు.

"ఒకనాడు నారదుడికి ఒక సందేహం కలిగింది. కలియుగంలో ఒక మనిషిని చూపించి శ్రీమహావిష్ణువు, 'అతడు తనకి చాలా ప్రియుడు. తనంటే అతనికి చాలా భక్తి' అనీ చెప్పాడు. నారదుడు వెళ్లి అతడ్ని పరిశీలించాడు. అతను చేస్తున్నదేమీ నారదుడికి ప్రత్యేకంగా కనిపించలేదు. అతను ఎంతసేపూ తన పనుల్లో తానున్నాడు. మధ్య మధ్య నారాయణ నారాయణ అంటున్నాడు, అది కూడా రోజు మొత్తంలో నాలుగైదు సార్లు. తను నిత్యం నారాయణ నామస్మరణ చేస్తుంటే, తనని కాదని ఆ గృహస్తుని తన కన్నా గొప్పగా పొగడటం నారదుడికి కోపం కలిగించింది. వెంటనే విష్ణుమూర్తికి తన సందేహం చెప్పేశాడు. శ్రీమహావిష్ణువు చిరునవ్వు నవ్వి నీ సందేహం తీరుస్తానన్నాడు. నారదుడి నెత్తిన ఒక కుండలో నిండా నూనె నింపాడు.

'నారదా.. ఈ కుండలోంచి ఒక్క చుక్క కూడా నూనె ఒలికి పోకూడదు. ఇది మాత్రం గుర్తుంచుకో. ఒక్క చుక్క కూడా కుండలోంచి నూనె ఒలకరాదు. నువ్వు వెళ్లు. భూలోకంలో సంచరించు. ఇప్పుడు పొద్దున్న కావస్తున్నది. సాయంత్రం వేళకు మళ్లా కనబడు. నూనె మాత్రం ఒలికి పోకూడదు సుమా' అని హెచ్చరించాడు. అలాగేనని నారదుడు అక్కడ్నుంచి కదిలాడు. నూనె ఒక్క చుక్క కూడా ఒలకకుండా జాగ్రత్త పడుతూ ఆ సాయంత్రం దాకా భూలోకంలో సంచరించాడు. సాయంత్రం కాగానే నెత్తిన నూనె కుండతో భద్రంగా విష్ణుమూర్తి సన్నిధికి చేరాడు. మహావిష్ణువు అతణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు. నూనె ఒక్క చుక్క కూడా ఒలికి పోలేదని నారదుడు చెప్పాడు. 'సరే గానీ నారదా. ఇవాళ నువ్వు ఎన్నిసార్లు నన్ను స్మరించుకున్నావు? ' అడిగాడు విష్ణువు.

నారదుడు తెల్లబోయాడు. 'ఎక్కడ స్వామీ. మీరు చెప్పినట్లుగా నూనె ఏ మాత్రం ఒలకకుండా చూసుకోవడానికే నాకు సమయం చాలలేదు. ఇంక నామస్మరణ ఎక్కడ? ' అన్నాడు.

విష్ణుమూర్తి చిరునవ్వు నవ్వాడు. 'అదే నారదా. ఆ గృహస్థు ఇంతకన్నా ఎక్కువ బాధ్యతలు, కష్టాల్లో ఉన్నాడు. కలియుగ మానవుడు నిత్యం అనేక కష్టాల్లో, చిరాకుల్లో ఉంటాడు. అట్లాంటి స్థితిలో కూడా వీలైనప్పుడల్లా నన్ను స్మరించుకుంటాడు. అందుకే నాకు వాళ్ళంటే ఇష్టం. సరేనా' అన్నాడు. నారదుడికి అర్థమై సమాధానపడ్డాడు" అన్నాడు స్వామీజీ కథ ముగిస్తూ.

అంతా భక్తిగా వింటున్నారు.

"అందుచేత నేను చెప్పేదేమిటంటే మీరంతా ఎవరి కష్టాల్లో, బాధ్యతల్లో వాళ్ళుంటారు. అయినా ముక్తిమార్గం కావాలని తాపత్రయపడుతూ ఇంత దూరం వచ్చారు. మీమీ లెవెల్‌లో మీకు వీలైనంత దూరం భగవన్నామ స్మరణ చేసుకున్నా చాలు" అన్నాడాయన.

అంతా తృప్తిగా తల ఊపారు.

నిజమే. ఎవరికి వాళ్ళు సంసార సాగరంలో తలమునకలవుతుంటారు. గొప్ప గొప్ప వాళ్లైతే జీవితమంతా ఎట్లా గడిపినా చివర్లో వాళ్ళకున్న డబ్బుతో దానధర్మాలు చేసి పుణ్యం గడించుకుంటారేమో. కానీ మామూలు మనుషులకి అవన్నీ కుదరవు. స్వామీజీ చెప్పిన భగవన్నామ స్మరణ

చాలా తేలిక మార్గంగా కనిపించింది.

అంతా ఆయనకి నమస్కరించి సెలవు తీసుకున్నారు. ఆయన వాళ్ళకి దాదాపు పది నిమిషాలు కేటాయించాడు. అది చాలా గొప్ప విషయం.

"ఆయన పాలసీనే అది. అందరికీ మోక్షం లభించాలి. అందరికీ బోధ లభించాలి" అన్నాడు శిష్యుడు. ఆ తర్వాత ఒక సారి ఆయన వాళ్ళ కాలనీలో గుడికి వచ్చి మళ్ళీ బోధ చేశాడు. దీపారాధన ప్రాశస్త్యం గురించి చెప్పాడు. ఆయనకి పాదాభిషేకం చేసి పాతికవేల రూపాయల్ని సమర్పించారు.

సృష్టిలో ఉన్న ప్రతీదీ పుడుతుంది, పెరుగుతుంది, నశిస్తుందని శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు చెప్పారు.

తత్వవేత్తలు, శాస్త్రవేత్తలు, మునులు, దైవజ్ఞులు అందరూ చెప్పింది ఒకటే. పుట్టిన ప్రతీ జీవీ గిట్టక తప్పదు.

కాలనీలో దాదాపు ప్రతివాళ్ళకి వైరాగ్య భావన ఒకేసారి కలిగింది. ప్రతివాళ్ళకీ ఒకే బాధ పట్టుకుంది. పుట్టాం, పెరిగాం. ఎప్పుడో ఉన్నట్లుండి చస్తాం. ఎట్లాగ? మోక్షం లభించేది ఎట్లా? అంతా అదే భావనతో ఉన్నారు. పిల్లలు మాత్రం ఎవరి లోకంలో వాళ్ళు ఉన్నా పెద్దవాళ్ళకి మాత్రం వైరాగ్యం ఒకేసారి కలిగింది.

దీపారాధన స్వామితో మొదలైన ఆధ్యాత్మిక చింతన ఆయనతోనే ఆగిపోలేదు. కొంతమందికి ఆయన బోధలు నచ్చలేదు. వాళ్ళు వేరే గురువుని చూసుకున్నారు. పద్మజ మాత్రం ఆయన దగ్గరకే వెళ్తోంది. మరి కొంతమంది కూడా తోడు ఉన్నారు. దీపారాధన స్వామిగారు ఉన్నట్లుండి ఒక పెద్ద పని తలపెట్టారు. కార్తీక పౌర్ణమి రోజున కోటి దీపాలు వెలిగించాలని సంకల్పించారు. అవి కూడా వెండి దీపారాధన కుందుల్లోనే వెలిగించాలి. ఆ తర్వాత ఆ వెండి కరిగించి వేరే ఏదో పనికి వినియోగిస్తారుట.

పెద్ద ఎత్తున చందాలు వసూలు చేస్తున్నారు. పద్మజని కూడా అడిగారు. పద్మజ ఎట్లాగో కూడదీసుకుంటే పదివేల దాకా ఇవ్వగలననిపించింది. అది పద్మజకి చాలా పెద్ద మొత్తం.

కానీ స్వామీజీకి అది చాలా చిన్న మొత్తంలా తోచింది.

"కనీసం రెండు లక్షలు ఇవ్వలేవా? " అన్నారు. పద్మజకి ఊపిరాడలేదు.

"పోనీ కనీసం లక్ష? "

"ఇవ్వలేను స్వామీ". అంది పద్మజ.

స్వామికి కోపం వచ్చింది.

"ఇవ్వలేను అనకు. ఇవ్వను అను. ఇవ్వ బుద్ధి కావటం లేదను. అంతే" అన్నారు చిరుకోపంతో.

"అదేంటి స్వామీ? " పద్మజ అయోమయంగా అంది. ఆయన పద్మజనే కాదు. ఆమెతోపాటు అక్కడ కూర్చున్న మరో యాభైమంది స్త్రీలని ఉద్దేశించి మాట్లాడుతున్నారు. వాళ్ళందరినీ కూడా రెండు లక్షలు ఇవ్వమని కోరారు.

అంతా అదేమాట అన్నారు. అక్కడ అప్పుడు ఉన్న వాళ్ళంతా కూడా పద్మజ లాగే మధ్య తరగతి స్త్రీలే, లక్షలు ఇచ్చే లెవెల్లో ఎవరూ లేరు.

"మాకు ఇవ్వబుద్ధి కాకపోవటం ఏమిటి స్వామీ. అట్లా అనకండీ. ప్రస్తుతం మా పరిస్థితికి ఎక్కువ డబ్బు ఇవ్వలేం" అన్నారు వాళ్ళు. ఆయనకి ఇప్పుడు బాగా కోపం వచ్చింది.

"ఎందుకు ఇవ్వలేరు? మీకేమన్నా కష్టం వచ్చి పడిందనుకోండి. ఏం చేస్తారు? ఏ ఆపరేషనో లక్షల ఖర్చయ్యేది, చెయ్యక తప్పని స్థితి వచ్చిందంటే ఏం చేస్తారు? మీ ప్రావిడెంట్ ఫండ్‌లో లోన్ తీసుకోరా? మీ ఇల్లు తనఖా పెట్టయినా డబ్బు

# కల్లు వేలం పాట!




స్వాతంత్ర్య పోరాటానికి అనంతపురం అందించిన యోధాగ్రేసరుల్లో పప్పూరు రామాచార్లు ఒకరు. ఆయన 'సాధన' పత్రిక సంస్థాపక సంపాదకులు. ఇల్లూరు గ్రామంవారైన కైప సోదరులు, మహానందయ్య వారికి ఆప్తులు. గాంధీజీ చెప్పిన నిర్మాణాత్మక కార్యకలాపాల్లో కలిసి పనిచేశారు.




మొదట మద్య నిషేధంపై దృష్టి పెట్టారు. ఫలితంగా ఇల్లూరు, తరిమెల చుట్టుపక్కల కల్లు వేలంపాటలు పడిపోయాయి. వీరు వేసిన రెండో అడుగు కల్లు అంగళ్ల వద్ద పికెటింగ్. రామాచార్లు, మహానందయ్య 1921 మే 25న పామిడిలో కల్లు అంగడివద్ద పికెటింగ్ చేశారు. కాంట్రాక్టర్ ఈడిగ చిన్నప్ప పోలీసు సాయం కోరాడు. పామిడి సబ్ఇన్స్పెక్టర్ ప్రసాదరావు వారిద్దరినీ అరెస్టు చేశాడు. మరుసటిదినం రాత్రి 8 గంటలకు పామిడికొచ్చిన సబ్ మేజిస్ట్రేటు గ్రామ చావిడిలో ఐ.పి.సి. సెక్షన్ 341 కింద విచారణ చేశారు. ప్రాసిక్యూషన్ లేని కథలల్లి దొంగసాక్ష్యం ఏర్పాటు చేసింది. పామిడికి సమీపంలోని ఇల్లూరు గ్రామస్థులకు ఈ వార్త తెలిసింది. వెంటనే కరణం నరసప్ప, నీలం చిన్నపరెడ్డి 200 మందితో విచారణ స్థలం చేరుకున్నారు. అది చూసి సబ్ మేజిస్ట్రేటు ప్రమాదాన్ని శంకించి, విచారణ వాయిదా వేసి, తర్వాతిరోజు గుత్తిలో విచారణ చేపట్టాడు. పప్పూరు రామాచార్ల క్రాస్ ఎగ్జామినేషన్ జోరుకు ప్రాసిక్యూషన్ సాక్ష్యం కుప్పకూలింది. కేసును కొట్టివేశారు.

తీసుకోరా? ప్రాణం మీదికి వస్తేగానీ అట్లాంటివి చెయ్యరా? దైవకార్యం అంటే మీకంత నిర్లక్ష్యంగా ఉందా? " ఆయన గట్టిగా అరుస్తూ అడిగాడు.

అంతా బిత్తరపోయారు.

"చెప్పండి" ఆయన మళ్లీ అరిచాడు.

"నిజమే. కానీ..." ఒకావిడ నీళ్లు నమిలింది.

"ఏం? ఏంటా కానీ? " ఆయన గర్జిస్తూ అడిగాడు.

"అట్లాంటి అవసరాలకి ఉపయోగపడుతాయనే కదా స్వామీ డబ్బు దాచుకోవటం" పద్మజ అడిగింది.

"మీకు నిజంగా దేవుడి మీద నమ్మకం ఉంటే ఇట్లాంటి ప్రశ్న వెయ్యరు. మీకు దేవుడి మీద విశ్వాసం లేదు. ఉంటే ఇట్లాంటి సందేహాలు రావు. 'ఆయన నన్ను కాపాడుతాడు, నాకెటువంటి బాధలు రావు. వచ్చినా ఆయన నన్ను రక్షిస్తాడు' అని నమ్మేవాళ్ళు. ఇట్లా 'నా డబ్బు, నా ఫండ్, నా ఇల్లు' అని తాపత్రయ పడేవాళ్ళు దేవుడికి ఎప్పుడూ దగ్గర కాలేరు" అన్నాడాయన.

ఆయన మాటలతో కొంతమంది కదిలి తమ భర్తల ప్రావిడెంట్ ఫండ్లోంచి అప్పు తీసుకుని సమర్పిస్తామని ఆయనకి చెప్పాక ఆయన కాస్త శాంతించాడు.

పద్మజ మాత్రం అణువైనా చలించలేదు.

ఎప్పటికప్పుడు అప్పులు చెయ్యటంవల్ల హరనాథ్కి తన ఆఫీసులోని ఫండ్లో పెద్దగా ఏమీ జమలేదు. ఇంక మిగిలింది ఇల్లు. ఇల్లు తనఖా పెట్టి స్వామీజీకి ఇచ్చేమాట కల్ల. కావాలంటే ఆధ్యాత్మిక మార్గాన్నైనా తను వదులుకునేందుకు సిద్ధం కానీ ఇల్లు మాత్రం వదులుకోదు.

ఇప్పుడు తనఖా పెట్టినా దాన్ని ఎట్లా విడి పించుకోవాలి? ఏదో చెప్తాడు కానీ ఏద న్నావస్తే ఎవరు చేస్తారు?

ఆ తర్వాత స్వామీజీ శిష్యులు పద్మజకి గౌరవం తగ్గించారు.

స్వామీజీ కూడా తన ప్రసంగంలో సూటీపోటీ మాటలనటం మొదలుపెట్టా డు. ఇహాన్ని, ఇంటినీ పట్టుకుని వేళ్లాడే వాడు ఎన్నడూ బాగుపడడనీ, డబ్బుని వదులుకునే త్యాగ గుణం వచ్చినవాడే ఈ లోకాన్ని సులువుగా వదిలి వెళ్ళిపోగల వాడవుతాడనీ, అట్లాంటి వాళ్ళకే మోక్షం లభిస్తుంది తప్ప, డబ్బుని పట్టుకున్న లోభికి నరకంలో వేడినూనెలో వేపబడటం తప్ప ఇంకేం లేదనీ, పద్మజలాగా డబ్బులు ఇవ్వటానికి వెనుకాడిన శిష్యులవైపు ఓరగా చూస్తూ చెప్పటం మొదలుపెట్టాడు. ఇది విని లోభత్వం వదిలి కాస్త ఎక్కువ మొత్తంలో డబ్బు ఇచ్చిన శిష్యురాళ్ళు నవ్వటం మొదలు పెట్టారు. అమ్మ కొట్టి నందుకన్నా పక్కింటమ్మ నవ్వినందుకు ఎక్కువ బాధ కలిగినట్లు, స్వామీజీ మాటలు మనసుని పుండుచేస్తే, వాళ్ళ నవ్వులు పుండులో కారం చల్లాయి. మెల్లగా పద్మజ స్వామీజీ బోధలకు వెళ్లటం మానేసింది.

రమ్యకి పెళ్లి సంబంధం చూశారు.

పెళ్లికొడుకు అమెరికాలో ఉద్యోగం చేస్తు న్నాడుట. మనిషి చాలా బాగుంటాడుట. మంచివాళ్లని చెప్పారు. ఒక నెల రోజులు సెలవుపెట్టి వచ్చి పెళ్లి స్థిరం చేసుకుని, పెళ్లి చేసుకుని మరీ వెళతాడుట.

మరోవారంలో అబ్బాయి అమెరికా నుంచి వచ్చేశాడు. పెళ్లిచూపులు జరి గాయి.

అంతా అన్నట్లుగానే అబ్బాయి చాలా అందంగా ఉన్నాడు. తల్లీ తండ్రీ చాలా మర్యాదస్తుల్లా కనిపించారు.

రమ్యకి పెళ్లికొడుకు బాగా నచ్చాడు. అతనికి కూడా రమ్య నచ్చింది. అక్కడే తమ నిర్ణయం చెప్పేశాడు.

"రేపు రండి. మాట్లాడుకుందాం" అంది పెళ్లికొడుకు తల్లి.

మర్నాడు పద్మజా, హరనాథ్ పెళ్లికొ డుకు ఇంటికి వెళ్లారు. పెళ్లికొడుకు తల్లి నవ్వుతూ లోపలకు ఆహ్వానించింది. వాళ్ల ఇల్లు చాలా బాగుంది. కానీ అద్దె ఇల్లట. అంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వాళ్ల సంభాషణ, మాట తీరూ అంతా చాలా క్యాజువల్‌గా ఉంది.

"పెళ్లికి ఎక్కువ సమయం ఉండదు. పదిహేను రోజుల్లోపలే ముహూర్తం ఉండాలి. పెళ్లయ్యాక కనీసం ఒక పదిరో జులు వాళ్లు తిరగాలిగా? నెలరోజుల్లో మావాడు అమెరికా వెళ్లిపోతాడు. తర్వాత మీ అమ్మాయి వెళ్ళాలి" అంది పెళ్ళికొడుకు తల్లి.

పద్మజా, హరనాథ్ తల ఊపారు.

"నెలరోజుల్లో ఏ మ్యారేజ్ హాల్ కూడా దొరకదు. మాకు పెళ్ళి ఘనంగా జరగా లని పట్టింపులేదు. ఎంత సింపుల్‌గా చేసినా మాకు అభ్యంతరం లేదు. ఎక్కువ మందిని పిల్చే సమయం కూడా లేదు. మీకు పెళ్లికి అయ్యే ఖర్చు కూడా చాలా తక్కువ" అందావిడ.

పద్మజ, హరనాథ్ మౌనంగా వింటు న్నారు.

"బంగారం, చీరెలు కూడా పెద్దగా మీరేం పెట్టాల్సిన అవసరం లేదు".

ఇంతమంచి సంబంధం దొరికినందుకు హరనాథ్, పద్మజా తమను తాము అభి నందించుకుంటున్నారు.

ఇంతలోనే వాళ్లకు సమ్మెట పోటులా అత్తగారు ఒకే ఒక్కమాట అంది.

"మా వాడికి ఎంత కట్నం అయినా ఇస్తామని బోలెడు సంబంధాలు వస్తు

న్నాయి. కానీ వాడికి మీ పిల్ల బాగా నచ్చింది. అందుకే వేరే సంబంధాలు ఏవీ చూడను కూడా చూడలేదు. మీరు అదృష్టవంతులు. మిమ్మల్ని మేం ఏమీ అడగం. కానీ మీ ఇల్లు అమ్మాయి పేరున రాస్తే.."

పద్మజ నెత్తిన పిడుగు పడ్డట్లయింది.

"అదెలా కుదురుతుంది? " అంది.

ఆవిడ సూటిగా చూసింది.

"ఎందుకు కుదరదండీ? ఈ రోజుల్లో ఆడపిల్లలకి ఆస్తిలో హక్కు ఉంది కదా"

"ఉంది. కానీ మాకు అబ్బాయి కూడా ఉన్నాడు.

"ఉన్నాడులెండి. వాడి పెళ్లప్పుడు కట్నంగా ఇల్లు ఇచ్చే అమ్మాయిని చూడండి."

"అట్లా ఎవర్ని అడుగుతామండీ? మీరు ఇంకేమన్నా అడగండి" అంది పద్మజ.

ఆవిడకి కోపం వచ్చింది

"అసలు మా లెవల్‌కి మీది చాలా తక్కువ సంబంధం అండీ. ఏదో మధ్యవర్తులు మీ అమ్మాయి బాగుంటుంది, మీరు మంచివాళ్లంటే వచ్చాంగానీ లేకపోతే మాకేంటి? మాకు ఎక్కువ టైం లేదు. వాడు మళ్ళీ మళ్ళీ రాలేడు. రేపటిలోపల మీరు ఆలోచించుకుని ఏసంగతీ చెప్పండి" అనేసింది ఆవిడ. ఈ మాత్రం ఇచ్చుకోలేని వాళ్లు ఎందుకు వచ్చారన్న భావం ఆవిడ మొహంలో కొట్టవచ్చినట్లు కనబడుతోంది. ఆయన అయితే అసలు మీతో మాట్లాడటం కూడా వేస్ట్ అన్నట్లు ఎటో చూస్తున్నాడు.

"సరే.. ఆలోచించుకుని చెపుతాం" అన్నాడు హరనాథ్. వాళ్లు తల ఊపారు.

ఇంటికి వచ్చాక ఆలోచించారు.

నిజానికి ఆలోచించటం అంటే ఏమీ లేదు. అంతా కలసి ఒక దగ్గర కూర్చుని మాట్లాడుకున్నారంతే. ఇల్లు మొత్తం పిల్లకి ఇచ్చెయ్యటమా? వాళ్ళు ఏ మాత్రం టైమ్

**కొత్తగాలి...**

**నిద్ర నాటికకి**
**రాత్రి యవనిక**
**కలలదే**
**ముఖ్యభూమిక!**

– టి. చంద్రశేఖరరెడ్డి,
హైదరాబాద్

కూడా ఇవ్వటం లేదు. రాతకోతలు కూడా జరిగిపోవాలంటున్నారు. ఏం చెయ్యాలి? ఇల్లు వాళ్ళకి ఇస్తే ఇంక నిలవ నీడ కూడా ఉండదు. వేరే ఎక్కడో ఇల్లు చూసుకోవాలి. మళ్ళీ జీవితం ప్రారంభించాలి. కుదిరే పనికాదు. ఆ ప్రశ్నే ఉత్పన్నం కాదు. చర్చ కూడా అనవసరం. కానీ ఏదో తప్పనిసరిగా మాట్లాడుకున్నారు. రమ్యని చర్చలోకి పిలవలేదు. అంతా మాట్లాడుకున్నాక రమ్యని పిల్చి వాళ్లు అడిగిన విషయం చెప్పారు.

రమ్య కళ్లల్లో నిరాశ స్పష్టంగా కనిపించింది.

పద్మజకి గుండె కలుక్కుమంది.

కానీ తప్పనిసరి పరిస్థితి. ఇప్పుడు గనక జాలిపడితే తాము ఆశ్రయం లేని వాళ్లవుతారు.

"ఇంకో సంబంధం చూద్దాం" అంది వరలక్ష్మి ఆ చర్చకి ముగింపు పలుకుతూ.

ఇద్దరు ముగ్గురికి చెప్పిపెట్టే ఉంచారు కాబట్టి ఇంకో సంబంధం కూడా తొందరగానే వచ్చింది.

అబ్బాయి బాగున్నాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. ఒక అక్క ఉంది. ఆ అమ్మాయికి పెళ్లి అయిపోయింది. ఆ అమ్మాయికి కూడా గొప్పగా పెళ్లి చేశారుట. వాళ్లకి కట్నం అక్కర్లేదుట. వేరే ఏమీ కూడా అడగరని చెప్పాడు మధ్య

వర్తి.

పెళ్ళిచూపులు జరిగాయి.

ఆ కుటుంబం, పెళ్ళికొడుకు అంతా అందరికీ నచ్చారు.

వాళ్ళకి కూడా రమ్య నచ్చింది.

కానీ పెళ్ళి మాత్రం బాగా చెయ్యాలన్నారు.

"బాగా అంటే? " అంది పద్మజ.

వాళ్ళు ఒక్కొక్కటే చెప్తూ ఉంటే పద్మజకి గుండె ఆగిపోయినట్లయింది. వాళ్ళు ఫలానా హాల్లోనే పెళ్ళి చెయ్యాలన్నారు. ఆ హాలు అద్దె లక్షల్లో ఉంది. వాళ్ళు ఇచ్చిన మెనూ లిస్ట్ చూస్తే కళ్లు తిరిగిపోయాయి. ఖర్చులే పదిహేను లక్షలపైన అయ్యేట్లుంది. వాళ్ళు వెయ్యిమందికి పైన వస్తారుట. వందమందికి పైగా బట్టలు పెట్టాలిట. అంతా అంటుంటే అట్లాంటి పెళ్ళి గురించి ఎక్కడో వినటమే తప్ప చూడను కూడా లేదు.

ఇల్లు అమ్మినా అట్లాంటి పెళ్ళి చెయ్యలేరు. పెళ్ళి అనేసరికి అది ఎదుటివాళ్ళ పెళ్ళి అయితే, అది ఎంత ఘనంగా జరగాలో చెప్పటానికి ప్రతివాళ్ళకీ హుషారు ముంచుకొస్తుంది.

మధ్యవర్తికి కూడా అట్లాగే హుషారు వచ్చేసింది. "అట్లా డీలాపడితే ఎట్లాగండీ? పెళ్ళి అంటే ఎంత ఘనంగా చెయ్యాలి, ఎంత గొప్పగా ఉండాలి. మన ముద్దు ముచ్చట్లన్నీ తీర్చుకునేది ఎప్పుడు? పెళ్ళికి కాకపోతే మరి దేనికి ఖర్చు పెడతారు? " అన్నాడు.

"ఉన్నవాళ్ళు పెట్టుకుంటారండీ. లేనివాళ్ళు ఎక్కడి నుంచీ పెడతారు? " అంది పద్మజ.

"బాగుందండీ. ఆడపిల్లని ఇచ్చుకునేప్పుడు మంచి చోట ఇవ్వాలి. కన్నందుకు మన బాధ్యత. నా మాట విని శుభ్రంగా ఈ ఇల్లు అమ్మిపారేయండి. అమ్మాయి పెళ్ళి కాస్తా చేసేశాక మీరు ఎక్కడుంటే మాత్రం ఏముంది? " అన్నాడు మధ్యవర్తి.

"బాగానే ఉందయ్యా నీ వరస. ఇల్లు అమ్మి ఎక్కడికి పొమ్మంటావు? " అంది వరలక్ష్మి అరుస్తూ.

"మీ ఇష్టం. నేను మార్గం చెప్పాను. ఆ మార్గాన వెళ్ళేదీ లేనిదీ మీరు నిర్ణయించుకోవాలి" అన్నాడు ఆయన.

ఆ సంబంధం కూడా వదులుకున్నారు.

ఆ తర్వాత సంబంధాలవాళ్ళని ముందే అన్నీ అడిగి ఏమేం కావాలో కనుక్కుని, వాళ్ళు తమకి సరిపోతారు అనుకున్న తర్వాతే పెళ్ళిచూపులకి పిలిచారు.

మూడు సంబంధాలు ఏదో ఒకటి కుదరక మానుకున్నారు. నాల్గో సంబంధం కుదిరింది. అబ్బాయి మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. చూపులకి పర్వాలేదు. మొదటి సంబంధం అమెరికా అబ్బాయి లాగా మాత్రం ఎవరూ లేరు. ఆ అబ్బాయి చెక్కిన శిల్పంలా ఉన్నాడు. ఆ మాటతీరూ, నవ్వూ అన్నీ వేరు. పద్మజకి కూడా అతను గుర్తుకొచ్చి ఒక్కక్షణం మనస్సు చివుక్కుమంది. పాపం రమ్య. కొంచెం ధైర్యం చేసి ఇల్లు వదులుకుంటే రమ్యకి బాగా నచ్చిన వాడు భర్త అయ్యుండేవాడేగా. ఇప్పుడు రమ్య వచ్చిన వాడినే భర్త అనుకుని, అతన్నే మనసుకి నచ్చేట్లుగా సర్దుకుపోవాలి.

రమ్య పెళ్ళి జరిగిపోయింది.

★ ★ ★

"పిల్లాడికి పెళ్లి చెయ్యావా? " బంధువుల పెళ్లికి వెళ్తే అంతా అడిగే ప్రశ్న.

"చెయ్యాలనే ఉంది" అంటుంది పద్మజ.

"మరింకేంటి బాధ? "

"తగిన సంబంధం దొరకాలి కదా? "

"నీ మొహంలా ఉంది. ఈ రోజుల్లో సంబంధం దొరకటమంత తేలిక మరోటి లేదు. నీ వివరాలన్నీ ఎంట్రీ చేసి ఫారం

నింపు. ఇంటర్నెట్‌లో కూడా కుదుర్చుకో వచ్చు."

పద్మజ సరేనంటుంది.

అసలు సంగతి అది కాదు.

పిల్లాడ్ని అడిగే దమ్ము పద్మజకి కానీ, భర్తకి గానీ లేవు. మంచి ఉద్యోగం చేస్తు న్నాడు. మంచి జీతం వస్తుంది. పెళ్ళి చేసేయవచ్చు.

కానీ ఎందుకోగానీ పెళ్ళి విషయం వచ్చే సరికి అదోలా ఉంటాడు. మామూలుగా కూడా అంత క్లోజ్‌గా మాట్లాడటం తక్కువే. అందులో పెళ్ళి విషయం అనేస రికి మరీ రిజర్వ్‌డ్‌గా ఉంటాడు. ఆఫీసు నుంచి ఇంటికి రావటమే రాత్రి తొమ్మిది దాటాక. వచ్చాక ఫ్రెండ్స్‌తో కాస్సేపు ఫో న్ మాట్లాడి, స్నానం చేసి, కంప్యూటర్ ముందు కూర్చుంటాడు. ఆ తర్వాత దాని ముందు నుంచి బుద్ధి పుట్టినప్పుడు కదు ల్తాడు. లేకుంటే రాత్రి రెండైనా కంప్యూ టర్లో ఏదో ఒకటి చేస్తూనే ఉంటాడు. ఈ లోపల తింటే అన్నం తింటాడు. లేకపోతే ఫ్రిజ్‌లో తనకు కావల్సినవి తీసుకుని తింటాడు. ఫ్రిజ్ నిండా తనక్కావాల్సినవి తెచ్చి నింపుతాడు. పద్మజకి పేరు కూడా తెలీని పళ్లు, గుర్తు తెలీని బిస్కట్లూ, చాక్లెట్లూ, స్వీట్లూ ఫ్రిజ్‌లో ఉంటాయి. ఐస్‌క్రీములు రకరకాలుంటాయి.

ఉద్యోగం రాగానే వాడెందుకు హఠా త్తుగా అట్లా మారిపోయాడో పద్మజకి అర్థం కాలేదు. పద్మజ ఏవన్నా పిండి వంటలు చేస్తే ఉద్ధరిస్తున్నట్లుగా తింటాడు. వాడికి నచ్చినవి చెయ్యటం పద్మజకి చేతకావటం లేదు. చిన్నప్పటిలా తిట్టి తినిపించలేదు కదా.

"మా పిల్లాడు నేను చేసినవి తినడు. ఏవేవో తెచ్చుకుని ఫ్రిజ్‌లో పెడతాడు" అంది పద్మజ పక్కింటావిడతో.

ఆవిడ గట్టిగా నవ్వింది.

"మీ పిల్లాడు నయం. మా వాడైతే తన కోసం స్పెషల్‌గా ఒక ఫ్రిజ్ కొనుక్కుని వచ్చాడు. తనక్కావల్సిన సమస్తం అందులో నింపుతాడు. మమ్మల్ని అటు వైపు కూడా రానివ్వడు. ఆ ఫ్రిజ్ కూడా మా ఇంట్లోనే ఉన్నా మాకు మాత్రం అటు పోయే స్వతంత్రం లేదు. ఒక్కోసారి మంచి నీళ్ళు కూడా లేకపోయినా దాన్ని మాత్రం తెరిచే ఫ్రీడమ్ మాకులేదు. మొన్న ఒకావిడ వచ్చింది. ఆవిడ ఫ్రిజ్‌లో నీళ్లు తప్ప తాగదుట. మా ఫ్రిజ్‌లోని బాటిళ్లన్నీ ఖాళీ చేసేశాం కాబట్టి చల్లటి నీళ్ళు ఒక్క చుక్క కూడా లేవు. ఆవిడ ఆ ఫ్రిజ్‌కేసీ, నాకేసి ప్రశ్నార్థకంగా చూస్తోంది. కావాలని నీళ్ళు ఇవ్వటం లేదే మోనన్న ఆలోచన వచ్చినట్లుంది. ఏం చేస్తాం. ఎవరేమన్నా ఊరుకోవాలి. పిల్ల లతో గొడవ పెట్టుకుని బతకలేం కదా" అంది ఆవిడ.




రెండిళ్ల అవతల ఉన్న రాజ్యం ఆ రోజు పద్మజని చూడటానికి వచ్చింది.

"రండి రండి" ఆహ్వానించింది పద్మజ.

ఎన్ని దశాబ్దాలైనా రాజ్యంతో మాట్లాడా లంటే పద్మజకి భయంగానే ఉంటుంది. అన్నేళ్ల నుంచి చూస్తున్న రాజ్యం వస్తుంటే చాలు. అదోలాంటి నీరసం ఆవహిస్తుంది పద్మజని.

మనుషులు రకరకాలు. తాము

నవ్వుతూ, అందర్నీ నవ్వించేవాళ్ళు కొందరు, తాము దుఃఖిస్తున్నా కూడా ఇతరుల్ని సంతోషంగా ఉండేట్లు చేసేవాళ్ళు కొందరు.

కానీ రాజ్యం విషయం వేరు. తాను ఏడుస్తూ అందరికీ నిరాశ కలిగేటట్లు చేస్తుంది.

తమ రాకతో పరిసరాల్లో ఆనందం, సంతోషం నింపేవాళ్ళు కొందరు. కానీ రాజ్యంలాంటి వాళ్ళు తమ మాటలతో ఇతరుల్లో కూడా నిరాశ, దుఃఖం కలిగేటట్లు చేస్తారు.

"ఊరికే చూసి పోదామని వచ్చాను. పక్కనే ఉన్నా ఎప్పుడూ మాట్లాడటమే కుదరటం లేదు" అంది రాజ్యం.

పూల చెట్లనీ, నిండా పళ్ళతో కళకళలాడుతున్న పళ్ళ చెట్లనీ చూసి హుమ్మని నిట్టూర్చింది.

"ఏంటో, మీ తోట చాలా బాగుంది. దేని కన్నా ప్రాప్తం ఉండాలి" అంది నీరసంగా.

వేసుకుని పెంచితే ఎవరింట్లోనైనా చెట్లు బాగానే పెరుగుతాయి. కానీ ఆ మాట అంటే రాజ్యం ఒప్పుకోదు.

"మీ నేలకీ మా నేలకీ తేడా ఉందండీ. మాకు మరీ రాళ్ళున్న నేల వచ్చింది. మా ఇంట్లో చెట్లు పెరగవు" అంటుంది.

మొక్కలని పెట్టాలని కోరిక కలిగిన రోజున విత్తనాలు చల్లటమో, నర్సరీలోంచి మొక్కలు తేవటమో చేస్తుంది రాజ్యం. ఆ తర్వాత మళ్ళీ వాటి మొహం చూడదు. ఒక్క చెంబు నీళ్ళు కూడా వాటికి పోయదు. అవే వాన నీళ్ళతో, పొరపాటున పారబోసిన నీళ్ళనో ఆధారం చేసుకోవాలి, బతికితే బతకాలి, చస్తే చావాలి. తన నిర్లక్ష్యానికి అవి చచ్చిపోయాయని రాజ్యం మాత్రం నమ్మదు. వాటికి ఎంతచేసినా చచ్చిపోయాయంటుంది. దానికి కారణం తన ఇంటి నేలే అంటుంది.

నిజానికి రాజ్యం ఇంటి నేల చాలా మంచిది. అసలు నిజం మాట్లాడితే ఆ వీధి చివర రామాంజనేయులుగారి నేలని అంతా పాడు చేశారు. ఆయన పాపం చివర్లో అందరి తర్వాత ఇల్లు కట్టాడు. ఈ లోపల అక్కడ ఇల్లు కట్టుకున్న వాళ్ళంతా మెరకగా ఎత్తున కట్టుకోవాలంటే ఆయన ఇంటి నేలని తవ్వేశారు. ఆ స్థలంలో పెద్ద గొయ్యి ఏర్పడింది. దాన్ని మిగిలిపోయిన రాళ్ళూ, చెత్తా, చెదారం, ఇసుకా, సిమెంట్ వగైరాలలో ఆ చుట్టుపక్కల వాళ్ళు నింపేశారు. దానితో ఆయనకి సారవంతమైన నేల మాయమై, దాని స్థానంలో సున్నం, ఇసుక, చెత్త, సిమెంట్, రాళ్ళ కాంబినేషన్‌తో వింత పదార్థం మిగిలింది పునాదులు వేయటానికి. అంతే కాకుండా ఆ నేలలో చెట్లూ, చేమలూ కూడా పెరగవు. కానీ ఆయన ఎట్లానో శ్రమించి దాన్ని మళ్ళీ మంచి మట్టితో నింపి ఎట్లాగో మొక్కలు పెట్టి పెంచుకుంటున్నాడు.

ఆయన ఒక్కసారి కూడా ఆ విషయం తల్చుకున్నట్లు కనిపించడు. కానీ రాజ్యం మాత్రం తనకి ఏ విధమైన నష్టం జరగకపోయినా నేలనీ, నింగినీ, మనుషుల్నీ నిందిస్తూనే ఉంటుంది.

రాజ్యం కూర్చుంది.

పద్మజ లోపలకు వెళ్ళి జంతికలూ, సున్నుండలూ ఉన్న ప్లేట్‌తో తిరిగి వచ్చింది.

"వద్దు. నాకు నమిలే ఓపిక లేదు. అవునూ. రోజూ ఇట్లా జంతికలూ, సున్నుండలూ తింటావా? నీకు పళ్ళు నెప్పిపెట్టవేమో. నాకైతే దంతాలూ, నోరూ, ఆఖరికి మొహం అంతా నెప్పి పుడుతుంది. నీకు అదృష్టంలే. పుష్టిగా ఉన్నావు. ఏది తిన్నా అరుగుతుందేమో కదూ? నాకలాంటి అదృష్టం లేదు" అంది

## మార్చి -2010
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. **రెడ్డి విజయలక్ష్మి** - బొబ్బిలి, విజయనగరం జిల్లా
2. **ఎం.పల్లవి** - బోరబండ, హైదరాబాద్
3. **తన్నీరు లలిత** - దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
4. **డి.వి.రమణమూర్తి** - అచ్యుతాపురం, కాకినాడ
5. **ఎం.జగన్నాథరావు** - కంటోన్మెంట్, విజయనగరం

### సరైన జవాబులు

1. గోపి 2. రజియా 3. జనార్దనం 4. శ్రీను 5. పోంబాబు 6. కందుకూరి వీరేశలింగం 7. బ్రాం స్టోకర్ 8. ప్రథమ ప్రతి శ్రుతి 9. రాములు 10. ఆనందభైరవి

రాజ్యం.

ఎందుకు ఆ జంతికలూ, సున్నుండలూ తెచ్చానా అని బాధపడింది పద్మజ.

రాజ్యం ఇల్లంతా కలయచూస్తోంది.

పద్మజ ఎంబ్రాయిడరీ కుడుతున్న చీరె ఆమె కంట పడింది. వెంటనే లేచి ఆ చీరె అందుకుంది.

"బాగుంది. డిజైన్ నువ్వే వేశావా?" అంది.

"అవును"

"వేస్తావులే. నీకు సైట్ లేదు. కళ్ళూ, ఒళ్ళూ, పళ్ళూ అన్నీ బలంగా ఉన్నాయి. మొక్కలు పెడతావు. హాయిగా జంతికలు తింటూ, చీరె మీద డిజైన్లు కుట్టుకుంటావు."

పద్మజ మనసులోనే తలపట్టుకుని కూర్చుంది. రాజ్యం పద్మజని ఏకవచనంలో పిలుస్తుంది. కానీ పద్మజ తిరిగి తనని ఏకవచనంలో సంబోధిస్తే ఏమాత్రం సహించదు. కరుగ్గా మాట్లాడి, ఇంకెప్పుడూ ఇట్లా పొరపాటున కూడా పిలవకూడదు అన్నట్లు ప్రవర్తిస్తుంది.

పద్మజ ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంది. ఆ ఎక్స్‌ప్రెషన్ చూసి రాజ్యానికి ఇంకాస్త మండిపోతోంది.

ఏదో ఒకటి మాట్లాడాలి. ఏం మాట్లాడాలి? నిశ్శబ్దం ఆ గదిలో రాజ్యమేలుతోంది. పద్మజకి ఆ నిశ్శబ్దం భయంకరంగా ఉంది. కానీ ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ రాజ్యం మళ్ళీ ఏమంటుందోనని భయం కలుగుతోంది.

తన ప్రశాంతతని ఇంత ఘోరంగా భగ్నం చేస్తున్న రాజ్యం మీద కోపం వస్తోంది. ఎట్లాగో ఆ కోపాన్నీ, భయాన్నీ అణుచుకుని కూర్చునే సరికి, ఆ ఫీలింగ్‌లన్నీ అణచుకున్న ఫలితంగా మొహం భయంకరంగా మారింది. పద్మజ మొహంలో మారుతున్న హావభావాలన్నీ రాజ్యం తేలిగ్గా పసికట్టింది. ఆమెని ఇంత ఇరుకున పెట్టగలిగినందుకు రాజ్యంకి చాలా సంతోషంగా ఉంది. ఆమెనే కాదు ఎవరినైనా ఇరుకున పెట్టడంలో ఉన్న ఆనందం



రాజ్యంకి ఎందులోనూ ఉండదు.

"పాపం పార్వతి హఠాత్తుగా పోయింది కదూ. చాలా బాధపడ్డాం" అంది పద్మజ చివరికి ఎలాగో నోరు పెగల్చుకుని. చావు కన్నా విషాదం లేదు కాబట్టి రాజ్యం కూడా విషాదయోగం అనుభవిస్తుందేమో, ఆ విధంగా ఆమె పవర్‌ని కాస్త తగ్గించి నట్లు అవుతుందని అనుకుంది.

కానీ రాజ్యంకి ఇవేవీ పట్టవు.

"ఎందుకండీ బాధ పడటం?" అంది.

"అదేంటండీ? బాధపడమా? పొరుగింటి వాళ్ళు పోతే బాధ ఉండదా?" అంది పద్మజ.

"ఎందుకు బాధ పడాలి? పార్వతికేం హాయిగా బతికింది. అత్త పోరా, ఆడపడుచు పోరా? ఏం ఉంది? ఆ మొగుడు ఉన్నాడంటే ఏం చెప్తే అది చేసేవాడు. ఒక బరువు లేదు. బాధ్యత లేదు. నేను ఉన్నానంటే పెళ్ళయి వస్తూనే వంద బాధ్యతలు నెత్తిన వేశారు. మా ఆడపడుచుల పెళ్ళిళ్ళు మేమే చేశాం. మా అత్తగారిని నా దగ్గరే ఉంచుకోవాల్సి వచ్చింది" రాజ్యం తన ధోరణిలో తాను చెప్పుకుంటూ పోతోంది.

ఆ ఆడపడుచుల పెళ్ళిళ్ళు రాజ్యం ఎప్పుడు చేసిందో పద్మజకి అర్థం కాలేదు. కానీ ఏమన్నా అంటే రాజ్యం ఊరుకోదు.

"పోనీ ఏమన్నా మామూలు జీవితం



గడిపిందా అంటే అదీలేదు. పిల్లల్ని హాస్టల్లో పెట్టింది. అత్తగార్ని తరిమేసింది. ఏ చీరె కొనమంటే ఆయన అది కొనిచ్చే వాడు. కొత్త ఫ్యాషన్ చీరెలు, నగలు, పువ్వుల్లో పెట్టుకుని చూసుకునే భర్తా, హు.. ఏం భోగం అనుభవించింది. ఒక్క వెలుగు వెలిగింది. ఇన్ని సుఖాలు అనుభ వించిన వాళ్ళకి చావు చాలా కష్టం అవు తుందంటారు. కానీ చావు కూడా ఇంత హాయిగా వచ్చింది. ఏంటో ఈ ప్రపంచం. ఉన్నవాళ్ళకే అన్నీ. నేను అత్తగారికీ, ఆడ పడుచులకీ ఇంత చేశాను. నాకేం దక్కింది? పాపిష్టివాళ్ళే నయం. అనా యాస జీవితం, సునాయాస మరణం" రాజ్యం పార్వతిని తిడుతూనే ఉంది.

ఆమె జీవితంలో ఎంతెంత కష్టాలు పడిందీ చెప్పి, పార్వతి ఎన్ని సుఖాలు అనుభవించిందో చెబుతోంది. భర్త ఆమెని ఎక్కడెక్కడ ఏఏ ప్రదేశాలు తిప్పిందీ చెప్పింది. ఎక్కడ ఏయే రకాల భోజనాలు చేసిందీ చెప్పింది. ఎంత విలా సంగా జీవించిందీ చెపుతూ తిడుతూనే ఉంది.

"పోనీలెండి. మనకెందుకు. పోయా రుగా" అంది పద్మజ.

"పోతే మాత్రం? ఉన్నప్పటి సంగతి కదా నేను చెప్పేది. ఆయన పార్వతిని మహా సుఖపెట్టాడు" అంది రాజ్యం.

పద్మజ తెల్లబోయి చూస్తోంది. పోయిన వాళ్ళని కూడా స్పేర్ చెయ్యకుండా దూషిం చడం రాజ్యం దగ్గరే చూస్తోంది.

"ఏం సుఖపెట్టాడు లెండి" ఆవిడ పోగానే పెళ్లి చేసేసుకున్నాడు కదా? "

"ఆవిడ పోయాక ఏం చేస్తే మాత్రం ఆవిడ చూడొచ్చిందా? ఉన్నప్పుడు సుఖపె ట్టాడు చాలు" అంది రాజ్యం కరుగ్గా.

పద్మజ మౌనంగా ఉండిపోయింది.

రాజ్యం విజృంభించింది.

శ్రీరామ్మూర్తిని తిట్టిపోసింది.

"ఓపిక ఉన్నన్నాళ్ళూ ముగ్గురు పెళ్ళాల్ని పెట్టుకుని ఎంజాయ్ చేశాడు. ఓపిక ఉండ గానే ముగ్గురికీ కాషాయబట్టలు కట్టి వేషం వేస్తున్నాడు వేషం. జనాల మధ్య ఈ సన్యాసి గోల ఏమిటి? అయినా ఆ పెళ్ళా లకి బుద్ధి లేదూ? ఎట్లా పడతారండీ ఈ ఆడవాళ్ళు వెధవలందరి వెంటా? "

"మనమేం చేస్తాం? ఎవరి ఇష్టం వాళ్ళది".

"నీకేమన్నా బుద్ధుందా? ముగ్గురు పెళ్ళాల్ని పెట్టుకుని మన మధ్యే తిరిగాడు. ఇది చట్టవిరుద్ధం అని నీలాంటి వాళ్ళు ఒక ళ్లన్నా గడ్డిపెట్టారా? లేదు. అందుకే అట్లాంటి వెధవలు పేట్రేగిపోతున్నారు" అంది రాజ్యం.

పద్మజ తెల్లబోయింది. పద్మజ శ్రీరా మూర్తితో మాట్లాడింది కూడా తక్కువ. కానీ రాజ్యం మాత్రం వాళ్ల ఇంటికి తరచూ వెళ్లేది. అక్కడ ఉన్న పళ్ళ చెట్ల నుంచి తనకు కావాల్సిన పళ్లు స్వేచ్ఛగా కోసుకునేది. ఆయనతో చనువుగా మాట్లా డేది. కారెక్కి తిరిగేది. పొందే సాయాలు అన్నీ తను పొంది, వేరే వాళ్లను తిడుతుం దేమిటి?

సరే రాజ్యం సంగతి తెలియనిదేముంది అని సరిపెట్టుకుంది.

రాజ్యం వీధిలో ఉన్న సమస్త జనులనీ విమర్శించింది. తర్వాత ఊళ్లో ఉన్న అందర్నీ తిట్టింది. రాజకీయ నాయకుల్ని తిట్టింది. సినిమావాళ్ళని తిట్టింది. భూమ్మీద, జలంలోను, ఆకాశం మీదా ఉన్న సమస్త ప్రాణుల్నీ తిట్టింది. చివరకు సామాజిక న్యాయంలోకి సంభాషణ మార్చింది. తనకి తప్ప ఎవరికీ సామాజిక స్పృహ లేదంది.

చివరగా తన ఆరోగ్యం గురించి చెప్పింది. "ఈ మధ్య మోకాళ్ళ నెప్పులు పట్టుకున్నాయి" జాలిగా చూస్తూ చెప్పింది.

"అయ్యో. తొందరగా చూపించుకోండి" అంది పద్మజ.

రాజ్యం బుస్సున లేచింది.

"నీకేం. చెపుతావు. వెళ్తే మాటలా! మామూలు డాక్టర్ దగ్గరికి వెళ్తే స్పెషలిస్టు దగ్గరికి వెళ్ళమంటాడు. స్పెషలిస్టు దగ్గరికి వెళ్తే రెండు వందలు గుంజి, వంద పరీ క్షలు రాస్తాడు. మాత్రలిస్తాడు, కాప్స్యూల్ అంటాడు. ఇంజక్షన్లు అంటాడు. చివరికి మోకాలు చిప్ప మారుస్తాం, లక్ష రూపా యలు పట్టుకురా అంటాడు. ఎక్కడికి వెళ్లినా గంటలు గంటలు వెయిటింగ్. నీకు వస్తే తెలుస్తుంది. ఎవరికన్నా చెప్పటం అంత తేలిక మరొకటి లేదు" అంది విసురుగా.

ఖర్మ రా బాబూ అని నోరు మూసుకుని కూర్చుంది పద్మజ.

ఇదివరకు కూడా రాజ్యంతో ఇట్లాంటి అనుభవాలు పద్మజకి జరిగాయి. కానీ ఆ అనుభవాలతో పాఠం నేర్చుకోకుండా, ఎప్ప టికప్పుడు ఏదో పొరపాటున చెప్పబో వటం, రాజ్యం విరుచుకుపడటం జరుగు తూనే ఉన్నాయి.

వచ్చిన కొత్తలోనే రాజ్యంతో ఇటాంటి అనుభవం అయింది పద్మజకి. అప్పుడు ఇన్ని బస్సులు లేవు. రాజ్యం భర్త వేరే ఊళ్లో ఉద్యోగం చేసేవాడు. రాజ్యం వాళ్ల

అంతకుముందు భర్తకి ఆఫీసు వాళ్లిచ్చిన క్వార్టర్‌లో ఉండేవాళ్ళు. ఆ క్వార్టర్స్ ఊరికి మధ్యలో ఉండేవి. బోలెడన్ని బస్సులుం డేవి. ఇక్కడ ఇల్లు కట్టుకుని రాజ్యం వాళ్ళు కొన్నాళ్లు అద్దెకిచ్చి, మళ్లీ ఖాళీ చేయించి తామే వచ్చేశారు.

అప్పుడు రాజ్యం వయసులో ఉంది. చుట్టుపక్కల వాళ్లంతా మంచివాళ్లు కాబట్టి అందరి సాయం పొందుతూ, చిన్న పిల్ల లతో హాయిగా గడిపేస్తున్నది. కానీ ఏనాడూ ఎవరికీ కృతజ్ఞతలు మాత్రం తెలి పేది కాదు. తమ మునుపు ఉన్న క్వార్ట ర్‌లో వాళ్ళు చాలా మంచివాళ్ళనీ, తనకు అన్ని సాయాలూ చేసేవాళ్ళనీ, ఆ క్వార్టర్స్ కూడా చాలా సౌకర్యంగా ఉండేవనీ చెప్పేది. రాజ్యం తరచూ కోఠీదాకా వెళ్లి ఏవన్నా వస్తువులు కొనుక్కుని తెచ్చుకు నేది. బంధువుల ఇళ్ళకీ, ఫ్రెండ్స్ ఇళ్ళకీ, సిటికీ వెళ్లి వచ్చేది. దాదాపు రెండు రోజు లకి ఒకసారన్నా అట్లా సిటీలోకి వెళ్లే సందర్భం ఉండేది. క్వార్టర్సులో ఉన్నందు వల్ల రాజ్యంకి చాలా తక్కువ కటింగే అయేది. కానీ రాజ్యం క్వార్టర్సులో ఉండలే కపోయింది. ఇక్కడ ఇల్లు కట్టి, ఇంట్లో అద్దెకుండేవాళ్లు ఇల్లు ఎట్లా వాడుతున్నారో నని బాధపడిపోతూ, నెలకి రెండు మూడు సార్లు వాళ్లమీద దండయాత్ర చేసేది. వాళ్లు ఇల్లు పాడుచేస్తున్నారనేది. చివరికి ఆ అద్దెవాళ్ళని ఖాళీ చేయించి తనే చేరింది.

వచ్చిన కొత్తల్లో ఒకసారి రాజ్యం పద్మ జతో ఒక విషయం చెప్పింది. ఆ రోజు రాజ్యం కోఠికి వెళ్లి వస్తున్నదట. కోఠీలో ఎవరో ఒకతను రాజ్యం వెనకే వచ్చాడు. ఆమె ఒక బస్సు ఎక్కితే అతనూ ఆ బస్సు ఎక్కాడు. అప్పట్లో ఈ కాలనీ నుంచి కోఠీకి మూడు బస్సులు మారాల్సి వచ్చేది. ఆమె తను దిగాల్సిన స్టాప్‌లో దిగితే, అతనూ దిగాడు. రాజ్యం అక్కడున్న ఒక దుకాణం

## కొత్తగాలి...

**కార్పొరేట్ సేద్యగాళ్లు**
**కర్షకుల్ని కాల్చుకు తినే**
**కాస్టీవేటగాళ్లు**

– జి.నరసింహమూర్తి,
హైదరాబాద్

లోకి వెళ్లి సబ్బు కొంటే, అతనూ కొన్నాడు. రాజ్యం బయల్దేరి బస్సు ఎక్కితే అతనూ ఎక్కాడు. రాజ్యం బస్సు దిగితే అతనూ దిగాడు. ఒక బస్సు వచ్చినా రాజ్యం ఎక్క లేదు. అతనూ ఎక్కలేదు. ఇంకో బస్సు వచ్చింది. రాజ్యం ఎక్కింది. అతనూ ఎక్కాడు. రాజ్యాన్ని ఇంటిదాకా ఫాలో అయ్యాడు.

రాజ్యం ఇదంతా చెప్తూ ఉంటే పద్మజ గుండె ద్రవించిపోయింది. పాపం రాజ్యం భర్త టూర్లు తిరుగుతున్నాడు, కాబట్టి రాజ్యంకి ఇట్లా సిటీలో, తిరగాల్సి పనులు తనే చేసుకోవాల్సి వస్తున్నది. ఆమె క్వార్ట ర్సులో ఉంటేనే బాగుండేదేమో. క్వార్ట ర్సులో వాచ్‌మాన్ ఉంటాడు. రక్షణ ఉంటుంది. క్వార్టర్సు ఊరి మధ్యలో ఉన్నాయి. ఎవరన్నా ఫాలో అయినా బాధ పడక్కర్లేదు. ఇక్కడైతే ఊరు బయట అంతా నిర్జన ప్రదేశం. వేళగాని వేళ తిర గాలంటే భయమే.

"అయ్యో, మీరు ఆ క్వార్టర్సులోనే ఉండ కపోయారా. అక్కడ మీకు సేఫ్టీ ఉండేది" అంది పద్మజ. అది కేవలం రాజ్యం మీది అభిమానంతో నిజాయితీగా చెప్పిన సలహా.

అంతే రాజ్యం మండిపడింది.

"నీకేం చెపుతావు. ఇక్కడ మీరంతా హాయిగా సొంత ఇళ్ళల్లో మజా చేస్తుంటే, నేను క్వార్టర్స్‌లో ఉండాలా. చాల్సాలే.

## కొత్తగాలి...

**గుండెకు గుబులైతే మనసు మసకేస్తుంది**

– ఎ.పద్మప్రియ, హైదరాబాద్

పెద్ద చెప్పొచ్చావు" అంటూ విరుచుకుపడింది.

పద్మజ తెల్లబోయింది.

రాజ్యం ఎందుకంత మండిపడుతోంది. తను చాలా నిజాయితీగా, ఆమె పరిస్థితికి బాధపడి, స్పందించి, ఎంతో ఇన్వాల్వ్‌మెంట్‌తో ఇచ్చిన సలహా అది. రాజ్యంకి ఇష్టమైతే పాటించవచ్చు. లేకపోతే అది కుదిరే పని కాదని మానుకోవచ్చు. ఇట్లా మీదపడి తిడుతుందేమిటి?

ఆలోచించాక అర్థమైంది.

రాజ్యంకి తన మాటలు వినే శ్రోత ఒకళ్ళు కావాలి. అంతే. అంతేకాని సలహాలు ఇవ్వకూడదు. ఔననకూడదు. కాదనకూడదు. ఏం మాట్లాడినా తప్పుపడుతుంది. ఏదన్నా యుద్ధం చేస్తుంది.

ఇన్నేళ్ళయింది. కానీ రాజ్యం మాత్రం ఏమాత్రం మారలేదు. అదే మాటతీరు. అవే పుల్లవిరుపు మాటలు. అదే మనస్తత్వం. అదే కుళ్లుబోతుతనం. అదే ఒకర్ని చూసి ఓర్వలేని తనం. ఎన్నాళ్లయినా ఆమెలో మార్పులేదు.

* * *

"మీ బాబుకి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారట కదా" అడిగింది పరమేశ్వర్రావు గారి భార్య.

"అవునండీ" అంది పద్మజ.

"మాకు తెలిసినాయన ఉన్నాడు. ఆయనకి సంబంధాలు కుదర్చటం హాబీ. ఆయనకి చెప్పమంటారా? " అంది ఆవిడ.

"చెప్పండి" అంది పద్మజ.

ఒక్కో సంబంధం చూస్తుంటే అసలు పెళ్ళి అవుతుందా వీడికి అనే భయం కూడా కలుగుతోంది. ఒకవిధంగా చూస్తే ఆడపిల్లల తల్లితండ్రులే నయం అనిపిస్తోంది. వాళ్ళకి నచ్చిన సంబంధం ఉంటే వెళ్ళి స్వేచ్ఛగా మాట్లాడుకోవచ్చు. కానీ మగపిల్లవాడి తల్లితండ్రులు ముందుగా మాట్లాడితే ఎవరూ లెక్క చెయ్యరు. వీళ్ళకేదో లోపం ఉండబట్టే ఇట్లా వచ్చారు కాబోలు అనుకుంటారు. నచ్చిన సంబంధం ఎదురుగా ఉన్నా నోరు తెరిచి అడగలేని పరిస్థితి మగపెళ్ళి వాళ్ళది. అందుకే ఎవరన్నా పెళ్ళి సంబంధం ఉందని చెప్తే సంతోషించాల్సిన పరిస్థితి వచ్చింది.

ఆవిడ ఆయనకి చెప్పినట్లుంది. ఆయన ఆ సాయంత్రమే స్కూటర్‌మీద వచ్చేశాడు.

"పరిచయాలు పూర్తయ్యాక ఆల్బమ్ తెరిచి చూపించాడు. ఒకవైపు అమ్మాయి ఫొటో అతికించాడు. మరోవైపు ఆ అమ్మాయి వివరాలు అన్నీ రాసి ఉన్నాయి.

తర్వాత వెంటనే దాన్ని మూసేశాడు. "ఇట్లా ఉంటుందన్న మాట. సరే మీ వివరాలు చెప్పండి" అన్నాడు. ఉద్యోగం, జీతం ఫ్యామిలీ వివరాలు అన్నీ రాసుకున్నాడు.

"ఫొటో పట్టుకు రండి" అన్నాడు.

మగపిల్లవాడి వివరాలు ఉన్న ఆల్బమ్ ఇంకోటి ఉంది. అందులో ఫొటో అతికించి వివరాలు రాశాడు.

"మీకు కావాల్సిన టైపు సంబంధం ఉందేమో చూసుకోండి. నేను వాళ్ళకి ఫోన్‌చేసి మీ వివరాలు చెప్తాను. మీరు కావాలంటే మీరే వాళ్ళకి ఫోన్ చెయ్యవచ్చును" అన్నాడు.

"మీరే చేసి చెప్పండి" అంది పరమేశ్వర్రావుగారి భార్య.

ఆయన అక్కడి నుంచే ఫోన్ చేశాడు.

పద్మజా వాళ్ళ నెంబర్ వాళ్ళకి ఇచ్చాడు.

"తర్వాత తీరిగ్గా ఫోన్ చేస్తారు" అన్నాడు. పద్మజ కాఫీలు తెచ్చింది. అంతా తీరిగ్గా తాగుతున్నారు.

"ఈ రోజుల్లో ఆడపిల్లలకి కాస్త ఇంజినీరింగ్‌లాంటి చదువు, ఒక మోస్తరు అందం ఉంటే చాలు, తేలిగ్గా పెళ్ళిళ్ళయి పోతున్నాయి. కానీ అదే మగపిల్లవాడి దగ్గర కొస్తే అంత తేలిగ్గా కావటంలేదు. సరే. మనం మానవ ప్రయత్నం చేస్తాం, అంతే. పెళ్ళిళ్ళంటే స్వర్గంలోనే నిశ్చయమైపోతాయి. వాళ్ళకీ, వీళ్ళకీ రాసిపెట్టి ఉంటే ఎవళ్ళూ తప్పించలేరు. ఏదో నేను మానవ సాయంగా చేస్తున్నాను అంతే. రిటైరైపోయాను. నాకు పెన్షన్ వస్తుంది. ఏ ప్రాబ్లమ్స్ కూడా లేవు. ఊరికే ఇంట్లో కూర్చునే బదులు, కాలక్షేపంగా ఉంటుంది, పరోపకారం కూడా అని పెళ్ళి సంబంధాలు చూడటం మొదలుపెట్టాను" అన్నాడాయన.

"మంచిపని చేస్తున్నారు. మాలాంటి వాళ్ళకి ఉపకారం జరుగుతోంది కదా" అంది పద్మజ.

ఆయన పద్మజా వాళ్ళకి తగినట్లుగా మూడు సంబంధాలు చెప్పాడు.

"నేను వాళ్ళకి చెపుతాను. మీకు ఫోన్ చేస్తారు" అన్నాడు.

అందులో రెండు సంబంధాలు వాళ్ళు ఫోన్ చేశారు. ఒక సంబంధం బాబుకీ, అందరికీ బాగా నచ్చింది. అమ్మాయి ఎం.బి.ఏ. చదివి, ఉద్యోగం చేస్తోంది. చామన ఛాయేగానీ మనిషి బాగుంది. మంచి వాళ్ళని అందరూ చెప్పారు.

పెళ్ళి జరిగిపోయింది.

వరలక్ష్మి, పద్మజా అయితే పెళ్ళిలో ఆనందం పట్టలేక కన్నీళ్లు కార్చేశారు కూడా.

బాబుకి నచ్చిన అమ్మాయి, పాపని ప్రేమగా చూసుకునే అల్లుడూ, జీవితంతో తను జరిపిన పోరాటంలో గెలుపు లభించినట్లు అనిపించింది పద్మజకి.

అంతా పొగుడుతున్నారు.




బాబు ఉద్యోగానికి దూరం అవుతుందని వేరే ఇల్లు తీసుకున్నారు. పద్మజకీ, హరనాథ్‌కీ కూడా ఎవర్నీ బలవంతపెట్టడం ఇష్టంలేదు. పిల్లలు పెళ్ళయ్యాక స్వేచ్ఛగా, హాయిగా, వాళ్ళ బతుకు వాళ్ళు బతకాలనే కోరుకున్నారు.

"నాకూ, తనకీ కూడా దూరం" అన్నాడు బాబు సంజాయిషీగా. బాబుకి తల్లిదండ్రులకి దూరం కావాలని లేదు నిజానికి. అతను చెప్పింది ఒక్కటే. ఊరికి మధ్యలో బోలెడన్ని ఫ్లాట్లు, అన్ని సౌకర్యాలతో ఉన్నాయి. ఎంత అద్దె అయినా పెట్టుకునే స్థోమత ఉంది కాబట్టి, పెద్ద అపార్ట్‌మెంట్ అద్దెకు తీసుకుని అంతా కలిసే ఉండవచ్చు అన్నాడు.

"నేను ఆ ఇల్లు విడిచి రాను" అంది పద్మజ. హరనాథ్‌కి కూడా ఇష్టంలేదు. చివరికి బాబు వేరే కాపురం పెట్టుకోవటంతో ఆ సమస్య తీరిపోయింది.

"ఏంటో నీ చాదస్తం. ఇల్లు, ఇల్లు అని పట్టి వేళ్లాడతావు. అదేదో రాజమందిరం అయినట్లు" పిల్లలు నవ్వుతారు.

"నాఇల్లు నాకు రాజభవనం" నవ్వే

## గురువుగారి ఔదార్యం

అసత్యం నిజం

మంగళంపల్లి బాలమురళీకృష్ణ అప్పటికి నిజంగా బాలుడే! ఎనిమిదేళ్ల వయస్సు. గొప్ప సంగీత విద్వాంసుడు పారుపల్లి రామకృష్ణయ్య పంతులు వద్ద శిష్యరికం చేస్తున్నాడు. రామకృష్ణయ్య పంతులు తిరువాయూరు త్యాగరాజ ఆరాధనోత్సవాల్లో పాల్గొనడానికి బాలమురళిని తీసుకెళ్లారు. రామకృష్ణయ్య పంతులు ఆ ఆరాధనోత్సవ సమితి సభ్యులు. అందుచేత ఆయనకు జరిగే గౌరవ మర్యాదలకు కొదవలేదు.

దేశం నలుమూలల నుంచి వందలాది మంది సంగీత విద్వాంసులు సభకు చేరారు. ఒక్కొక్కరే తమ పేరు పిలువగానే విద్వత్ ప్రదర్శన చేస్తున్నారు. ఇదంతా గమనిస్తూ కూర్చున్న బాలమురళి కాలం గడిచిపోయినట్లు బాధపడుతూ గురువుగారి వైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. 'ఈ సముద్రంలో నాకు అవకాశం దొరకునా?' అనేది అతడి బాధ. వెంటనే గురువుగారు ఉత్సవ సమితి కార్యదర్శితో 'నా శిష్యుడు కచ్చేరీ చేసేందుకు ఓ అవకాశం ఇవ్వండి' అన్నారు. కార్యదర్శి, ఇతర సభ్యులు 'ఇదేం బాలానందం కార్యక్రమమా.. ఆ బాలుడికి అవకాశం ఇచ్చేందుకు?' అని ఎగతాళి చేశారు. అప్పుడు ఆయన 'సరే, ఇట్లా చేద్దాం. ఈ సభలో పాడేందుకు ఎట్లాగూ నాకొక అవకాశమిస్తారు. అప్పుడు నేను పాడను. నా శిష్యుడు పాడతాడు. అప్పటికైనా నా శిష్యుని ప్రతిభ మీకర్థమవుతుంది' అన్నారు.



పారుపల్లి రామకృష్ణయ్య పంతులు తన వంతు రాగానే బాలమురళిని కచ్చేరీ చేయమన్నారు. అతడు గురువుగారి ఆశీర్వాదం పొంది, సభకు రెండు చేతులెత్తి మొక్కి త్యాగరాజ కృతిని ఒకదానిని పాడాడు. తన గాన మాధుర్యంతో సభను మత్తులో ముంచెత్తాడు. పాడడం ముగియగానే సభికులంతా చాలాసేపు చప్పట్లు చరిచి మెచ్చుకోలును తెలిపారు.

స్తుంది పద్మజ. ఆమె చిన్ననాటి స్నేహితురాలు కుసుమ తన పిల్లలతో అమెరికాలో ఉంటోంది. కుసుమకు హైదరాబాద్‌లో కాస్త పెద్ద ఇల్లే ఉంది. కానీ ఉన్న ఇద్దరు పిల్లలూ అమెరికాలోనే ఉన్నారు. వాళ్ళు అక్కడే స్థిరపడి పోయారు. కుసుమ భర్త కూడా మరణించాడు. ఇక్కడ కుసుమ ఒక్కత్తే ఉండలేక అమెరికా వెళ్ళిపోయింది. వెళ్ళినా ఎందుకోగానీ మళ్ళీ తిరిగి వచ్చేసింది.

ఒకసారి పద్మజ వెళ్ళి పలకరించింది. "ఇక్కడ ఒకదానివే ఉండాలి కదా" అంది.

"ఏం చేస్తాం. అక్కడ కూడా ఆర్నెలలకన్నా ఉండనివ్వరు. వస్తూపోతూ ఉండాలి. ఇంతలో నాకు ఎలర్జీ పట్టుకుంది. వాళ్ళుండే ప్రాంతంలో చాలా చలి. మంచు కురుస్తూ ఉంటుంది. నాకెందుకో ఆ ప్రాంతం పడలేదు" కుసుమను పద్మజ అప్పుడు పరికించి చూసింది. ఇందాక గమనించలేదుగానీ కుసుమ ఒంటిమీద దద్దుర్లలాంటి పుండ్లు ఉన్నాయి.

"అయ్యో. అక్కడికి వెళ్ళాక ఇలా అయిందా?" అడిగింది పద్మజ.

"లేదు. ముందునుంచే నాకు ఎప్పుడన్నా ఎలర్జీ వస్తే ఇట్లా అయ్యేది. మందులు వేసుకుంటే తగ్గేది. మరీ ఇంత తీవ్రంగా ఉండేదికాదు. కానీ ఇప్పుడు అక్కడ చలి పడక ప్రాబ్లం పెరిగిపోయింది" అంది కుసుమ.

అట్లా ఉంటే పాపం పిల్లలు చాలా బాధ పడ్డారుట. మందులకి లొంగలేదు. కుసుమకి కూడా అక్కడి జీవితం నచ్చలేదు. శుభ్రమైన వెలుతురూ, ఎండ కోసం తపించిపోయింది.

"నేను ఉండలేను బాబూ ఇక్కడ" అని తిరుగు ప్రయాణం కట్టింది.

పిల్లలు కూడా ఏమనలేక ఊరుకున్నారు. ఆ ఎలర్జీవల్ల మనిషి ఎంత బాధ పడుతోందో వాళ్ళు కూడా చూస్తూ ఉన్నారు కాబట్టి ఏం చెయ్యలేక, సరేనన్నారు.

కుసుమ తిరుగు ప్రయాణమై వచ్చింది. ఇల్లు ఎవరికీ అద్దెకివ్వలేదు కాబట్టి శుభ్రం చేయించి, అందులో ఉంటోంది.

పద్మజ ఇంటిని కలియచూసింది. పెద్ద ఇల్లు, మూడు బెడ్‌రూమ్‌లు, కారుషెడ్డు, డైనింగ్ హాల్, డ్రాయింగ్ రూమ్, పెద్ద కిచెన్, స్టోర్ రూమ్, పూజగది, దేనికీ లోటులేదు.

పదిమంది మనుషులు తేలిగ్గా నివసించగల ఆ ఇంట్లో కుసుమ ఒక్కతే ఉండాలి.

"ఎవరినన్నా తోడుగా ఉంచుకోకపోయావా? " అంది పద్మజ.

"ఎవరుంటారు? ఎవరి స్వార్థాలు వాళ్ళవి. ఇవ్వాళ ఒక్కదాన్నే ఉండాలి కాబట్టి నాకు తోడు రండని అడిగితే ఎవరు వస్తారు? మళ్ళీ నీకు బాగైతే నీ దారిన అమెరికా పోతావు, నాకు అప్పుడేది దారి? అంది మా బంధువులావిడ్ని రమ్మని అడిగితే" అంది కుసుమ.

పద్మజ తటపటాయిస్తుంటే కుసుమ గమనించింది.

"ఏదో చెప్పాలనుకుంటున్నావులా ఉంది చెప్పు" అంది.

"ఏంలేదు. రోజులు బాగా లేవు. ఒక్కతెవే ఉన్నావని ఎవరన్నా కనిపెడితే? "

"అంటే? "

"చాలా వింటున్నాం కదా. దోపిడీలూ, హత్యలూ" అంది పద్మజ.

"వింటున్నాం. పేపర్లో చదువుతున్నాం. టీవీలో చూస్తున్నాం. ఒంటరిగా ఉన్నవాళ్ళని దోపిడీగాళ్ళూ, హంతకులూ తేలిగ్గా కనిపెడతారు. ఎప్పుడో ఏ రాత్రి వేళో ఇంట్లోకి చొరబడి కత్తితోనో, స్థోమత ఉన్న దొంగ అయితే పిస్టల్‌తోనో చంపేసి, ఇంట్లో ఉన్నవి మూటగట్టుకుని పోతారు" అంది కుసుమ.

"ఆ... అంటే..."

"అంటే అంతే. నాకు బాధ్యతలేవీ లేవు. నేను ఉండి కూడా చేసేదేమీ లేదు. ఎవడన్నా చంపేసి పోతాడా, పోనియ్యి. ఏం చేస్తాం. చావు ఎట్లా రాసిపెట్టి ఉందో, అట్లాగే జరుగుతుంది. నాకు భయం లేదు" అంది కుసుమ నిర్వికారంగా.

పద్మజ ఆమె కళ్ళల్లోకి చూసింది. ఏ భావం లేని ఆ కళ్ళు పద్మజని భయపెట్టాయి. ఒంటరితనం మనిషికి శాపం. కానీ ఏం చెయ్యగలరు. భార్యాభర్తల్లో ఒకరు మరణించి, మిగిలిన ఒకరూ పిల్లల దగ్గర ఉండలేని పరిస్థితి చాలామందికి ఏర్పడుతుంది. పిల్లలు పట్టించుకోని వాళ్ళు కొందరు. ఈ స్పీడ్ యుగంలో తల్లితండ్రులని తమతోపాటు ఉంచుకునే అవకాశం కూడా కొంతమందికి లేదు. కొంతమందికి తల్లిదండ్రులు తమతో ఉండటం ఇష్టం ఉండదు. ఎవరికి వాళ్ళు హాయిగా ఉండాలనుకోవటంలో తప్పులేదు. కానీ ఇట్లాంటి పరిస్థితిలో ఆ తల్లిదండ్రులు అంటే ఏకాకులైన ఆ తల్లిగానీ, తండ్రిగానీ ఒక్కరిగా మిగిలిపోతే, వృద్ధాప్యంలో ఎంత కష్టంగా ఉంటుంది. యవ్వనంలో అయితే శరీరం బలంగా ఉండటం వల్ల ఎంత కష్టాన్నైనా భరించగల శక్తి ఉంటుంది. కానీ వయసు మళ్ళి ఓపికలేని పరిస్థితిలో ఒంటరితనం

కూడా బాధిస్తుంటే ఎంత కష్టమో, అనుభవించే వాళ్ళకే అర్థమవుతుంది.

కుసుమ నిర్వికారంగా కనిపిస్తున్నా ఆమె కళ్ళల్లో ఏభావం కనిపించకపోయినా, ఆమె మనసు పొరల్లో ఏ మూలనో దాగి ఉన్న దిగులు పద్మజ మనసు కనిపెట్టగలిగింది.

ఎట్లా? ఏంచేస్తే ఇట్లాంటి పరిస్థితి రాకుండా ఉంటుంది.

అత్తా కోడళ్ళకి పడకపోవటమో, ఆర్థికపరమైన ఇబ్బందులో ఇంకే కారణాలవల్లో వృద్ధాప్యంలో ఏకాకులవుతారు. కానీ కుసుమది వింత పరిస్థితి.

"ఇప్పుడు చాలా నయం. చాలా ఏమిటి దాదాపు పూర్తిగా నయం అయింది. ఇదివరకు నా శరీరం ఎంత ఘోరంగా ఉండేదో తెలుసా? దేవుడి దయవల్ల ఇక్కడికి రాగానే అంతా మాయం అయింది" అంది కుసుమ. కుసుమకి మనసులో ఎలా ఉందో కానీ బయటకు మాత్రం బాగానే మాట్లాడుతోంది.

"ఇదుగో ఇవాళ నువ్వు వచ్చావా. ఇట్లాగే ఎవరైనా వస్తుంటారు. మాట్లాడుతుంటారు. లేకపోతే నేనే ఎవరింటికైనా వెళ్ళొస్తాను. ఫోన్‌లో ఫ్రెండ్స్‌తో చుట్టాలతో మాట్లాడుతుంటాను. గుడికిపోయి వస్తాను. ఏదో కాలక్షేపం అయిపోతోంది" అంది కుసుమ.

కుసుమకి శాంతిగా కాలం గడవాలని దేవుణ్ని ప్రార్థించింది పద్మజ.

కుసుమ ఏకాకి జీవనం ఒక్కసారిగా దూరం అయింది.

పిల్లలకి అమెరికాలో ఉద్యోగం. వాళ్ళిక్కడికి రారు. కుసుమ అక్కడికి పోలేదు. ఇది తెగని చిక్కుముడి. దీన్ని ఎవరూ విడదీయలేరు. ఇది అంతా అంతవరకూ అనుకున్న విషయం.

ఇంతలోనే ఊహించని విషయాలు జరిగాయి. కుసుమ పిల్లలిద్దరూ అమెరికాలో మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంతలో ఆర్థికమాంద్యం వాళ్ళ ఉద్యోగాల మీద దెబ్బకొట్టింది. ఇద్దరికీ ఉద్యోగాలు పోయాయి. ఎట్లాగో కష్టపడి కొన్నాళ్ళు నెట్టుకొచ్చారు. ఆ తర్వాత అక్కడ బతకటం కష్టం అనిపించింది. సామాను సర్దుకుని ఇండియాకు వచ్చేశారు. వాళ్ళకి ఇక్కడ కొద్దిరోజులు ప్రయత్నం చేసుకుంటే ఉద్యోగాలు దొరికాయి.

కుసుమ ఒంటరి జీవితం ఒకేసారి మళ్ళీ సందడిగా మారిపోయింది.

కుసుమ కొడుకులు అక్కడ అమెరికాలో ఉన్నప్పుడు ఎవరికివారే వేరే ఊళ్ళల్లో ఉండేవాళ్ళు. ఇద్దరికీ వేర్వేరు సంసారాలు. ఇక్కడ అంతా ఒకే ఇంట్లో ఉంటూ ఉద్యోగ ప్రయత్నాలు చేసుకున్నారు. ఇద్దరు కొడుకులు, కోడళ్ళు, ఇద్దరు మనవలతో కుసుమ నిశ్శబ్ద జీవితం సందడిగా మారిపోయింది.

పద్మజ ఒకసారి వెళ్ళి చూసి వచ్చింది. ఇల్లంతా రణగొణ ధ్వని. మనవలిద్దరూ ఏదో ఆడుకుంటున్నారు. టి.వి. వాల్యూమ్ పెంచి కోడళ్ళిద్దరూ ఏదో మ్యూజిక్ ప్రోగ్రాం చూస్తున్నారు. కుసుమ హడావిడిగా ఏదో వండుతోంది. ఏవో కబుర్లు చెప్తూ పక్కింటావిడ కూడా అక్కడే ఉంది.

"ఆర్థికమాంద్యం వల్ల కూడా కొన్ని లాభాలున్నాయని కొందరన్నారు. ఎడాపెడా ఖర్చు పెట్టేస్తున్న ఉద్యోగులు పొదుపు చెయ్యటం నేర్చుకున్నారు. ఏదీ శాశ్వతం కాదని తెలుసుకున్నారనీ, జాగ్రత్తగా ప్లాన్ చేసుకుంటున్నారనీ ఎవరో రాశారు. అట్లాగే ఈ ఆర్థిక మాంద్యం వల్ల మన కుసుమకి కొడుకులిద్దరూ తమ సంసారాలతో సహా తిరిగి వచ్చారు" అంది పక్కింటావిడ.

కుసుమ నవ్వి ఊరుకుంది.

"మళ్ళీ అక్కడ పరిస్థితి బాగుపడితే వెళ్ళిపోతారేమో? " అంది పక్కింటావిడ.

"వెళ్ళనివ్వండి. నేను అన్నింటికీ ప్రిపేర్ అయి ఉన్నాను. ఇదివరకు ఉన్నట్లే ఒక్క దాన్నీ ఉంటాను. ఎప్పుడేది వస్తే దాన్ని స్వీకరించటం తప్ప మనమేం చెయ్య గలం? " అంది కుసుమ.

పద్మజకి కుసుమ కళ్ళల్లో నిరాసక్తత గానీ, నిర్లిప్తతగానీ కనిపించలేదు. కానీ అదేదో భావం తళుక్కుమని మెరిసినట్ల యింది.

ఏమిటది?

అది జీవితసారాన్ని కాచి వడబోసిన జ్ఞాని కళ్ళల్లో కదిలే భావం. ఎప్పుడు ఏది జరిగితే దాన్ని ఎట్లా సంబాళించుకోవాలో తెలిసిన జ్ఞానం.

పాప, బాబు ఇద్దరూ వాళ్ళ వాళ్ళ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

ఇల్లంటే ఎట్లా ఉండాలో వాళ్ళ ఫ్లాట్స్ చూస్తే తెలుస్తుంది. పద్మజకి ఆ అపార్ట్ మెంట్స్ చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అంత సౌకర్యంగా ఉండే ఫ్లాట్లని చూసి వాటిల్లో నివసించగలుగుతున్నందుకు తన పిల్లల్ని చూసి ఆనందం కలుగుతుంది.

కారు పార్కింగ్, ఇరవై నాలుగ్గంటలూ నీళ్ళు, మార్బుల్ ఫ్లోరింగ్, అధునాతనంగా ఉన్న బాత్‌రూమ్‌లూ, కిచెన్, మంచి పని తనం ఉన్న ఉడ్‌వర్క్, కృత్రిమ రూఫింగ్, ఎక్కడా చిన్న మచ్చగానీ మరకగానీ లేని నున్నటి గోడలు, అంతా అద్భుత ప్రపం చంలా కనిపిస్తుంది. షాండ్లియర్ లైట్లు, కర్టెన్లూ అన్నీ గొప్పగా కనిపిస్తాయి పద్మ జకి. ఎంత గొప్పగా ఉందో ఈ ఫ్లాట్ అని పిస్తుంది. ఇదివరకు గొప్ప గొప్పవాళ్ళకు మాత్రమే అందుబాటులో ఉండే విలాస మైన ఇళ్ళు ఇప్పుడు మధ్యతరగతి వాళ్ళకి కూడా అందుబాటులోకి వచ్చాయా అనిపి స్తోంది.

"ఈ ఫ్లాట్ల సంస్కృతి వచ్చినప్పటి నుంచీ మనిషికీ, మనిషికీ బంధాలు తెగి పోతున్నాయి. ఏమిటో ఈ ఫ్లాట్లు. పక్క గుమ్మంలో వాడిని కూడా ఇష్టమైతే పలక రించటం, లేకపోతే ధడాల్న మూసుకుని కూర్చోవటం, ఈ ఆటోమేటిక్ లాకింగ్ సిస్టమ్‌లో అసలు తలుపు తెరిచి ఉందో లేదో కూడా తెలీదు. మొన్న ఒక ఫ్లాట్‌లో అయితే ఆ ఇంట్లో ఆవిడ్ని చంపి ముక్కలు చేశారుట. ఎప్పుడో మరీ అసలు ఫోన్ కూడా చెయ్యటం లేదేంటని బంధువులెవ రికో అనుమానం వచ్చి చూస్తే, ఆటోమే టిక్ లాకింగ్‌లో అసలు తాళం వేశారో లేదో తెలీదు. పొరుగిళ్ళ వాళ్ళు మాకు తెలియదన్నారు. చివరికి కాలింగ్ బెల్ కొట్టి కొట్టి విసుగుపుట్టింది వాళ్ళకి. ఫోన్

## ఏమీ లేకపోతే ఎలా?

ఆత్రేయపురం (కోనసీమ)లో వున్న 'స్నేహలత' సాంస్కృతిక సంఘం వారు ఒక సారి 'ఏకోదరులు' బాపు, రమణలను ఆహ్వా నించారు. లుంగీ కట్టుకొని కార్యక్రమానికి హాజరైన ముళ్ళపూడి వెంకటరమణను ఓ సభ్యుడు 'అదేమిటండీ, లుంగీతో వచ్చేశారు?' అని కొంచెం ఆశ్చ ర్యంగా అడిగాడు.



దానికి ముళ్ళపూడి గారు 'బొత్తిగా ఏమీ కట్టుకోకుండా వస్తే బాగుండదని!' అని జవాబిచ్చారుట!

## ఒక్కడినే చేస్తున్నా..

ఒకసారొక నిర్మాతగారు భారీచిత్రం ఒకటి తలపెట్టి బాపుని దర్శకుడిగా నిశ్చయించి ఒక ప్రకటన చేశారు. 'ఈ సబ్జెక్ట్ బాపుగారు ఒక్కరే తీయగలరు' అని. ఆ వార్తని ఒక మిత్రుడు బాపు దృష్టికి తీసుకురాగా, ఆయన ఛలోకి.. 'నిజమే సార్! ఒక్కణ్ణే చేస్తున్నా అసి స్టెంట్‌ని కూడా ఇవ్వలేదు'

చేస్తే పలకలేదు. అప్పుడు ఇంక ఏదో జరిగి ఉంటుందని ఖరారు చేసుకుని, పోలీస్ రిపోర్ట్ ఇచ్చారు. పోలీసులు వచ్చి తలుపులు తీసి, 'పాపం ఆవిడ్ని చంపి ముక్కలు చేసిపోయారు' అని కనిపెట్టారు. చూశారా, ఎంత ఘోరమో" రమ్య అత్తగారు చెప్పింది.

"అవున్లెండి" అని ఊరుకుంది పద్మజ. కానీ రమ్య ఊరుకోలేదు.

"ఏమో. నాకీ ఫ్లాట్ల కల్చరే నచ్చుతుంది. లేకపోతే ఏ మారుమూలనో ఇల్లు తీసుకోవాల్సి వస్తుంది. ఈ ఫ్లాట్లవల్ల ఒకేచోట వందల అపార్ట్‌మెంట్స్ కట్టడం వల్ల కావల్సినచోట ఇల్లు తీసుకోవచ్చు. సొంతిల్లు, ఇండిపెండెంట్ ఇల్లు అని మేం ఏం సుఖపడ్డాం" అనేసింది.

పద్మజ మనస్సు చివుక్కుమంది.

"ఏంటి రమ్యా అట్లా అంటావ్. సుఖపడక ఏం నష్టపోయాం? కొద్దిగా కష్టపడ్డాం. అంతే కానీ ఏదో నష్టపోయినట్లు అంటావేంటి ఎప్పుడూ" అంది.

"కొద్దిగా కష్టపడ్డామా? స్కూల్‌కి వెళ్ళటానికి కూడా ఎంత కష్టపడ్డాం. నీకు ఏం తెలుసు? అంతదూరం నడిచివెళ్తే బస్‌స్టాప్ వచ్చేది. అక్కడ్నుంచి రష్‌గా ఉన్న బస్‌లో ప్రయాణం చేసి వెళ్ళేవాళ్ళం. వచ్చేటప్పుడు చూడాలి. తోటకూర కాడల్లా వడిలిపోయి వేళ్ళాడిపోతూ, బస్‌కోసం పరుగెత్తి, ఆ తర్వాత బస్ దిగి కాళ్ళీడ్చుకుంటూ నడిచి వచ్చేసరికి ఏడుపు వచ్చేది. మా ఫ్రెండ్స్ ఇంటికీ, షాపింగ్‌కీ వాళ్ళకి తోచినప్పుడు తిరిగేవాళ్ళు. మనం ఒక్కసారి ఇంట్లోకి చేరామంటే ఇక ఆరోజు కార్యక్రమాలు బంద్. హు... ఏంటోగానీ నాకా ఇల్లుమీద అటాచ్‌మెంట్ లేదు..." అన్నది రమ్య.

"నాకూ అంతే" అన్నాడు బాబు.

వాళ్ళ మాటలకి రమ్య అత్తగారు నవ్వేసింది.

"ఏంటో ఈ పిల్లలకి ఇంటిమీద అటాచ్‌మెంట్ లేదండీ. మా ఇంటిమీద అంటే మా అమ్మావాళ్ళిల్లు నాకిప్పటికీ ఆప్యాయంగా ఉంటుంది. ఆ పరిసరాలూ, నేను ఆడుకున్నచోటూ అన్నీ జ్ఞాపకమున్నాయి" అంది పద్మజ.

"మా అక్కయ్య పిల్లల్ని చూడాలి మీరు. వాళ్ళు అమెరికాలో ఉంటారు. ఇక్కడికొస్తే సౌకర్యాలు లేవని అమ్మగారింట్లోగానీ, అత్తగారింట్లోగానీ దిగరు. వాళ్ళు నేరుగా హోటల్లోనే దిగుతారు. అక్కడే లగ్జరీ కార్ ఏర్పాటు చేసుకుని ఊళ్ళో తిరుగుతారు. ఏదో బంధువులింటికి వచ్చినట్లే అమ్మగారింటికి వస్తారు. వాళ్ళే కాదు. చాలామంది అంతే. వాళ్ళ ఇదే వాళ్ళది. ఏదీ పట్టదు. దేనిమీదా ఏ భావం ఉండదు" అంది రమ్య అత్తగారు.

"అట్లా ఎందుకనుకోవటం. మీరు మాత్రం ఇన్ని కబుర్లు చెపుతున్నారు గానీ మీ పల్లెటూళ్ళకి వెళ్ళి ఉండగలరా? సుఖాలకి అలవాటు పడటం చాలా తేలిక. ఒకసారి సుఖం అలవాటయ్యాక ఇక కష్టపడటం వీలుకాదు. మరి అదేవిధంగా సుఖంగా ఉంటే వీలున్నప్పుడు ఉంటారు. మరీ వీల్లేకపోతే సర్దుకుపోతారు" అంది రమ్య.

★ ★ ★

పిల్లలు ఎవరి దోవన వాళ్ళు వెళ్ళారు. ఎప్పుడైనా వస్తుంటారు. అంతా ఒకే ఊళ్ళో కాబట్టి కలవటానికి వీలుంటుంది.

హరనాథ్ రిటైర్ అయిపోయాడు.

అప్పుడప్పుడూ కూర్చుని జీవితం గురించి మాట్లాడుకుంటూ ఉంటారు.

"నిన్నగాక మొన్న ఈ ఇంటికి వచ్చినట్లనిపిస్తుంది. అప్పుడే ఎన్నేళ్ళు గడిచిపోయాయో" అని ఆశ్చర్యపోతారు.

"ఏదో జీవించటం అంటే జీవించేశాం

అంతే..." అనుకుంటుంది పద్మజ.

తన జీవితం గురించి ఆలోచించుకుంటుంది. ఎంతసేపూ తన ఇల్లు, పిల్లల్ని చూసుకోవటం, చెట్లకి నీళ్ళు పోసుకోవటం, ఆకులు ఎండిపోతే తీసేయటం, కొత్త చెట్లు పెట్టటం, ఇల్లు సర్దుకోవటం, ఎంతసేపు తలచుకున్నా ఇవే తన జీవితంలో అనుభవాలు, అనుభూతులు, ఇంకేం లేవు.

"ఇంకేం ఉండాలి? ప్రతివాళ్ళూ ఇట్లాగే ఉంటారు. మామూలుగా జీవితం గడిపేస్తారు. ఒకళ్ళకి చెడు చెయ్యకుండా బతికాం. ఎవరన్నా అడిగితే మరీ తనకు మాలిన ధర్మం కానంతవరకూ సాయం చేశాం. నాకైతే నా జీవితం మీద తృప్తి ఉంది" అంటాడు హరనాథ్.

"అది కాకుండా ఇంకేమన్నా చేద్దామని అనిపిస్తోంది" అంది పద్మజ.

"నాకైతే ఏమీ చెయ్యాలనిపించటం లేదు. ఉద్యోగంలో పని చేసిచేసి విసుగొచ్చేసింది. ఇప్పుడు హాయిగా విశ్రాంతి తీసుకుంటాను" అన్నాడు హరనాథ్.

"నిజమే..." అంది పద్మజ. చండశాసనుడి లాంటి ఆఫీసర్ చేతిలో, చిరుద్యోగం చేస్తూ హరనాథ్ ఎన్నో ప్రయాసలకూ, ఒత్తిడికీ లోనయ్యాడు. కానీ ఎప్పుడూ ఏ మాత్రం బాధపడ్డట్లు కనిపించేవాడు కాదు.

పద్మజ ఇంకా ఆలోచించటం చూసి అతనికి బాధ కలిగింది.

"పాపం. నువ్వు మాత్రం ఏం సుఖపడ్డావు? పడ్డ కష్టం చాలు. హాయిగా రెస్ట్ తీసుకో"

పద్మజ తల ఊపి ఊరుకుంది.

"అయినా ఏం చేద్దామని? ఆలోచించు" అన్నాడు అతను.

ఆలోచిస్తే పద్మజకు ఏమీ తట్టటం లేదు. ఏం చెయ్యాలి?

రంగమణిలాగా ఒక పాపనో, బాబునో తెచ్చుకుని, సంరక్షణ భారం వహించటమా?

అమ్మో, అది కుదిరే పనేనా? భర్త అన్నట్లు తను చేసి చేసి అలసిపోయి ఉంది. మళ్ళీ ఇప్పుడు పిల్లల్ని స్కూల్‌కి పంపి, వాళ్ళచేత హోంవర్క్ చేయిస్తూ, పొద్దున్నే లేచి వాళ్ళ పనులన్నీ చూస్తూ ఉండటం తనవల్ల అయ్యే పనికాదు. తీరా ఎవరినన్నా తీసుకొచ్చి, నాలుగు రోజులయ్యాక నా వల్ల కాదు అంటే బాగుండదు. అందువలన పిల్లలెవరినన్నా తెచ్చుకుని పోషించటం తనవల్ల అయ్యేపని కాదని తేలిపోయింది.

ఇంక పోనీ, సునీతలా జంతు సంరక్షణ? ఊహూ, తనవల్ల కాదు. ఏదన్నా పార్ట్‌టైమ్ లాగా ఒక గంట వాటికేమన్నా చెయ్యటం అయితే తనవల్ల అవుతుందేమో గానీ పూర్తి సంరక్షణ భారం తనవల్ల కాదు.

పోనీ పెళ్ళి సంబంధాలు చూసిపెట్టే పని కూడా తనవల్ల కాదు. ఎవరన్నా ఒక మాట అంటే తను భరించలేదు. పెళ్ళి సంబంధాలు చూసిపెట్టటం రిస్క్‌తో కూడిన పని. ఎవరు ఎట్లాంటి వాళ్ళో తెలియదు. పెళ్ళి కుదిర్చాక వాళ్ళు ఏదన్నా బాధలు పడి 'నువ్వు కుదిర్చావు, ఇట్లా అయిందంటే' తను తట్టుకోలేదు.

పోనీ భక్తి మార్గంలో పడదామంటే, పూర్తిగా భక్తి కూడా లేదు. ఏదో యాంత్రికంగా జపం చెయ్యటం, పూజ చెయ్యటం తనవల్ల కాదు. కాలక్షేపంగా భక్తిని స్వీకరించే స్థితిలో తను లేదు. పూర్తి వైరాగ్యం లేదు.

మరేం చెయ్యాలి?

సత్యలాంటి వాళ్ళను చూస్తే పద్మజకి ఆశ్చర్యం అనిపిస్తుంది. సత్య మారనే లేదు. ఇప్పటికీ ఎక్కడికి వచ్చినా పూర్తి మేకప్‌తో, మంచి చీరెతో మాత్రమే

వస్తుంది. తను ఎట్లా కనిపించాలి, ఇంకా ఏమేం చెయ్యాలి అని నిరంతరం ఆలోచిస్తూనే ఉంటుంది.

పంకజం, రాజ్యం లాంటి వాళ్ళు కూడా మారలేదు. వయసు మీద పడుతున్నా వాళ్ళ ద్వేషాలూ, అసూయలూ చల్లారలేదు.

భర్త అన్నట్లు ఏ కుళ్ళు బుద్ధులూ లేకుండా, ఏదో మామూలుగా గడిపేయటమే మంచితనం అనే లెవెల్లో ఉన్నాయి జీవితాలు.

పద్మజ కుటుంబం, పిల్లలూ కలిసి అప్పుడప్పుడూ గుళ్ళూ, గోపురాలూ, ఒక్కోసారి పిక్నిక్‌కూ వెళ్ళటం చేస్తున్నారు. నెలకి ఒక్క అదివారం అయినా అంతా కలిసి ఎక్కడికన్నా వెళ్ళి వస్తారు.

రమ్యకీ, బాబుకీ కూడా కార్లు ఉన్నాయి. కానీ ఎక్కడికన్నా వెళ్ళాలంటే సుమో లాంటిది మాట్లాడుకుని వెళ్తున్నారు.

"భువనగిరి దగ్గర మా ఫ్రెండ్ తోట కొన్నాడు. రకరకాల చెట్లూ, కొలనూ చాలా బాగుంటుందిట. మనం అక్కడికి పిక్నిక్‌లా వెళ్ళవచ్చు. దగ్గరల్లోనే ఒక పురాతన దేవాలయం కూడా ఉందన్నాడు. పొద్దున వెళ్ళి రాత్రికి వచ్చేయవచ్చు" అన్నాడు బాబు.

అంతా సరే అన్నారు.

ఆ శనివారం పాపకీ, బాబుకీ కూడా సెలవు. శనివారం వెళ్ళి వచ్చేస్తే, ఆదివారం ఊళ్ళోనే ఉండి విశ్రాంతి తీసుకోవచ్చు.

పొద్దున్నే బయలుదేరి వెళ్ళారు. పులిహోర, పూరీలు, పళ్ళు, స్వీట్లు అన్నీ తీసుకువెళ్ళారు.

తోటలో తిరుగుతూ ఉంటే కాలమే తెలియలేదు. ముఖ్యంగా కొలనులో ఉన్న తామరపూలు చూసి, ఆడవాళ్ళు మైమరచిపోయారు.

"ఎంత బాగున్నాయో" అంది పద్మజ.

"అవునమ్మా. మా ఫ్లాట్‌లో కొన్ని గులాబీ చెట్లు, క్రోటన్స్ కుండీల్లో ఉన్నాయి. కానీ ఈ తామరపూలు చూస్తుంటే ఇవి కూడా ఇంట్లో ఉంటే బాగుంటుందనిపిస్తోంది" అంది రమ్య.

"ఇంట్లో పెద్ద టబ్ ఉంటే వాటిల్లో వేసి పెంచుతారు కొందరు" అంది కోడలు.

"నిజంగానా? "

"అవును. కొన్ని మొగ్గలూ, వేళ్లతో ఉన్న తీగెలూ అడిగి తీసుకుందాం. వస్తే మంచిదే. లేకపోతే ఈ మొగ్గలన్నా తెల్లారేసరికి విచ్చుకుంటాయి" అంది కోడలు.

"వెళ్లేటప్పుడు అడిగి తీసుకోవాలి"

ఒక్కో చెట్టునీ చూస్తూ, వాటి మధ్య తిరుగుతుంటే సమయం తెలియనే లేదు.

తోటమాలిని అడిగి తామరపూలు, తామర తీగె తీసుకున్నారు. వాటిని కవర్లో పెట్టుకున్నారు.

"ఎంతైనా ప్రకృతిలో గడపటం వేరు" అంది పద్మజ.

"అందుకే కదా మన పూర్వీకులు వనభోజనాలు అని పెట్టారు. ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకుని ప్రకృతి మధ్యలో కాస్సేపైనా గడుపుతారని వాళ్ల అభిప్రాయం. కొన్ని చెట్ల మధ్య తిరగటం ఆరోగ్యానికి కూడా మంచిది. వాటికి ఔషధ విలువలుంటాయి" అన్నాడు హరనాథ్.

వరలక్ష్మికి బాగా ఓపిక తగ్గిపోవటంతో ఎక్కువ తిరగలేకపోతోంది. ఆమె ఒకతెను వదిలి వెళ్లలేక ఆమెను కూడా తీసుకుని తిరుగుతున్నారు. రాగానే చాప పర్చుకుని పడుకోవటమో, వ్యాన్‌లోనే ఉండిపోవటమో తప్ప వరలక్ష్మి ఎక్కువ తిరగదు.

"చీకటి పడిపోతోంది. బయల్దేరాలి" అన్నాడు బాబు.

అంతా బయల్దేరారు.

వ్యాన్‌లో ఎక్కారు. రమ్యా, అల్లుడూ,

## కొత్తగాలి...

**తెలం 'గానమో'**
**సమైక్య 'రాగమో'**
**మధ్య మండుతున్న**
**సగటు మనిషి**

*- గంపా శ్రీదేవి, సింహాచలం*

బాబు, కోడలు, వరలక్ష్మి, హరనాథ్, పద్మజ అంతా ఎక్కాక వ్యాన్ కదిలింది.

రమ్య కొలను దగ్గర కోసిన తామర పూలు, తామర తీగె ఉన్న కవరు భద్రంగా ఒళ్లో పెట్టుకుంది.

"నీకు అక్కర్లేదా తామర పూలు? " హర నాథ్ పద్మజని చూసి హాస్యమాడాడు.

కోడలూ, అల్లుడూ నవ్వుతుంటే "ఆవిడకి చెట్లంటే ప్రాణం. ఈ పద్మాల గురించి ఆలోచన ఎందుకు రాలేదా అని నాకు ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు.

"ఆవిడ స్వయంగా పద్మజగారు. ఇంకా పద్మాల అవసరం ఎందుకని అత్తయ్యగారు పద్మాల గురించి ఆలోచించి ఉండరు" కోడలు హాస్యం ఆడింది.

అంతా నవ్వుతున్నారు.

వ్యాన్ కదిలింది. అంతా ఏదో మాట్లా డుతూ ఉంటే కాలం తెలియనేలేదు. వ్యాన్ హైదరాబాద్ పొలిమేరల్లోకి ప్రవేశించింది.

ఇవాల్టికి మాకు ఇవన్నీ చూసే అవకాశం కలిగింది. దగ్గర్లోనే ఉన్నా ఎప్పుడూ చూడనే లేదు" అన్నాడు అల్లుడు.

"అవును. ఇంక ఇంటికెళ్లి రెస్ట్ తీసుకో వాలి. రేపు ఆదివారం. హాయిగా లేట్‌గా లేచి, తీరిగ్గా పనులు చేసుకోవచ్చు" అంది కోడలు.

"రమ్యా. ఇవాళ అందరం మన ఇంట్లోనే గడుపుదాం. రేపు సాయంత్రం వరకు ఉండి వెళ్లిపోండి" అంది పద్మజ.

"అబ్బా. ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోతాం" అంది రమ్య.

"అవును అత్తయ్యగారూ. మీరు కూడా అలిసిపోయి ఉన్నారు. హాయిగా రెస్ట్ తీసుకోండి" అంది కోడలు.

"మీకందరికీ చేసి పెట్టటంలోనే నాకు విశ్రాంతి, ఆనందం" అంది పద్మజ.

రమ్య అయిష్టంగా చూస్తోంది. బాబు కూడా అదే ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాడు.

"మీకంతా ఏం అటాచ్‌మెంట్స్ ఉండవా? మీ బాల్యం, మీరు పెరగటం అంతా ఆ ఇంట్లోనే జరిగింది" అంది పద్మజ.

"అదీ సంగతి. పాపం అమ్మకి మన మీద కన్నా ఆ ఇంటిమీదే ప్రేమ. మనం కూడా ఆ ఇంటిని ప్రేమించాలంటుంది".

"అవున్రా తండ్రీ. నాకా ఇల్లంటే ప్రాణం. నాకు మీరంటే కూడా ప్రాణం. మీరంతా ఆ ఇంట్లో తిరుగుతుంటే చూడాలని ఆశ" అంది పద్మజ.

"అమ్మ కోరిక కాదనటం ఎందుకు? " అన్నాడు బాబు. వ్యాన్‌ని ఇంటివైపు తీసు కెళ్లమని చెప్పారు.

డ్రైవర్ వ్యాన్ పోనిస్తున్నాడు.

అంతా ఏవో కబుర్లు చెప్తున్నారు.

పద్మజా వాళ్ల ఇంటివైపుకి వెళ్లే దారిప ట్టాడు డ్రైవర్. స్పీడుగా పోతున్నది వ్యాన్.

ఇంతలో ఎదురుగా ఒక లారీ వేగంగా వస్తోంది. ఏం జరుగుతున్నదో తెలిసేలో పలే..

ఆ లారీ వేగంగా వచ్చి పద్మజా వాళ్ల వాహనాన్ని ఢీ కొట్టింది.

ఎదురుగా భూతంలా వస్తున్న వాహ నాన్ని గుర్తించింది పద్మజ. తమని నిలు వునా మింగేయబోతున్న దెయ్యంలా ముందుకు ఉరికిన లారీ చెవులు పగిలిపో తున్నట్లున్న చప్పుడు, కళ్లు మిరిమిట్లు గొలుపుతున్నట్లున్న లైట్ల వెలుగు, కళ్లు తిరిగి రక్తం కక్కుకునేటంత భయం

కొలిపే దృశ్యం.

పద్మజ తెరిచిన కళ్లు తెరుచుకునే ఉన్నాయి.

ఏం జరిగిందో కూడా తెలియనంత అయోమయం.

చెవిలో హోరు, కళ్ల ముందు వేల నక్ష త్రాలు మెరుస్తున్నట్లు వెలుగు. మిరుమిట్లు గొలుపుతున్న వెలుగు. డ్రైవర్, హరనాథ్, బాబు, కోడలు, రమ్య, భర్త, వరలక్ష్మి అంతా చచ్చిపోయారు.

సీట్లల్లో కూర్చున్నవాళ్లు కూర్చునట్లే ఉన్నారు. ముందువైపు మొత్తం నుజ్జు నుజ్జు అయిపోయింది. వెనకనున్న పద్మ జ, వరలక్ష్మిలకి పెద్దగా దెబ్బలు తగల లేదు. కానీ వరలక్ష్మికి షాక్‌తో గుండె ఆగి పోయింది.

క్షణాల్లో పెద్ద గుంపు పోగయింది. పోలీసులకి ఫోన్ చేశారు. అంబులెన్స్‌లు వచ్చాయి.

★ ★ ★

పద్మజ స్థాణువులా కూర్చుంది.

మెదడూ, శరీరం, ఆత్మ అన్నీ మొద్దుబా రిపోయినట్లు అనిపిస్తోంది. అపాదమ స్తకం, మనసూ, మెదడూ, అన్నీ ఒకే ఒక అచేతన స్థితిలో ఉన్నాయి. ఎవరెవరో ఏదేదో మాట్లాడుతున్నారు. ఏదీ అర్థం కావడంలేదు. ఏదీ తెలియటం లేదు.

అంతా జాలిపడుతున్నారు. ఓదారుస్తు న్నారు. కొందరు ఏడుస్తున్నారు. కొందరు కౌగిలించుకుని బావురుమంటున్నారు. ఏదీ తెలియటం లేదు. దేన్నీ ఆమె గ్రహించే స్థితిలో లేదు.

కాస్సేపయ్యాక అందరూ ఆమె స్థితిని గ్రహించారు. "పద్మా.. పద్మా" తట్టిలేపింది తల్లి.

పద్మజ పలుకలేదు.

పద్మజ అక్కా, ఆడపడుచూ కూడా తట్టారు.

పద్మజ పలుకలేదు.

"అయ్యో.. ఏమైందే?" తల్లి బావురు మంది. అక్కడే ఉన్న డాక్టర్ ఒకాయన కంగారుగా వచ్చి పరీక్ష చేశాడు.

"ఏం లేదండీ. షాక్ అయినట్లున్నారు. ఎందుకైనా మంచిది. నర్సింగ్ హోమ్‌లో చేర్పిస్తే సరి. సైకియాట్రిస్ట్ కూడా చూస్తాడు" అన్నాడు. పద్మజ కళ్లు తెరిచి చూస్తోంది, కానీ దేనికీ ఉలుకూ పలుకూ లేదు.

"షాక్ గాక ఏమవుతుంది? నిండు కుటుంబం. ఒక్కసారిగా నిలువునా కూలి పోయింది"

"కలికాలం. ఘోరకలి. ఏం ఘోరం. ఎవరు మాత్రం తట్టుకోగలరు. అంతా ఖర్మ".

పద్మజ తల్లికి కూడా పిచ్చి ఎక్కే స్థితి వచ్చింది. ఆవిడకి డెబ్బై ఏళ్లు దాటాయి. బి.పి, షుగరూ ఉన్నాయి. ఆవిడని ఉంచు కుందుకే కోడళ్లు రోజూ పోట్లాడుతున్నారు. ఇప్పుడు పద్మజ గతేంటి? ఆమె సంగ తేంటి? ఎవరు పట్టించుకుంటారు? ఆమె బాధ్యత ఎవరు మోస్తారు?

"అందరూ పోయి ఇది మాత్రం ఎందుకు బతికినట్లు? ఇదీ చచ్చి ఉంటే పీడా పొయ్యేది. ఇప్పుడు ఉన్న ఖర్మ చాలక పిచ్చి ఒకటి ఎక్కించుకుని కూర్చుంటే దీన్ని ఎవరు చూస్తారు?" ఆవిడ ఘొల్లుమంది.

"ఊరుకోమ్మా.. ఊరుకో. అప్పుడే పిచ్చీ గిచ్చీ అని భయపడకు. ఏమీ కాలేదు. అంతా బాగానే ఉంటుంది" అంతా ఓదా ర్చారు.

"ఏమిటో ఈ రోజులు. బయటకు వెళ్లిన వాళ్లు మళ్లీ క్షేమంగా తిరిగొస్తారని గ్యారంటీ లేదు".

"లోపల ఉన్నవాళ్లు మాత్రం క్షేమంగా ఉంటారని గ్యారంటీ ఏంటి? ఎన్ని చద



వటం లేదు. ఎన్ని వార్తలు చూడటం లేదు. ఇంట్లో క్షేమంగా కూర్చున్నవాళ్ల నెత్తిన ఏ విమానమో, హెలికాప్టరో దూసుకొని వచ్చి పడుతుంది. లేకపోతే ఏ లారీనో అదుపు తప్పి ఇంట్లోకి దూసుకొస్తుంది. దేనికీ గ్యారంటీ లేదు."

"ఎప్పుడు ఏ తీవ్రవాది బాంబు పేలుస్తాడో తెలియదు. ఎప్పుడు ప్రభుత్వం కూలిపోతుందో తెలియదు"

"..అనిశ్చితి. దేనికీలేదు సెక్యూరిటీ "

"అయినా మన అహంకారాలు ఆగవు. అన్నీ శాశ్వతం అనుకుంటాం. విర్రవీగుతాం. ఒకరోజు ఫెడీల్మని ఏదో జరుగుతుంది. విలవిలలాడుతాం"

"ఏంటో జీవితాలు? ఎందుకూ పనికిరానివి మన తెలివితేటలూ, జాగ్రత్తలు. ఏదీ శాశ్వతం కాదు" అంతా వైరాగ్యం మాట్లాడుతున్నారు. వేదాంతం బోధిస్తున్నారు.

పద్మజని లేపి, కార్లో ఎక్కించారు. పద్మజకి ఏమీ తెలియటం లేదు.

## 11

పద్మజకి జరిగింది తెలియటానికి చాలా కాలం పట్టింది. పద్మజ ఆ విధమైన షాక్‌లో ఉండగానే అందరికీ అంత్యక్రియలు జరిగిపోయాయి.

డాక్టర్ల శ్రమ, ఆధునిక వైద్య మహిమ కలిసి పద్మజ మామూలు మనిషైంది. ఆ షాక్‌లోంచి బయటపడ్డాక ఒక్కసారిగా వెక్కివెక్కి ఏడ్చింది.

పద్మజ నేలమీద దొర్లుతూ ఏడుస్తుంటే అందరికీ గుండె తరుక్కుపోయింది. కానీ



ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు. ఎంత ఏడిస్తే అంత మంచిదని డాక్టర్లు చెప్పారు.

ఎంత ఏడ్చినా బాధ తీరేట్లు లేదు.

పద్మజ శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. కళ్ళల్లోంచి నీళ్ళు ధారలుగా కారిపోతున్నాయి.

"అయ్యో.. ఎంత ఘోరం జరిగింది. నాకెవ్వరూ లేరు" ఏడుస్తూనే ఉంది.

తనెందుకు బతికినట్లు? అందరితో పాటు తనూ పోయి ఉంటే బాగుండేది. అయ్యో దేవుడా, నన్ను మాత్రం ఎందుకు బతకనిచ్చావు? నన్ను చంపేసి ఉంటే ఎంత బాగుండేది. తనమీద తనకే కోపం, దుఃఖం, జాలి, అసహ్యం కలిగాయి.

అసలు ఆ ఇంటిమూలంగా కదూ ఇదంతా జరిగింది. ఒక్కసారిగా ఆ ఇంటి మీద కోపం, అసహ్యం కలిగాయి.

తాను ఇంటికి వెళ్దాం అనకపోయి ఉంటే ఎంత బాగుండేది. వాళ్ళదారిన వాళ్ళు వెళ్లి పోయి ఉండేవాళ్ళు. అనవసరంగా ఇటొచ్చి యాక్సిడెంట్ పాలయ్యారు. ఆ ఇంటిని తల్చుకుంటేనే భరింపరాని అసహ్యం, ద్వేషం కలుగుతున్నాయి.

ఆ ఇంటికోసం ఎంత తాపత్రయ పడింది. కానీ అది ఏ సుఖం మిగిల్చింది?

అది కడదామనుకున్న నాటినుంచీ ఏదో ఒక సమస్య. ఇటుక ఇటుక పేర్చటానికి వల్లమాలిన శ్రమ. దౌర్భాగ్యపు ఇల్లు, దాన్ని కట్టేకన్నా ఎక్కడన్నా అద్దెకి ఉండి పోతే ఎంత బాగుండేది.

ఆ ఇంటికోసం తను వల్లమాలిన శ్రమ పడింది చాలక అత్తగారిని కూడా కష్టపె ట్టింది. ఇద్దరూ కలిసి పునాది తవ్వారు. కాంక్రీట్ కలిపారు. పునాదిరాళ్ళు

మోశారు. అయ్యో అత్తయ్యా మిమ్మల్నెంత శ్రమ పెట్టాను" పద్మజ కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నాయి.

ఊరికి మూలన ఉన్న ఇల్లు, ఏ సౌక ర్యాలూ లేక పిల్లలెంత బాధపడ్డారు? పాపం వాళ్ళు ఒక్కళ్లే ఉన్నప్పుడు ఒకరోజు పాములు కూడా వచ్చాయి. అయ్యో పాపం. వాళ్ళెంత బెదిరిపోయి ఉంటారో. వాళ్ళనేమన్నా చెప్పుకోనిచ్చిందా తను. ఏం పర్వాలేదని ప్రతిదాన్నీ కొట్టి పారేసేది. పాములూ, కుక్కలూ, సమస్త జంతుజా లాన్నీ ఎదుర్కొంటూ ఆదిమ మానవుల్లా జీవించేట్లు చేసింది తను. ఏం ఇల్లు లేక పోతే? పాడు ఇల్లు, మారుమూలనుంచి స్కూళ్లకీ, కాలేజీలకీ వెళ్లలేక వాళ్ళు ఎన్ని అవస్థలు పడ్డారు? అయ్యో, ఎంత మూర్ఖు రాలు తను. ఒక్క ఇల్లు, అందులో ఉండా లని తాపత్రయపడుతూ, దానికోసం అందర్నీ కష్టపెట్టింది. దౌర్భాగ్యపు ఇల్లు!

ఆరోజు బాబీ వాళ్ళు తాకట్టు పెట్టు కుంటా నంటే ఒప్పుకోలేదు తను. అలా చేస్తే బాబీకి ఉద్యోగం వచ్చి ఉండేది కదా.

దీపారాధన స్వామి ఇల్లు తాకట్టు పెట్టి డబ్బు ఇమ్మంటే తనకి కోపం వచ్చింది. ఇల్లు తాకట్టు పెట్టి ఉంటే ఎంత బాగుం డేది. ఏ అవసరానికి తాకట్టు పెట్టినా, విడిపించుకునే స్థోమత ఎట్లాగూ లేదు కాబట్టి, ఇల్లు దక్కి ఉండేది కాదు. దాంతో పాటు తాము ఆ ఇంటివైపు వెళ్ళాల్సిన అవసరం కూడా ఉండేది కాదు. అంతా హాయిగా ఉండేవాళ్ళు.

పాడు ఇల్లు. దాన్ని రమ్యకి నచ్చిన వాడికి ఇచ్చేసినా పోయేది. దాన్ని అమ్మి పిల్లకి నచ్చిన సంబంధం కుదిర్చినా పోయేది. ఏదీ చెయ్యలేదు తను.

పీడాకారం ఇల్లు. అయ్యో. దేవుడా. ఆ ఇంటిని నాకెందుకు ఇచ్చావు? పద్మజ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

పద్మజ శోకానికి అంతం లేదు.

హాస్పిటల్ నుంచి డిశ్చార్జ్ చేశారు. పద్మజ తల్లీ, అన్నా వదినా తమ ఇంటికి తీసుకెళ్ళారు.

ఎంత ఏడ్చినా తొలిగే దుఃఖం కాదు.

జరిగిన నష్టం సామాన్యమైనది కాదు. సర్వస్వం పోగొట్టుకున్న మనిషికి ఎవరు మాత్రం ఓదార్పునివ్వగలరు?

'ఇంతేనా జీవితం? జీవితాంతం కష్ట పడి, సంసారం నెట్టుకొచ్చి, అన్నీ నెరవేర్చా నన్న తృప్తితో ఉన్న మనిషి ఒక్కసారిగా తన సర్వస్వం కోల్పోతే ఎలా ఉంటుంది.

ఇంతేనా? ఒక్క యాక్సిడెంట్, ఒకే ఒక్క యాక్సిడెంట్ నిండు జీవితాల్ని బలి తీసుకుని మరో నిండు జీవితాన్ని శూన్యం లోకి నెట్టింది.

ఆ ఇంటిని సమీపిస్తున్న కొద్దీ పద్మజలో అంతులేని భావోద్వేగం, అనంతమైన దుఃఖం.

అత్తగారు, భర్త, పిల్లలు అందరితో నిండుగా ఉన్న ఆ ఇంట్లో ఇప్పుడు తాను ఒక్కత్తే ఉండాలి.

మనసులోని భావాలు అణచుకుంటూ, దుఃఖాన్ని అదిమి పెట్టుకుని ఇంటిని సమీ పించింది.

గేటు తెరిచింది.

చెదిరిపోయిన గుండెని చిక్క బరచు కుంటూ, ఇంటి వైపు చూసింది.

చెట్లన్నీ ఎండిపోయాయి. ఇల్లంతా దుమ్ము కొట్టుకుపోయి ఉంది.

ఇల్లు బావురుమంటోంది.

ఇరుగూ పొరుగూ పరుగున వచ్చారు.

"మేం ఉన్నాం మీకు. బాధపడకండి" అందరూ చెప్పారు. పద్మజ ఆ మాటల న్నింటికీ మౌనంగా తల ఊపింది.

చిత్రంగా ఆ ఇంట్లో ప్రవేశించాక దాని మీద ఉన్న కోపం, ద్వేషం మాయం అవు తున్నట్లు అనిపించింది. మనసులో

దుఃఖం కాస్త కాస్త తగ్గుతోంది.

"ఒక్కళ్ళూ ఎట్లా ఉంటారు? తోడు పడుకోనా? " పంకజం అడిగింది. ఇంకా కొందరు కూడా అదే అన్నారు.

"వద్దు. ఎన్నాళ్ళని తోడుంటారు. నన్ను అలవాటు చేసుకోనివ్వండి" అంది పద్మజ.

అంతా చిత్రంగా చూశారు.

పద్మజ మాట్లాడుతూనే ఒక్కో పనీ అందుకుని, చేసుకోవటం మొదలు పెట్టింది. ట్యూబ్ వేసి నీళ్ళతో ఇల్లంతా కడిగింది. గోడలు దుమ్ము దులిపింది. చెట్లకి నీళ్ళు పోసింది.

వచ్చిన వాళ్ళు కూడా తలా కాస్తా సాయం చేశారు. గంటలో ఇల్లు మళ్ళీ మామూలు అవతారానికి వచ్చింది.

దేవుడి పటాలు శుభ్రంగా తుడిచి, అగ రుబత్తులు వెలిగించింది.

అందరూ కలిసి దిగిన ఫొటో ఒకటి ఉంది. దాన్ని ఫ్రేమ్‌లో బిగించి ఒక టేబుల్ మీద ఉంచింది. ఒక్కత్తే ఎలా ఉంటుందో ఎవరికీ అర్థం కాలేదు. కానీ పద్మజ మొండిగా తను ఉండగలనన టంతో అంతా వెళ్ళిపోయారు.

పద్మజ ఒక్కత్తే మిగిలింది.

చీకట్లు ముసురుకుంటున్నాయి.

ఫోన్ మోగింది.

"ఎట్లా ఉన్నావు? ఒక్క దానివే ఎట్లా ఉంటావు? ఏదన్నా అఘాయిత్యం చేసు కోవు కదా. కడుపు కోత ఎట్లా ఉంటుందో నీకు తెలిసే ఉంటుంది. నాకు కడుపు కోత మిగల్చకు" తల్లి గొల్లుమంది.

"ఏమీ చెయ్యను. అట్లాంటిది చెయ్యాల నుకుంటే ఇంత దూరం రావటం ఎందుకు? అక్కడే చచ్చే దాన్నిగా" అంది పద్మజ.

"మరి ఎందుకే. ఒక్కదానివే ఉండేది? " తల్లి విసుగ్గా అడిగింది.

""రెండ్రోజులాగు. అన్నీ నీకే తెలు స్తాయి" అన్నది పద్మజ.

## కొత్తగాలి...

**అతగాడికి ఈ మధ్య**
**మతిమరుపు మరీ ఎక్కువైనట్టుంది**
**కనిపించిన వాళ్లనే కాదు**
**కని-పెంచిన వాళ్లని కూడా**
**మరచిపోతున్నాడు**

– భాస్కరభట్ల, హైదరాబాద్

కిటికీలోంచి చూసింది. చీకట్లు! నల్లటి చీకట్లను పారదోలుతూ వీధి లైట్లు వెలుగు తున్నాయి.

గుండె నిండా ఊపిరి పీల్చుకుని నిట్టూ ర్చింది పద్మజ. ఆ ఇంట్లో గడిపిన ఒక్కొక్క జ్ఞాపకమూ కళ్ళ ముందు మెదు లుతున్నాయి. ఆ జ్ఞాపకాలూ, ఒక్కొక్కళ్ళ స్మృతులూ కళ్ళల్లో కదులుతున్నాయి.

ఇంతే. ఈ రాత్రితోనే అన్నీ ముగిసిపో వాలి. ఏ జ్ఞాపకమూ మిగలకూడదు.

పద్మజ కళ్ళు మూసుకుంది.

వద్దు. వ్యర్థ ప్రయత్నం అవుతుందా అనుకుంది కానీ, నిద్ర నెమ్మదిగా పట్టింది.

ఆ రాత్రి గడిచిపోయింది.

చుట్టుపక్కల వాళ్ళందరికీ అదొక వింత. తెల్లారేసరికి పద్మజ కనబడు తుందా, లేదా? కనిపిస్తే ఎలా కనిపి స్తుంది?

తెల్లారగానే అంతా మళ్ళీ వచ్చారు. యథాలాపంగా పనులు చేసుకుంటున్న ఆ మెని చూసి ఆశ్చర్యపోయారు.

"రాత్రి ఎట్లా గడిచింది? భయం వేసిందా? దిగులు కలిగిందా? " ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఏ కష్టం వచ్చినా తట్టుకునే ధైర్యం ప్రకృతి మానవుడికి ప్రసాదించిన వరం. మనం ఉన్నంతకాలం బతకాల్సిందే. బతు కుతాము. నేను పోతేనే నాకు ప్రపంచంతో

# కాప్షన్ మీదే - 16




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

నువ్వక్కడుండీ, నేనిక్కడుంటే పయనం ఇంకెలా?

–వాడవల్లి రమాదేవి,
ఆరుగొలను, కృష్ణా జిల్లా





## కాప్షన్ మీదే - 15

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

ఐడియా ఎవడిదో గానీ.. బ్రహ్మాండం!! చచ్చినట్టు ఈత వస్తుంది.

– డి.శిరీష, చైతన్యపురి, హైదరాబాద్

పోయినసారి పడవోడితో గొడవపడకుండా ఉండాల్సింది!!!

– ఎస్. సుభాష్‌చంద్రబోస్, శ్రీకాకుళం

బోటు మీద అప్పులు తీసుకొని కట్టక పోగా, బ్యాంకు మేనేజర్నే ఇలా ఇవతలి గట్టుమీద వదిలేసి పోతారా?

– టి.ప్రభాకర్, మదీనాగూడ, హైదరాబాద్

ఈ మధ్య బోటు ప్రమాదాలు ఎక్కువయ్యాయని ఈత వచ్చో రాదోనని చెకింగ్ ఏమో?

– పెన్మెత్స సూరిబాబు, హైదరాబాద్

బంధం తెగిపోతుంది. నేను అంటూ ఉన్నంతకాలం జీవితం ఉంటుంది. జీవించాల్సిందే" పద్మజ సమాధానం ఇచ్చింది.

కాస్సేపయ్యాక అంతా నిష్క్రమించారు. కాస్సేపు పనులు చూసుకుని పద్మజ కూడా ఇంటికి తాళం పెట్టి ఎటో వెళ్లింది.

ఆ తర్వాత తన పనుల్లో తను మునిగిపోయింది పద్మజ.

కొన్నాళ్ళు గడిచాయి.

పద్మజ మామూలుగా పనులు చేసుకోవటం చూసిన కొంతమంది ఆనందించారు. కొంతమంది ఆడిపోసుకున్నారు.

"ఏం చేస్తుంది పాపం. అంతా పోయారు. నిజమే. కానీ పోయిన వాళ్ళని తల్చుకుంటూ ఎంత ఏడ్చినా వాళ్ళు తిరిగి వస్తారా? కఠినంగానే ఉన్నా వాస్తవాలని తెలుసుకుని, మామూలుగా మళ్ళీ తన బతుకు కొసాగించాలకు కోవటం మంచి పని" అన్నారు కొందరు.

"ఏంటో, నిండు సంసారం నిలువునా కూలిపోయిందా. అయినా ఏమీ పట్టనట్లు శుభ్రంగా తింటోంది, తిరుగుతోంది" అన్నారు కొందరు.

పద్మజ దేన్నీ పట్టించుకోలేదు. మెప్పునీ, దూషణనీ దేన్నీ స్వీకరించలేదు. అతి మామూలుగా ఉండిపోయింది.

రోజూ ఎక్కడికి వెళ్తోందో, ఏం చేస్తోందో ఎవరికీ చెప్పలేదు.

నెలరోజులు గడిచేసరికి ఇంటిముందు ఒక బోర్డు వెలిసింది.

"మాతా నిలయం"

మాతా నిలయం. వృద్ధాశ్రమం.

పద్మజ హాస్పిటల్‌లో ఉన్నప్పుడు పరిచయమైన ఒక డాక్టర్ ఆ వృద్ధాశ్రమం స్థాపించటానికి బాగా ప్రోత్సహించింది. ఆమె కొన్ని ఫండ్స్ సేకరించి తెచ్చింది. ఏ

ఆధారం లేని కొందరు వృద్ధులు ఆవిడని సాయంకోసం ఆశ్రయించారు. ఇంకా కొందరు తాము తోచిన సాయం చెయ్యటానికి ముందుకి వచ్చారు. ఒక సంస్థ స్థాపించారు. పద్మజ తన ఇంటిని ఆ సంస్థకి దానం చేసింది. ఆమె ఉన్నన్నాళ్ళు ఆ ఇల్లు ఆమెకే ఉంటుంది. లోపల వృద్ధాశ్రమం నడుస్తూ ఉంటుంది. మనుషులు ఎక్కువైతే పెద్ద ఇల్లు తీసుకుని మారతారు. తానూ వాళ్ళల్లో ఒకతిగా ఉంటూ, పనిచెయ్యటానికి ఓపిక ఉన్నంత కాలం ఏదో ఒకటి చేస్తూ ఉండాలని పద్మజ నిర్ణయించుకుంది.

వృద్ధాశ్రమం ప్రారంభం రోజున కాలనీలో అందర్నీ పిలిచి, ప్రారంభించారు. బయటనుండీ కూడా బోలెడుమంది దాతలూ, సేవకులూ వచ్చారు.

"మంచిపని చేశావు" కొందరు అభినందించారు.

"మంచి పనికి మా అందరి సాయం ఉంటుంది" అన్నారు అంతా.

"జీవితం నిరంతరం ప్రవహించే నది. ఈ జీవన స్రవంతి ఇట్లా సాగిపోవలసిందే. ఆగిపోయిందంటే ఆ ప్రవాహం వరదలా మారి మనల్ని నిలువునా ముంచెత్తుతుంది. జీవితం అంటూ ఉన్నాక సమస్యలూ, కష్టసుఖాలూ ఉంటాయి. ఒక్కోసారి జీవితం తల్ల కిందులవుతుంది. దేనికీ చలించకూడదు. చలించి లాభం లేదు. చింతించటం వల్ల ఒరిగే ప్రయోజనం లేదు. మనిషి తనకొచ్చిన బాధ ఎంత భయంకరమైనదైనా సరే, దాన్ని అధిగమించేందుకు ప్రయత్నం చెయ్యాలి. దాన్లో నుంచి బయటపడాలి. ఏదో ఒక పనిలో నిమగ్నం కావాలి" అంది పద్మజ.

విన్నవాళ్ళంతా ముగ్ధులయ్యారు.

"అసలు ఈ వృద్ధాశ్రమం పెట్టాలని మీకు ఎట్లా ఆలోచన కలిగింది? "

"నేను హాస్పటల్‌లో ఉన్నప్పుడు వీళ్ళ గురించి తెలిసింది. అయినా కొత్తగా తెలిసేందుకు ఏం ఉందిలెండి? ప్రపంచంలో ఎన్నో కష్టాలూ, సమస్యలూ ఉన్నాయి. మనందరికీ వాటి సంగతి తెలుసు. కానీ వార్ధక్యం, అందులో ఎవరూ లేని అనాథలకు వార్ధక్యం ఒక పెద్ద శాపం. వాళ్లకు ఏదన్నా చేద్దామనుకున్నాను. బహుశా నేనూ వార్ధక్యంలోకి ప్రవేశిస్తున్నాను కాబట్టి నాకు వీళ్ళమీద స్పెషల్ ప్రేమ కలిగిందేమో తెలియదు. అందులోనూ ఇది తేలికైన పనిలా అనిపించింది. అందుకని ఈ వృద్ధాశ్రమం ఎన్నుకున్నాను" పద్మజ చెప్పింది.

పదిమంది దాకా వృద్ధులున్నారు.

ఆరోజు కార్యక్రమానికి వచ్చినవాళ్ళు కొందరు చెక్కు రూపేణా ధన సాయం చేశారు. అన్నీ కలిపితే ఇంకా కొంతమందిని చేర్చుకునే వీలు కలిగింది. అందరూ కలిస్తే అసాధ్యం ఏముంటుంది?

అంతా వెళ్ళిపోయాక వృద్ధాశ్రమం సభ్యులూ, పద్మజా మాత్రం మిగిలారు.

పద్మజ ఫొటోలో ఉన్న కుటుంబ సభ్యులవైపు చూస్తోంది. అంతా తనని చూసి చిరునవ్వు నవ్వుతున్నట్లే అనిపిస్తోంది. మేం నీతోనే ఉన్నాం అంటున్నట్లుంది.

ఇప్పుడు ఆలోచిస్తే అర్థమవుతోంది. జీవితంలో మనిషికి తుదిశ్వాస విడిచే వరకూ పోరాటం తప్పదు.

రంగమణి, సునీత పరోపకార మార్గం, కొందరు ఎన్నేళ్ళొచ్చినా మారకపోవటం, శ్రీరామ్మూర్తి సడన్ భక్తి మార్గం, పరమేశ్వర్రావు ద్వితీయ వివాహం, అన్నిటినీ అర్థం చేసుకుని నిర్వికారంగా నిలిచిన కుసుమ.. అన్నీ అర్థమవుతున్నాయి. కడదాకా బతకక తప్పదు. బతుకుపోరాటంలో తలా ఒక మార్గం పట్టినా అందరిదీ ఒకటే గమ్యం. జీవితమంటే జీవించటమే. Ⓒ

# 'శాస్త్రీ'యమ బూతు

## చతుర కత



'ఏరా శాస్త్రిగా, ఎలా ఉన్నావు? ఈ మధ్య నీ దర్శనాల్లేవు'

'మీరు...'

'మీరు, గారు ఏంటిరా... నేనేరా లం...'

'క్షమించాలి...'

'హహ్హహ్హా... ఏరా నా కొడకా.. ఏదైనా నాటకం రిహార్సల్స్ వేస్తున్నావా? బూతుమాట లేకుండా ఒక్క వాక్యం కూడా మాట్లాడడం చాతగాని నువ్వు ఎంత వినయంగా మాట్లాడుతున్నావ్‌రా'

'అయ్యా... మీకు కావలసింది రామశాస్త్రి. నేను కాదు. బూతుల శాస్త్రి అని పేరుపడ్డ మరో శాస్త్రి. అతన్ని పిలుస్తాను. ఇద్దరూ కలసి మనసారా తిట్టుకోండి. కాని ఈసారి ఫోన్‌చేస్తే శాస్త్రి అని అడక్క, బూతుల శాస్త్రి అని అడగండి...'

'హలో...'

'ఎస్...'

'శాస్త్రి కావాలండి'

'వన్ సెకండ్'

....

'శాస్త్రి స్పీకింగ్'

'మీ పద్ధతి మాకేం నచ్చలేదండి. ఇన్‌స్టాల్మెంట్‌లో గుడ్డలు పట్టుకెళ్ళి నాల్గునెలలైంది. ఇంతవరకూ ఒక్క రూపాయి కూడా చెల్లించలేదు...'

'నీ యవ్వ నీ దగ్గర ఏం లం... కొడుకు గుడ్డలు తెచ్చాడయ్యా?'

'బాగుందండీ మీ వరస. అసలుకే ఎసరు పెట్టాలని చూస్తున్నారా? మీ దగ్గర నుంచి పైసలు ఎలా రాబట్టాలో నాకు బాగా తెలుసు...'

'తెలిస్తే చేసుకోరా దొం... నా...'

'పైసలు ఎగ్గొట్టాలని చూడడమే గాక బూతులు తిడతావా?'

'తిట్టక ముద్దెట్టుకోమంటావా? ఫోన్ చెయ్యగానే సరిపోతుందా? నీకు కావలసింది ఏ శాస్త్రో అడిగి, అప్పుడు నీ పాతబాకీ అడగాలి'

'అయితే మీరు సుబ్బరాయశాస్త్రి కాదా?'

'కాదు వెంకట్రాయశాస్త్రిని. ఈ ప్రశ్న ముందే అడిగివుంటే ఈ వెధవగోల ఉండేది కాదుగా..! ఆయన్ని పిలుస్తాను. తీరిగ్గా బెదిరించు'

'హలో'

'ఎస్...'

'శాస్త్రిగారున్నారా?'

'వన్ సెకండ్...'

'మీరు మాట్లాడకండి. నేను చెప్పేది వినండి. నేను సూపరింటెండెంట్ రామశాస్త్రిని. కాబట్టి మీకు కావలసింది నేనో కాదో ముందు తేల్చుకోండి'

'నాకు శాస్త్రిగారి పూర్తి పేరు తెలీదండి'

'అయితే కష్టం. ఈసారి ఆయన్ని కలుసుకున్నప్పుడు 'సూపరింటెండెంట్ శాస్త్రా? బూతుల శాస్త్రా? అప్పుల శాస్త్రా? ఎవరు మీరు?' అని అడగండి. అలా అడిగితే తప్ప శాస్త్రి అని పిలిస్తే ఈసారి ఎవ్వరూ పలకరు. ఉంటా.'

—బద్దిగం పాండురంగారెడ్డి

కథ వెనుక కథ

# దురాచారంపై దూసిన అస్త్రం 'మునివాహనుడు'



**ఐదు అంకాలు, ఎనిమిది రంగాలు, ఐదు పాత్రలతో డాక్టర్ కొలకలూరి ఇనాక్ కలం నుంచి జాలువారిన పద్య నాటకం 'మునివాహనుడు'. సుమారు మూడు దశాబ్దాలకు పూర్వం తెలుగు రంగస్థలంపై సంచలనం సృష్టించిందీ నాటకం. నాటి సమాజంలోని అస్పృశ్యత దురాచారాన్ని సాక్షాత్తు ఆ శ్రీరంగనాథుడే కాలరాచి, తన భక్తుడైన తిరుప్పాణ్‌ను తనలో ఐక్యం చేసుకోవడం ఈ నాటకంలోని కథావస్తువు.**

శ్రీవైష్ణవ మతానికి మూలపురుషులైన పన్నెండు మంది ఆళ్వారుల్లో ఒకరైన తిరుప్పాణ్ ఆళ్వారు భక్తి ప్రపత్తులే ఇతివృత్తమైన ఈ దృశ్యకావ్యం 'కథవెనుక కథ' ఏమిటి? ఈ నాటక రచనకు ప్రేరణ ఎవరు? నాటకంగా వచ్చిన తరువాత సాధించిన విజయాలేమిటి? ఈ విశేషాలన్నింటిని పరిశీలిద్దాం.

### బీజావాపం

తిరుప్పాణ్ ఆళ్వారు, నందనారు కథలు చదివి బాల్యంలోనే ప్రభావితులయ్యారు ఆచార్య కొలకలూరి ఇనాక్. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆయన పనిచేస్తున్నప్పుడు నాటి వీసీ ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి ఒక సూచన చేశారు. విశ్వవిద్యాలయంలో తిరుప్పాణ్ పేర ఓ భవనం నిర్మిస్తున్నామనీ, దాని ప్రారంభోత్సవానికి తిరుప్పాణ్‌పై ఓ నాటిక ప్రసారం అయ్యేట్టు రాయాలని కోరారు. దాంతో నాటిక రాసి ఆకాశవాణికి, వ్యాసాన్ని రాసి 'ఆంధ్రప్రభ'కు పంపారు ఇనాక్. అనుకున్నట్టే ఆ భవన ప్రారంభోత్సవ సమయానికి అంటే 1976లో ఆకాశవాణిలో ప్రసారంతోపాటు వ్యాస ప్రచురణా జరిగింది.

### ఇంతింతై...

ఈ పదిహేను నిమిషాల నాటికను ఆ తర్వాత ముప్ఫయి నిమిషాల నాటికగా పెంచి, పాటలు చేర్చి ఇనాక్ ఆకాశవాణి హైదరాబాదు కేంద్రానికి పంపారు. కానీ పాలగుమ్మి విశ్వనాథం దాన్ని గంటకు సరిపడే నాటకంగా విస్తరించమని కోరారు. దాంతో మరిన్ని పాటలు, సన్నివేశాలు కూర్చారు. దరిమిలా 1978లో రేడియో నాటక సప్తాహంలో 'మునివాహనుడు' ప్రసారమైంది.

### భక్తి తరంగం

కావేరీ నదీమతల్లి ప్రతి తరంగం అంతరంగం ఆ శ్రీరంగనాథునికి కొలువైనట్లు ఈ నాటకంలోని ప్రతి రంగమూ ఒక భక్తి

తరంగమే. ఆ తరగల్లోంచి లేచే పవిత్ర శీకరాల్లా పదపదమూ విష్ణుతత్త్వాన్ని బోధిస్తాయి. పుడమి నలుచెరగులా పాల నురుగు లాంటి వెన్నెల పరివ్యాప్తమైనట్లు నాటకమంతా భక్తిభావనతో పరిప్లావితమై ఉంటుంది.

### సులభ శైలిలో తాత్వికత

'వెదకువాడు వెదకబడుచున్నాడు', 'బల హీనునిపైనా... బలహీనతపైన!' వంటి అలతి అలతి పదాలతో నాటకంలో అడు గడుగునా నిగూఢమైన తాత్త్వికార్థాన్ని వ్యక్తీకరించడం విశేషం. దేవదత్తుడు, వేద వేద్యుడు సంభాషణల్లో వేదాంత చర్చలు సాగుతాయి. 'మనుష్యులంతా ఒక్కటే అని, ఆ భగవంతుని అనుగ్రహం ఉంటే ప్రతి తోటలోని పువ్వు పూజా పుష్పమే, ప్రతి ఏటిలోని నీరు అభిషేక జలమే..' వంటి విషయాలు చిన్నచిన్న మాటల్లో చెప్పడం హృదయానికి హత్తుకుంటుంది.

'మానవునకు మాధవునకు మధ్య మలి నము లేదు'

'జన్మవల్ల కాదు కర్మవల్ల పవిత్రతాపవి త్రతలు ప్రవర్తిల్లుట'

నిత్యసత్యాలైన ఇలాంటి వాక్యాలు జాతీ యాలు, సామెతల్ని పోలి ఉండటమే కాదు, సాక్షాత్తు ఆ భగవద్గీతాసారాన్ని వెలారుస్తున్నాయి.

పద్యనాటకం కావడంతో ఇందులోని పద్య రచన ప్రాధాన్యం సంతరించుకుంది. ప్రతి పాదం సరిగ్గా యతిస్థానంలో విడిపోతూ సీసపద్యం శ్రీనాథుని శైలిని తలపిస్తుంది. కొన్ని సీసాల్లో మొదటి నాలుగు పాదాల్లో నాలుగు వేదాలసారం ఇమిడి ఉంది. గీత పద్యాలు సరళసుంద రంగా సాగి పోతన ఫక్కీని సంతరించుకు న్నాయి.

'శ్రీరంగనగరిలో పూరంగులే నీవు
నీ పట్టుపుట్టాన కాంతులే ఈ నేల'
అనడం-

పరాశరభట్టరు శ్రీరంగనాథుని స్తుతిస్తూ... 'ఆవిర్భూత స్తిమిత శకునా నూదిత బ్రహ్మఘోషాం.. మార్గే మార్గే పథక నివహైః ఉంచ్యమానాపవర్గాః' అని చెప్పడాన్ని పోలి ఉంది.

ఆ శ్రీరంగ పట్టణంలో పక్షుల కిలకిలా రావాలు వేదఘోషలా ఉన్నాయట. బాట

## ఇతర భాషల్లోకి..

తెలుగులో వెలువడిన 'మునివాహనుడు' నాటకం ఆంగ్లంతో పాటు భారతీయ భాషల్లోకి అనువాదం కావడం విశేషం. హిందీలోకి వై.సి. పి. రెడ్డి, ఇంగ్లీషులోకి డా. ఎం. ఎ. కె. సుకుమార్, డా. మధురాంతకం నరేంద్ర, కన్నడంలోకి డా. ఆర్. శేషుశాస్త్రి, తమిళంలోకి డా. జి.నరసింహన్ అనువాదం చేశారు.

★ హిందీ అనువాదాన్ని కేంద్ర సాహిత్య అకా డమీ ద్వైమాస పత్రిక సమకాలీన భారతీయ సాహిత్యంలో ప్రచురించారు.

★ హిందీ, ఇంగ్లీషు అనువాదాలు ఆధారంగా ఇతర భారతీయ, ప్రపంచ భాషల్లోకి తర్జుమా చేయడానికి కృషి జరుగుతోంది.




ఇంగ్లీష్, హిందీ, కన్నడ, తమిళ భాషల్లో 'మునివాహనుడు'

## కథాసారాంశం

భక్తి పారవశ్యంతో గానం చేసే తిరుప్పాణ్ శ్రీరంగపట్టణంలో కొలువుదీరిన శ్రీరంగనాథునికి భక్తుడు. పంచముడు కావటాన అతనికి ఆలయ ప్రవేశముండదు. ఆలయ పరిసరాల్లోనే ఉంటూ ఆ దేవదేవుని కీర్తనలతో స్తుతిస్తుంటాడు. ఆలయ పూజారి లోకసారంగముని. నియమ నిష్ఠాగరిష్ఠుడు. పూజకు కావేరీ జలం తెచ్చుకోబోతూంటే రేవులో తిరుప్పాణ్ ఉండటం చూచి, అంటు తగిలిందని వేరే రేవులో నీళ్ల తీసుకుపోతాడు. పూజారి పాదస్పర్శతో పవిత్రమైన రేవులో కూర్చుంటే తన్మయత్వం కలుగుతోందని, తిరుప్పాణ్, పూజారి మార్చిన రేవులలో కూర్చుంటాడు.

రోజుకో కొత్తరేవు వెదకలేక విసిగిపోయిన పూజారి, తిరుప్పాణ్‌ను ఇక రేవులో కూర్చోవద్దంటాడు. ధ్యానంలో ఉన్న అతనికి వినబడదు. దాంతో పూజారి అతనిపైకి రాయి విసురుతాడు. తిరుప్పాణ్ నుదుటికి తగిలి రక్తం కారుతుంది.

ఆరోజు పూజాసమయంలో శ్రీరంగనాథుడి ముఖం ప్రసన్నంగా ఉండక పోవడంతో పూజారి ఆందోళన చెందుతాడు. ఇంతలో గుడి వెలుపల నుంచి తిరుప్పాణ్ పాట వినిపించే సరికి స్వామి వదనంలో ప్రసన్నత కన్పిస్తుంది. ఏమిటిదని పూజారి కుమిలిపోతాడు.

---

సారులు కావేరీ తీరంలో పూచిన పూలను మొక్కల నుంచి తెంపుకుంటూంటే వారు ఆ మోక్షాన్నే తెంపుకుంటున్నట్లుగా ఉంది అంటారు. అవును, ఆ పూలను తీసుకువెళ్లి భక్తితో స్వామికి సమర్పిస్తే వచ్చే ఫలితమదే కదా మరి.

## పురస్కారాలు

- ★ 1988లో తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం లభించింది.
- ★ అంబేద్కర్ శతజయంతి పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1990-93లో మూడేళ్ల పాటు 'మునివాహనుడు' నాటకాన్ని అన్ని జిల్లాకేంద్రాల్లో ప్రదర్శించేలా చూసింది.
- ★ రాష్ట్ర గ్రంథాలయ సంస్థ 'మునివాహనుడు' నాటకాన్ని కొనుగోలు చేయాల్సిందిగా జిల్లా గ్రంథాలయ సంస్థలను ఆదేశించింది.
- ★ ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమశాఖ కమ్యూనిటీ హాళ్లకు, హాస్టళ్లకు, పాఠశాలలకు, కళాశాలలకు సరఫరా చేసింది.

కవి కానీ, పాత్రలు కానీ ప్రత్యక్షంగా కనిపించకుండా, సన్నివేశాల పరంగా, సంభాషణల పూర్వకంగా విశేషార్థాలు వ్యక్తపరచటం దృశ్యకావ్య పద్ధతుల్లో ఒక విధానం. ఇలాంటి మర్మాలెన్నో ఇందులో అలరిస్తాయి. ఇవి ప్రతిభావంతుడైన కవి సంప్రదాయాభిజ్ఞతకు అద్దం పడతాయి.

పంచమాంకంలో లోకసారంగముని తన భుజాలమీద తిరుప్పాణ్‌ను ఎక్కించుకొని వచ్చినప్పుడు నిర్విరామంగా గుడిగంటలు మోగడంలో అద్భుతమైన అంతరార్థం స్ఫురిస్తుంది.

'ఆగమార్థంతు దేవానాం
గమనార్థంతు రక్షసాం
దేవతార్చన వేళాయాం
ఘంటానాదో విధీయతే'

దేవతలను స్వాగతించడానికి, రాక్షసులను వెడలగొట్టడానికీ ఘంటానాదమనే ఆగమశాస్త్రార్థాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి. అంటే మునిలో అప్పటివరకు ఉన్న అస్పృశ్యతాది మలిన భావనలు రాక్షసుల వంటివని, ఇప్పుడవి తొలగి మానవుడే మాధవుడని కలిగిన భావన దేవతల్లాగ పవిత్రమైనదనీ తెలపడమే గంటలు మోగడంలోని అంతరార్థం.

**తత్రాపిచ చతుర్థోంకః**

'కావ్యేషు నాటకం రమ్యం,
నాటకేషు శకుంతలా
తత్రాపిచ చతుర్థోంకః
తత్ర శ్లోక చతుష్టయం'

అని కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం నాటకం గురించి చెబుతారు. ఈ నాట

ఒకరోజు శ్రీరంగనాథుడు పూజారికి కలలో కనిపించి తన భక్తుడైన తిరుప్పాణ్‌ని గుడిలోకి రానివ్వమంటాడు. అస్పృశ్యుడ్ని ఆలయంలోకి రానివ్వనని అతను జవాబిస్తాడు.

వాదం పెరిగిపోవడంతో శ్రీరంగనాథుడు మధ్యేమార్గం అన్వేషిస్తాడు. నా భక్తుడు తిరుప్పాణ్ నా దర్శనానికి రావాలి. నీ గుళ్లో అస్పృశ్యుడు పాదం మోపకూడదని నీ వాదన. అందువల్ల తిరుప్పాణ్‌ని నీ భుజాలమీద ఎక్కించుకొని వస్తే ఇద్దరి వాదాలు నెగ్గుతాయంటాడు స్వామి. నీ పూజకోసం పవిత్ర కావేరీ జలాన్ని తెచ్చే ఈ భుజాల మీద పంచముణ్ణి మోయనంటాడు ముని. తప్పదంటాడు శ్రీరంగనాథుడు. అప్పుడే స్వామి నుదుటి నుంచి రక్తం కారడం చూచి ముని ఆందోళన చెందుతాడు. ఇది నా భక్తుణ్ణి నువ్వు రాయితో కొట్టిన దెబ్బే అంటాడు స్వామి. ఎంతకీ రక్త స్రావం ఆగకపోవటంతో స్వామి మాట నెరవేరుస్తానని ముని అంగీకరిస్తాడు.

మరునాడు ఉదయం తిరుప్పాణ్‌ను భుజాల మీద ఎక్కించుకొని స్వామి సన్నిధికి ముని తీసుకువస్తాడు. అప్పుడు తిరుప్పాణ్ తన్మయత్వంతో శ్రీమహావిష్ణువును పది పాశురాలతో (పద్యాలతో) కీర్తిస్తాడు. ఒక్కో పాశురానికి తిరుప్పాణ్‌లో ఒక్కో అవయవం చొప్పున, పది పాశురాలు పాడేసరికి పూర్తిగా స్వామిలో ఐక్యమైపోతాడు. లోకసారంగముని వాహనమవడం వల్ల తిరుప్పాణ్ మునివాహనుడయ్యాడు.

---

కంలో కూడా చతుర్థాంకం చాలా విశేషమైంది. అందులోనూ ద్వితీయ రంగం మరీ విశేషమైంది. సాక్షాత్తు ఆ శ్రీరంగనాథుడే లోకసారంగమునికి కలలో ప్రత్యక్షమై వాదనకు దిగుతాడు. అసలు దేవుడెవరి కోసం? భక్తులు ఎవరి కోసం? పూజ దేనికోసం? స్తుతులు ఎందుకోసం?

## రికార్డులకే రికార్డు

ఒకే పుస్తకం ఏడాది వ్యవధిలో ఐదు భారతీయ భాషల్లో అనువదితమవడాన్ని 'రికార్డ్ ఆఫ్ బుక్స్' నమోదు చేసింది.

వంటి విషయాలమీద చర్చ చక్కని తర్కంతో సాగుతుంది. సకల ఉపనిషత్తుల సారమూ ఇక్కడ సాక్షాత్కరిస్తుంది.

సమస్తానికి ఆధారమైన ఆ పరమాత్మకే తాను ఆధారమని ముని పలకడంలో అతని మనసు ఎంత అహంకారపూరితమైందో తెలుస్తుంది. సాక్షాత్తు ఆ భగవంతునే ఎదిరించడం ద్వారా అస్పృశ్యతాది మలిన భావనల చేత అతని మనస్సు ఎంతగా కలుషితమైందో, దోషదూషితమైందో వెల్లడవుతుంది. అందువల్లే తానర్చించే ఆ దేవదేవునే ధిక్కరిస్తోంది.

తిరుప్పాణ్‌ది 'గీతార్చన' అని శ్రీరంగనాథుడంటే, కాదు 'గీత్యర్చన' అని ముని అంటాడు. చిన్న పదవిభజన ద్వారా విశేషార్థాన్ని వ్యక్తీకరించాడిక్కడ కవి. గీత + అర్చన = గీతార్చన.. అంటే భగవద్గీతతో సమానమైన పాటలతో అర్చన అని స్వామి భావన. గీతి+అర్చన = గీత్యర్చన.. అంటే సాధారణమైన పాటలతో అర్చన అని ముని అభిప్రాయం. ఈ చిన్న పదం ఇద్దరి భావనల్లో వ్యత్యాసమెంతో వెల్లడిస్తోంది. ఇలాంటి విశేషాలెన్నిటినో నాటకమంతా చూడవచ్చు.

### పాఠ్య.. అధ్యయన గ్రంథంగా...

1985 - 90 వరకు ఇంటర్మీడియెట్‌కు 'మునివాహనుడు' పాఠ్యపుస్తకంగా ఉంది.

★ శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో 1991, 1996ల్లో మునివాహనుడిపై పరిశోధనలు సాగాయి.

★ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో నాటకసాహిత్యం మీద పీహెచ్‌డీ పరిశోధనాంశాల్లో మునివాహనుడూ చేరింది.

★ కేంద్ర సాహిత్య అకాడమీ, భారతీయ భాషల కేంద్రం, హిందీ డైరెక్టరేట్ తులనాత్మక అధ్యయానికి, పరిశోధనకు స్వీకరించాయి.

సేకరణ: **చారి**

# ఆకలేస్తే అన్నం తింటా.. అలసొస్తే ఆయిల్ పెడతా..



కొన్ని ప్రత్యేకమైన పాత్రలతో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్న బెహ్రైయిన్ భామ మమతా మోహన్‌దాస్. మాతృభాష మలయాళమైనా తెలుగు మీద ఆసక్తి పెంచుకున్న ఈ అమ్మడు ఇటీవల 'కేడీ'లో ఆడిపాడింది. కెరీర్ పరంగా అన్ని పాత్రల్నీ చేయట్లేదు. ఆచితూచి అడుగులు వేస్తున్నానని అంటున్న ఆమె 'ఆకలేస్తే అన్నం పెడతా', 'ముప్పైయ్యా రు ఇరవై నాలుగు..' వంటి పాటలతో యువకులకు గిలిగింతలు పెట్టింది.

**ఆమె పాటించే ఆరోగ్య చిట్కాలు, స్వర రహస్యాలు చెబుతోందిలా..**

★ గొంతుకు శ్రమ కలిగే విధంగా అరవకూడదు. మాట సౌమ్యంగా ఉండాలి.

★ అతి వేడిగా ఉన్న పదార్థాలను, అతి చల్లగా ఉన్న పదార్థాలను తినకూడదు. దీనివల్ల గొంతులో మార్పులు వస్తాయి.

★ తరచూ అల్లం టీ, శొంఠి కాఫీ వంటి వాటిని తీసుకోవాలి. వీలైనంత వరకు గోరు వెచ్చటి నీటిని తాగుతుండటం శ్రేయస్కరం.

★ ఫ్రిజ్ నీటికి దూరంగా ఉండాలి.

★ ఐస్‌క్రీమ్‌లు.. నూనె నేతి పదార్థాలు అరుదుగా అయితే అభ్యంతరం లేదు. తరచూ అంటే ఆలోచించాల్సిందే.

★ కొబ్బరినూనె వంటకాలకు కూడా వీలైనంత దూరంగా ఉండటం మంచిది.

★ ఎదురు గాలికి వెళ్తున్నప్పుడు చెవిలో దూది పెట్టుకోవచ్చు. లేకుంటే ముఖానికి వస్త్రాన్ని కప్పుకోవడం శ్రేయస్కరం.

### కేశసంపద

★ గోరు వెచ్చటి నూనెతో జుట్టు మొదళ్ళలో మర్దన చేసుకోవడం ఉత్తమం.

★ తలకు నూనె పట్టించిన అరగంట నుంచి గంట లోపు తలస్నానం చేసుకోవచ్చు. రోజంతా కళకళలాడుతుంటాం.

★ హెయిర్ డ్రయ్యర్ల జోలికి నేనసలు వెళ్ళను. జుట్టు పొడిబారిపోతుందని నా భావన. ఎప్పుడో మరీ అవసరమైతే తప్ప వాటి జోలికి

వెళ్ళకపోవడమే మంచిది.

★ ఎండలో ఎక్కువ సేపు ఉండాలనుకున్నప్పుడు నెత్తికి బట్ట చుట్టుకోవడం ఉత్తమం.

★ ద్విచక్ర వాహనాల మీద వెళ్తున్నప్పుడూ ఇది తప్పనిసరి. కొన్నిసార్లు ఎండకోసం కాకపోయినా దుమ్ము, ధూళి కేశాలను పట్టేస్తుంది. మరి కొన్ని సందర్భాల్లో గాలికి జుట్టు చింపిరి చింపిరిగా మారి చిక్కులు పడిపోతుంటుంది.

★ కొసలు చిట్లిపోయిన జుట్టును అలాగే వదిలేస్తే వికారంగా అనిపిస్తుంది. కొసలు కత్తిరించేయడం ఉత్తమం.

## ద్రవాహారం

★ చాలా మంది శీతల పానీయాల్లకై వెంపర్లాడుతుంటారు. వాటికి బదులు సహజ సిద్ధంగా తయారు చేసుకున్నవి మంచివి. ముఖ్యంగా కొబ్బరినీళ్ళు.

★ కాఫీ, టీలకు బదులు గ్రీన్ టీ, లెమన్ టీలను తీసుకోవచ్చు. వేడిగా తాగామన్న భావన కలుగుతుంది. దానికి తోడు ఆరోగ్యం.

★ పండ్లు తినాలనిపించకపోతే పళ్ల రసాలు తాగాలి. శరీరం నిగారింపు సంతరించుకుంటుంది. పోషక విలువలు అందుతాయి.

★ గడ్డ పెరుగు తినడం కన్నా పలచటి మజ్జిగ తాగడం ఆరోగ్యకరం.

★ వీటన్నింటికన్నా ముఖ్యం నీళ్ళు. కడుపు నిండా తిన్నామా లేదా? అన్నదానికన్నా గొంతు తడారేదాకా నీళ్ళు తాగామా? లేదా? అనేది ముఖ్యం.

★ రోజుకోకప్పు పాలు తీసుకోవడం మంచిది. దానికి తోడు నవధాన్యాలతో చేసుకునే జావ అన్ని విధాలా మేలు చేకూరుస్తుంది.

## మంచి అలవాట్లు

★ ఎల్లప్పుడూ శుభ్రంగా ఉండాలి. సగం ఆరోగ్యం శుభ్రత ద్వారానే వస్తుంది.

★ రెండుపూటలా దంతధావనం మంచిది.

★ బయటికి వెళ్ళిరాగానే కాళ్ళూ చేతులే కాదు ముఖం ముఖ్యంగా కళ్ళను కూడా చల్లటి నీటితో శుభ్రపరచుకోవాలి.

★ సమయానికి భోజనం, నిద్ర వల్ల అంతా మంచే జరుగుతుంది.

★ ఆకుకూరలు, పచ్చి కాయగూరల ముక్కలు తప్పక తినాలి.

★ మంచి అలవాట్లతో పాటు ఆలోచనలు కూడా మంచివిగానే ఉండాలి.

## ప్లీజ్... వద్దు

★ కారణాలు ఏమైనా అకాల భోజనాలు కూడదు.

★ కోడి గుడ్డు పచ్చసొనకు దూరంగా ఉంటే మేలు.

★ రాత్రిళ్ళు ఆలస్యంగా నిద్రపోవడం, సోమరితనం వల్ల కలిగే నష్టాలు అధికం.

★ పిజ్జాలు, బర్గర్లకు దూరంగా ఉండటం మంచిది.

★ ఖాళీ కడుపుతో ఉండటం, పీకల దాకా తినడం కూడా మంచిది కాదు. అతి ఎప్పుడూ అనర్థమే.

★ సులభంగా జీర్ణమయ్యే ఆహారాలను తీసుకోవాలి. కొవ్వు పదార్థాలకు దూరంగా ఉండాలి.

★ ఈర్ష్య, ద్వేషం వంటి ప్రతికూల భావాలకు మనసులో తావివ్వకూడదు.



– చల్లా భాగ్యలక్ష్మి

# సరదాగా...



# రాజకీయాలు యమఈజీ గురూ

ఫ్రెండ్స్.. మనలాంటి యువత రాజకీయాల్లోకి రావాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది. సాధారణంగా రాజకీయాలంటే మనం చాలా భయపడతాం. నిజానికి భయపడాల్సింది ఏదీ లేదు. వెరీ సింపుల్! కావాలంటే నన్ను చూసి నేర్చుకోండి.

ఉదాహరణకు- మీరు ఢిల్లీలోనే ఉంటే అడపాదడపా ఏపీ భవన్ క్యాంటీన్‌కు వెళ్లండి. అక్కడ చేపలకూర అదుర్స్! ఒక్కసారి రుచి చూడండి.. స్వర్గానికి బెత్తెడు దూరంలో ఉన్న ఫీలింగ్ కలుగుతుంది. హైదరాబాద్ వెళ్లారనుకోండి.. 'చట్నీస్'ను ఓసారి సందర్శించండి. చట్నీస్‌కు వెళ్లినప్పుడు మర్చిపోకుండా అక్కడ బాబా ఇడ్లీ, స్టీమ్ దోశ తినడం మర్చిపోకండి. మ్‌మ్‌.... ఒకసారి తింటే వదిలిపెట్టరు మీరు! మరచానండోయ్ అక్కడ పుచ్చకాయ రసం కూడా సూపర్! ఇక సికింద్రాబాద్ వెళ్తే ప్యారడైజ్‌కు ఒక్కసారైనా వెళ్లండి. అక్కడ చికెన్ బిర్యానీ సూపర్ డూపర్ టేస్ట్.. సౌత్‌ఇండియాలోనే డెలిషియస్ ఫుడ్! కేరళలోని కొజికోడ్ వెళ్తే ఆలివ్ హోటల్‌ను గుర్తుపెట్టుకోండి.. అక్కడ పరోట, కాఫీ ట్రెమండస్! ఏ హోటల్‌కు వెళ్లినా తిన్నంతసేపు అక్కడి సర్వర్లు, బేరర్లతో మాటకలిపి మంచీ చెడూ అడగండి. ఆటోగ్రాఫ్‌లు అడిగితే మొహమాటం లేకుండా ఇచ్చేయండి. చెప్పడం మరచాను.. మీ ఎదుటి సీట్లో ఫ్యామిలీ ఉంటే వాళ్ల పిల్లల్నీ పలకరించండి.. ముద్దుచేయండి.

తిండి కార్యక్రమం అయ్యాక ఎంచక్కా బిల్ పే చేయండి. ఇది మంచి అలవాటు! మనబిల్ ఎవడో కడ్తాడనుకోవద్దు.. ఓవేళ హోటల్‌వాళ్లు 'వద్దుసార్.. ఫర్వాలేదు సార్' అన్నా మొహమాట పడకండి. మనలాంటివాళ్లు బిల్ పే చేయకపోతే ఆ వ్యాపార సంస్థలన్నీ ఎలా బతుకుతై? అండర్‌స్టాండ్ మై పాయింట్? బేరర్లకు బక్షీస్ కూడా ఇవ్వండి.. గుడ్ ఇక మీకు రాజకీయాలు తెలిసినట్టే!

ఇక రెండో పాఠం!

వీలైనంత వరకూ గ్రామీణ ప్రాంతాల్లోని స్కూళ్లూ కాలేజీల్ని సందర్శించి అక్కడి పిల్లలతో గడుపుతూ ఉండండి.. పట్టణ, నగర ప్రాంతాలైతే కొంపమునుగుతుంది. స్వీయ అనుభవంతో చెబుతున్నా.. అప్పుడెప్పుడో ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీకెళ్లా. పిల్లలతో మాటా మంతీ ఏర్పాటు చేశారు.. అప్పుడైనా వద్దులెండి అంటేపోయేది! పిల్లలే కదా అనుకున్నాను. వాళ్లు పిల్లలుకాదు. పిడుగులు! ప్రశ్నల వర్షంతో దుంప తెంచేశారు.. అయినా విద్యా హక్కు వగైరాల గురించి అడిగితే మనమేం చెప్తాం చెప్పండి? తెల్లమొహం వేశాను. అంచేత మైడియర్ (ఫ్రెండ్స్) బివేర్‌ఆఫ్ అర్బన్ స్టూడెంట్స్!

అప్పట్నుంచీ ఇలాంటి చేదు అనుభవాలు కూడదనే ఎంచక్కా టీకొట్లవాళ్లు, ధాబాలవాళ్లతో ముచ్చట్లు పెడతా! వాళ్లతో ఏం ప్రాబ్లమ్ ఉండదు. ఉదాహరణకు- ఒరిస్సాలోని బొలంఘీర్ వెళ్లినా, ఆంధ్రప్రదేశ్‌లోని కోరుకొండలాంటి ఊళ్లకు వెళ్లినప్పుడు రోడ్లమీద తిరుగుతూ అక్కడక్కడా టీ తాగాను. బిస్కెట్లు తిన్నాను. కన్నార్పకుండా చూశారు.. ఇలాంటి కార్యక్రమాలతో గొప్ప పబ్లిసిటీ వచ్చేస్తుంది.. పబ్లిసిటీ అంటే గుర్తొచ్చిందండోయ్! ఊళ్లు, తండాల్లో తిరిగేటప్పుడు దళితుల వాడలు, పేదల ఇళ్లు కన్పిస్తే మరేం భయంలేదు.. నిర్మొహమాటంగా ఆ గుడిసెల్లోకి దూరండి.. వాళ్లు తిండి తింటుంటే మీరూ పక్కనే కూర్చుని పెట్టమని అడగండి.. ఆ కాస్సేపు రుచీపచీ గురించి మర్చిపోండి. నేనట్టాగే చేస్తుంటా!

ఇక్కడ ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. ఇలాంటి పేదల ఇళ్లలో తిన్నప్పుడు పొరపాట్న కూడా వాళ్లకు మీ తరపు కానుకగా పైసా కూడా బయటకు తీయకండి. తిండికి పేదలైనా... వాళ్లు గుణానికి కోటీశ్వరులు! మీరు డబ్బిస్తే వాళ్ల మనసులు నొచ్చుకుంటాయ్! అంచేత సింపుల్‌గా రెండు మెతుకులు తిని, నాలుగు మంచి




మాటలు చెప్పి బయటపడండి.. ఇమేజీ పెంచుకోవడానికి ఇవన్నీ సులువైన మార్గాలు.

ఆ మధ్య మహారాష్ట్ర వెళ్లినప్పుడు ఇలావతి అనే నిరుపేదరాలి ఇంట్లోకి నేరుగా వెళ్లి కూర్చున్నా! ఆమె తొమ్మండుగురు పిల్లలతల్లి. పిటీ ఏంటంటే- ఆ ఇంట్లో బియ్యంలేవు, ఉప్పులు-పప్పుల్లేవు. అన్నింటికన్నా ఘోరం కరెంటు కూడా లేదు! పాపం ఎలా బతుకుతున్నారో? ఏంటో? ఏదో వాళ్లతోనే పట్టెడు మెతుకులు అక్కడే తిన్నా! ఆవిడకి సొంతిల్లు కట్టిస్తానని, దానికి కరెంటు పెట్టిస్తానని చెప్పా! ఇంకా వీలైనన్ని హామీలు ఇచ్చా!

నిజానికి దేశంలో సగంమంది ఇలాంటి నిరుపేదలే! ఆ మాట గత అక్టోబరులో మహారాష్ట్రలో పర్యటించినప్పుడే చెప్పా. అందుకే గ్యాంగ్‌టక్‌లో పర్యంటిచేప్పుడు కుండబద్దలు కొట్టి మరీ చెప్పా. పేదలున్నంత వరకూ భారత్ వెలగదు అని! సరే ఆ సంగతి ఇప్పుడెందుకు వదిలేయండి.

గ్రామీణులతో బాతాఖానీ వేసేప్పుడు మీరు యువత కనుక ఎవరైనా పెళ్లెప్పుడు అని అడిగితే పెదవి విరిచి 'పెళ్లిచేసుకోడానికి తీరికేది? ' అని చెప్పండి. అబ్బా ఈయన మనకోసం పెళ్లికూడా చేసుకోకుండా ఎంత కష్టపడుతున్నాడో అని జనం అనుకుంటారు.

మరో ముఖ్యవిషయం చెప్పడం మరిచాను. ఎందుకైనా మంచిది బాక్సింగ్ గీక్సింగ్ వీలైతే కరాటే గిరాటే నేర్చుకోండి. ఎక్కడైనా ఎప్పుడైనా పనికి రావచ్చు. నేనందుకే ఢిల్లీలో గురుభరద్వాజ్ దగ్గర నేర్చుకుంటున్నా. ఇవన్నీ ఎందుకయ్యా అని ఎవరన్నా అనుమానంగా అడిగితే 'ఆరోగ్యానికి మంచిది' అని చెప్పండి. ఎవ్వరూ నోరెత్తరు.

ఇంతకీ అసలు విషయం చెప్పలేదు.. పర్యటనలకి బయలుదేరినప్పుడు జేబులో కానీడబ్బు వేసుకోవద్దు. కార్డు మాత్రం పెట్టుకోండి. రైల్వేస్టేషన్‌కు వెళ్లి టిక్కెట్టు కోసం క్యూలో నిలబడండి.. కొంచెం సేపటి తర్వాత జేబులు తడుముకోని అరె డబ్బుల్లేవే అనుకుంటూ లైను బయటకు వచ్చి దగ్గర్లో ఉన్న ఏటీఎంకు వెళ్లి డ్రా చేయండి. అప్పుడు మళ్లీ వచ్చి క్యూలో నిలబడి టిక్కెట్టు తీసుకోండి. ఫలానా టైమ్‌కి ఫలానా చోటికి వెళ్లాలని మనకేం అర్జంటు ఉంది? ఎంత మెల్లగా చేస్తే అంత మంచిది.. ఎంత ఎక్కువసేపు జనం మధ్య ఉంటే అంత పబ్లిసిటీ!

మరో విషయం మీ పార్టీ మీటింగులు గట్రా జరిగినప్పుడు ఉపన్యాసాలు విన్నా వినకపోయినా ముసలోళ్లని, ముతకోళ్లని గమనిస్తూ ఉండండి. ఎవరన్నా అలసిపోయినట్టు కన్పిస్తే పరుగెత్తుకుంటూ వెళ్లి మీ దగ్గరి వాటర్‌బాటిల్ అందించి నీళ్లు తాగించండి. ఇంకా వీలైతే 'నా మీటింగ్‌కు వచ్చినందుకేగా నీకీకష్టం? సారీ అవ్వా' అని కాస్త ఫీలవ్వండి.. జనం ఫ్లాటయిపోతారు. ఇలాంటి ట్రిక్కులు చేయడంలో మా తాత, నానమ్మలు ఘటికులట!

నానమ్మంటే గుర్తొచ్చింది.. పేదలకు మేలు చేయమని మా నానమ్మ చెప్పింది.. అందుకే రాజకీయాల్లోకి వచ్చా! ప్రభుత్వం రూపాయి ఖర్చుపెడితే అందులో పదిపైసలే పేదలకు చేరుతున్నాయని ఇరవై ఏళ్లక్రితం మా నాన్న వాపోయాడు.. ఇప్పుడు నేనంటాను ప్రభుత్వం వంద రూపాయలు ఖర్చుపెడితే అందులో పేదలకు చేరేది పదిపైసలేనని! కొద్దిగా ఇలాంటి డైలాగులు అడపాదడపా వదుల్తూ ఉండండి.. పనికొస్తాయి. ఏదేమైనా యుపీఏ హయాంలోనే ఈ ప్రగతి అనేది మీరు గుర్తించండి. ఉంటానేం?

*–సీపీ కంతేటి*

అపార్ట్‌మెంటాలజీ 27

# దొంగనోటు దొంగ కౌన్ హై?



యర్రంశెట్టి శాయి

**మా** రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో ఆరోజు ఆదివారమయినా చాలా హడావుడిగా ఉంది.

విజయ్‌యాదవ్, అతని భార్య గౌరి ఎందుకో గొడవ పడుతున్నారు ఇంట్లో. చివరకు అతని భార్య ఒక రాజీ ఫార్ములా చెప్పింది.

"చూడండి! రోజూ ఈ పోట్లాటల్తో గంటలు గంటలు టైమ్ వేస్టవుతోంది. అందుకని ఇద్దరం చెరో సగం తప్పు చేశామని ఒప్పుకుందాం" అంది గౌరి.

విజయ్‌కి డౌటొచ్చింది.

"అంటే ఏమిటర్థం?" అడిగాడు విజయ్.

"వెరీ సింపులండీ! నేను చేసేదంతా రైటేనని నేను నా తప్పు ఒప్పుకుంటాను. మీరు చేసేది రాంగని మీరూ మీ తప్పు ఒప్పుకోండి"

"ఒకే ఫైన్" అన్నాడు విజయ్ ఆనందంగా.

అదే సమయానికి కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి వాళ్లావిడతో గొడవ పడుతున్నాడు.

"అదేంటీ..అసలు కరెంట్ బిల్ కట్టలేక ఛస్తుంటే నువ్వు రెండు ఫ్యాన్లు వేసుకున్నావ్?" అన్నాడు శంకరమూర్తి.

"భలేవారే! నేనేం తెలివి తక్కువ దాననుకున్నారా? ఈ రెండు ఫ్యాన్లలో ఒకటే మనది. ఆ రెండోది పక్కింటివాళ్లు వాడటం లేదని తీసుకొచ్చి ఉపయోగిస్తున్నా! దానిమీద కరెంట్ బిల్ అంతా వాళ్లకే పోతుంది కదా!"

ఆ తరువాత శంకరమూర్తి మాట వినిపించలేదు.

మొహిందర్‌సింగ్ అపార్ట్‌మెంట్‌లో ఇంకో రకం సంభాషణ. అతనికీ అతని ఏడేళ్ల కొడుక్కి మధ్య జరుగుతోంది.

"డాడీ! ఇందాక మనం రేస్‌కోర్స్ నుంచి ఎక్కి వచ్చిన బస్‌ని లారీ ఓవర్ టేక్ చేసేసింది కదా! మరి మీరు రేసులాడిన గుర్రాలు ఫాస్ట్‌గా వెళ్తాయా, బస్‌లూ, లారీలు ఫాస్ట్‌గా వెళ్తాయా?"

"ఒకప్పుడు గుర్రాలే ఫాస్ట్‌గా వెళ్లేవిరా! కానీ ఇప్పుడు బస్‌లకూ, లారీలకూ పవర్‌ఫుల్ ఇంజెన్స్ వచ్చాయ్ కదా! అందుకని

అవే ఫాస్ట్‌గా వెళ్తున్నాయ్"

"అయితే మరి మీరూ, మీ ఫ్రెండ్స్ ఆర్టీసీ బస్‌ల మీదా, లారీల మీదా రేసులా డితే ఇంకా చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది కదా? "

మరో అపార్ట్‌మెంట్ బయట ఒకావిడ మరొకావిడతో మాట్లాడుతోంది.

"ఏం సరోజా! శ్రీదేవి గురించి నేను నీకు చెప్పిన రహస్యం మళ్లీ ఎవరితోనూ చెప్పొద్దన్నాను కదా! కానీ ఆ విషయం నువ్వు ఆ చివరి ఫ్లాట్‌లో ఉండే శిరీషతో చెప్పావని మధ్య ఫ్లాట్‌లో ఉండే మహ లక్ష్మి నాతో చెప్పింది. అలా ఎందుకు చెప్పావ్? "

"భలేదానివే! నేను శిరీషతో ఎప్పుడు చెప్పాను? శిరీష పైఫ్లాట్‌లో ఉండే సావిత్రితో చెప్పాను. మళ్లీ ఆ విషయం ఇంకెవరికీ చెప్పొద్దని ఆమెకు చెప్పాను కూడా!"

"సావిత్రితో చెప్పావ్‌గానీ, సావిత్రి ఆ మాట రజనికి చెప్పి, ఇంకెవరికీ చెప్పొద్దని మరి మరీ చెప్పిందంట. ఇక రజని సంగతి నీకు తెలీందేముంది? రజని ఆ విషయం తీసుకెళ్ళి రత్నమాలతో చెప్పిందంట. రత్నమాలేమో ఎవరికీ చెప్పొద్దని శిరీషకి చెప్పిందంట"

"ఎంత దారుణం. నేను వెళ్ళి సావిత్రిని అడుగుతానుండు"

"వద్దులే. అయిపోయిన పెళ్ళికి బాజా లెందుగ్గానీ.. ఇప్పుడు నేను నిన్నిలా అడిగిన విషయం మళ్ళీ ఎవరితోనూ అనకు!"

"భలేదానివే నేనెందుకంటాను? "

ఇలా ఎవరి గొడవలో వాళ్ళుండగా ఫోర్ నాట్ త్రీలో ఉండే జగన్, వాళ్ళావిడ హేపీగా స్కూటర్‌మీద బజార్‌కెళ్ళటం అపార్ట్‌మెంట్స్‌లో చాలామంది చూశారు. చూసి షాకయ్యారు కూడా.

ఎందుకంటే వాళ్ళిద్దరికీ జనరల్‌గా ఒక్క క్షణం పడదు.

ఎప్పుడూ కొట్టుకుంటూనే ఉంటారు.




అలాంటిది ఇవాళ ఇద్దరూ చిలకాగోరింకల్లా నవ్వులు చిందిస్తూ మార్కెట్ కెళ్తున్నారంటే చాలా గొప్ప విషయమే మరి.

ఆ సంగతే కమిటీ వాళ్ళందరూ మీటింగ్ ప్లేస్‌లో నిలబడి మాట్లాడుకుంటూంటే ఓ రెండు గంటల్లో వాళ్ల స్కూటర్ తిరిగి వచ్చేసింది.

స్కూటర్ మీదనుంచి దిగుతూనే జగన్ భార్య సోనీ అతని మీద ఓ చిన్నసైజ్ రాక్షసిలా విరుచుకుపడింది.

"ఇదంతా నువ్ చేసిన పని! ఏ పని చెప్పినా అన్నీ నాశనం చేస్తున్నావని నీకసలు ఇంటి పనులేమీ చెప్పకుండా అన్నీ నేనే చేసుకుంటున్నా! నిన్న నాకు టైమ్ లేక, చెప్పక చెప్పక ఓ పని నీకు చెప్పా! 'నా ఏటీఎమ్ కార్డ్ తీసుకెళ్ళి రెండు వేలు డ్రా చేసుకురా! రేపు మాణింగ్ ఇంట్లోకి వస్తువులు కొన్ని కొనుక్కురావాలి' అన్నా! అది కూడా చేయటం చేతకాలా నీకు"

జగన్ చిరాకుపడ్డాడు.

"చేతకాకపోవటమేమిటే? డబ్బు తెచ్చా

నుగా ఏటీఎమ్ నుంచి? "

"ఏంటి తెచ్చింది.. అన్నీ దొంగనోట్లు! ఆ షాపువాడి దగ్గర బిల్ కట్టటానికి ఆ రెండు వేలు ఇస్తే తేలిందేమిటి? అవి దొంగనోట్లని కాదా? ఎంత ఇన్సల్టయి పోవాల్సివచ్చింది పదిమందిలో? ఆ షాపు వాడు మనవంక ఎలా చూశాడు? నేనో దొంగనోట్ల ముఠాదానిలాగా కనిపించాను వాడికి! ఛ! నీతో నాకు పెద్ద న్యూసెన్సయి పోయింది? " అందామె.

"ఏయ్? నీకేమయినా తెలివి ఉందటే? ఏటీఎమ్ నుండి డబ్బు డ్రా చేసుకురమ్మ న్నావ్. చేసుకొచ్చి ఇచ్చాను. ఏటీఎమ్‌లో దొంగనోట్లు వస్తాయని ఎవడయినా కల గంటాడా? "

"నువ్వెన్నయినా చెప్పు! నువ్ ఏమీ చేత కాని వాజమ్మవి!"

"చేతకాని వాజమ్మనా? ఇప్పుడే వెళ్ళి ఈ దొంగనోట్లు ఆ బ్యాంక్ ముఖాన్నే కొట్టి మంచినోట్లు తెస్తా? చూస్తూండు" అనేసి ఆ పక్కనే నిలబడ్డ మా దగ్గరకొచ్చి మళ్లీ జరిగిందంతా చెప్పాడు.

"అవునవును! ఒకసారి నాక్కూడా ఏటీఎ మ్‌లోనే దొంగ నోటు వచ్చింది" అన్నాడు మొహిందర్‌సింగ్.

"అలాగా! మరా నోటు ఏం చేశావ్? " అడిగాడు జగన్.

"బార్‌కెళ్లి ఒక బీర్ కొట్టి ఆ అయిదొం దల నోటిచ్చేశాను. బార్‌లో అసలే లైటు డిమ్‌గా ఉంటుంది కదా! వాడు చిల్లర ఇచ్చేశాడు. హేపీగా తిరిగొచ్చేశా!"

ఆ మాట వినగానే నలుగురయిదుగురు జగన్ చుట్టూ గుమిగూడారు.

"అయితే పద గురూ! అదే బార్‌కి పోయి తలో బీరూ కొడదాం" అన్నాడు శంకరమూర్తి.

జగన్ బెదిరిపోయాడు.

"ఏడ్చినట్లుంది! అసలే దొంగనోట్లు వచ్చాయని మా మిసెస్‌తో నానా గొడవా పడుతూంటే దాంతో మళ్లీ బీర్లు తాగ టమా! అదేం కుదర్దు. ఆ బాంక్ మేనేజర్ దగ్గరకెళితే అతను మంచి నోటిస్తాడు" అన్నాడు జగన్?

"సరే నీ ఇష్టం! వెళ్తానంటే వెళ్ళిరా! దూల తీరిపోద్ది!" అన్నాడు మొహిందర్.

"అదీగాక ఇవాళ ఆదివారం. బాంక్ ఉండదు."

"అవునవును! అయితే రేపే వెళ్తా" అంటూ వెళ్ళిపోయి మర్నాడు మళ్లీ మా దగ్గరకొచ్చాడు.

"ప్లీజ్ మీరెవరైనా నాతో వస్తే ఆ మేనే జర్‌తో కొంచెం గట్టిగా మాట్లాడవచ్చు" అన్నాడు జగన్ రిక్వెస్ట్ చేస్తూ.

కాదనలేక నేనూ, విజయ్‌యాదవ్, మా ప్రెసిడెంట్ హమీద్‌మియా అతనితోపాటు బయల్దేరాం.

మేం వెళ్ళేసరికి బాంక్ మేనేజర్ ఎవరి తోనో ఫోన్లో మాట్లాడుతున్నాడు.

"ఏంటి? మా బాంక్ ఏటీఎమ్‌లో దొంగనోట్లు వచ్చాయా? అయితే ఏమం టావ్? ఏంటి? దొంగనోట్లు రాకూడదా? ఏయ్? నీకేమన్నా దమాకుందా? అసలు నోటే రాకుండుంటే ఒక కిరికిరి! తక్కువస్తే ఒక కిరికిరి! ఎక్కువొస్తే ఎవ్వడూ మాట్లాడ్డు!! దొంగ నోట్లో, దొర నోట్లో ఏదొకటి అచ్చినయ్.. సంతోషించు" అనేసి ఫోన్ పెట్టేశాడు. మేమంతా మొఖాలు చూసుకున్నాం. అప్పటికే కుర్చీలో కూర్చున్న మరోవ్యక్తిని చూసి, "మీ సంగతేంటండీ? ఏంగావాలి మీకు? " అడి గాడు మేనేజర్.

"నేను మా బాంక్ ఏటీఎమ్ కార్డుతో మీ బాంక్ ఏటీఎమ్‌లో డబ్బు డ్రా చేయబోతే రాలేదు సార్"

"ఏటీఎమ్‌లో డబ్బు లేదేమో"

"డబ్బుంది సార్"

"వేరే బాంక్ ఏటీఎమ్ కార్డ్‌తో మా బాంక్ ఏటీఎమ్‌లో నెలకు నాలుగుసార్లు వరకే డ్రా చెయ్యాలయ్యా. నువ్ ఆ లిమిట్ దాటి ఉంటావ్"

"దాటలేద్సార్ మొదటిసారిది"

"సరే, మా బాంక్ ఏటీఎమ్‌లో నీకు డబ్బు రాలేదు. అంతేకదా? "

"అంతే సార్"

"అయితే ఆ సంగతి చెప్పడానికి ఇక్కడి కెందుకొచ్చావ్? ఇంకో ఏటీఎమ్ దగ్గర ట్రై చెయ్"

"హలో నాకు తెలివి లేక కాదు. మా బాంక్ ఏటీఎమ్‌లో నా డెబిట్ కార్డ్ పెట్టి పదివేల రూపాయలు కావాలని ఆపరేట్ చేశా! చేస్తే పదివేలు రాకపోగా పదివేలు వచ్చినట్లు నా ఎకౌంట్‌లో నుంచి పదివేల బాలెన్స్ తగ్గిపోయింది"

"పదివేలు నీ ఎకౌంట్ నుంచి మైనస్ అయిందా? "

"అవును"

"కానీ నీకు మనీ రాలేదు"

"అదేకదా మొత్తుకునేది మరి"

"అయితే ఇక్కడికెందుకొచ్చావ్ మరి? "

"న్యూసెన్స్ అంతా చేసింది మీ బాంక్ ఏటీఎమ్ కదా! ఇక్కడికి రాకపోతే ఇంకెక్కడికి వెళ్తాను? "

మేనేజర్ చిరాకుపడ్డాడు.

"ఆ ప్రాబ్లెమ్ మా బాంక్ ఏటీఎమ్‌ది కాదు మిస్టర్"

"కాదా? "

"ఏ మాత్రం కాదు"

"మరెవరిది? "

"మీ బాంక్ వాళ్ళిచ్చిన ఏటీఎమ్ కార్డ్‌ది"

"ఏటీఎమ్ కార్డ్‌దా? "

"అవును"

"ఈ విచిత్రమయిన ఆర్గ్యుమెంట్ ఫస్ట్‌టైమ్ వింటున్నా!"

"నేను రోజుకు వందసార్లు ఆర్గ్యూ చేస్తుంటా!"




"ఇంతకూ ఇప్పుడు నా పది వేలూ ఎక్కడికి పోయినట్లు? "

"ఆ సంగతి నన్నడగకూడదు"

"మరెవర్నడగాలి? "

"మీ బాంక్ వాళ్ళనడుగు"

"మా బాంక్ వాళ్ళే- అది మా డ్యూటీ కాదు-అని చెప్పి మీ బాంక్‌కెళ్ళమన్నారు"

"ఇక్కడికెళ్ళమన్నారా"

"అవును"

"ఇడియట్"

అతను ఉలిక్కిపడ్డాడు.

"ఎవర్నంటున్నావ్? "

"నిన్ను కాదు! నీకలా రాంగ్ డైరక్షన్ ఇచ్చిన మీ బాంక్‌వాడిని"

"ఇంతకూ నన్నేం చేయమంటారిప్పుడు? "

"మీ బాంక్‌కి వెళ్ళు! వాళ్ళే కరెక్ట్ చేయాలిది"

"మీకేమీ సంబంధం లేదంటారు? "

"మా బాంక్ స్టయిలే వేరు!"

"అసలు 'సంబంధం' అనేది మేమెప్పుడూ, ఎవర్తోనూ పెట్టుకోం! పెట్టుకుంటే అది అక్రమ సంబంధం అయిపోతుంది"

"సరే, ఓకే. మళ్ళీ మా బాంక్‌కే వెళ్తా"
"ఇప్పటికే బాగా ఆలస్యం చేశారు.
అతను వెళ్ళిపోతూంటే విజయ్ నా చెవిలో గొణిగాడు
"టోటల్‌గా చిల్లర టైప్ లాగున్నాడు. ఇంక మనమాట మాత్రం వింటాడంటావా? "
"చూద్దాం"
"ఆ రండి! కూర్చోండి! పాపం నిలబడున్నారు చాలా సేపట్నించీ. చూస్తున్నారుగా.. ఈ దొంగ నోట్లతో ఒకటే న్యూసెన్స్ అయిపోయింది. ప్రతివాడూ దొంగ నోట్లు ఏటీఎమ్‌లో వచ్చాయనేవాడే! పనీపాట లేదు సాలేగాళ్ళకి"
మాకు వళ్ళు మండిపోతుందిగానీ తొందర పడకూడదని సైలెంట్‌గా ఒక నవ్వు నవ్వాం.
"ఆ చెప్పండి సార్. మీకేం కావాలి? ఓరేయ్ పాండూ! అయిదు కూల్‌డ్రింక్స్ పంపించరా. మా బాంక్‌లో ఎఫ్.డి చేయడానికొచ్చారా? "
"కాద్సార్- మీ బాంక్‌లో..."
"ఎఫ్.డి కాదా? ఒరే పాండూ! కూల్ డ్రింక్స్ వద్దులే! చాయ్ పంపించు"
"ఆ చెప్పండి సార్! ఎకౌంట్స్ ఓపెన్ చేయాలా? ఇవిగో ఫామ్స్! ఫిలప్ చేసి తీసుకురండి"
"ఎకౌంట్స్ కాదండీ!" చెప్పబోయాడు జగన్?
"అది కూడా కాదా? ఒరే పాండూ! చాయ్ కాన్సిల్. మంచి నీళ్ళు పంపించు"
"చెప్పండి త్వరగా.. ఏం కావాలి? అవతల నాకు చాలా వర్కుంది! వాడ్డూ యూ వాన్ట్? "
"సంగతేంటంటే సార్.. మా మిసెస్‌కి మీ బాంక్‌లో ఎకౌంటుంది"
"ఉంటే? "
"మొన్న మీ బాంక్ ఏటీఎమ్‌లో డెబిట్ కార్డ్‌తో రెండు వేలు డ్రా చేశాం"
"చేసుకోటానికే కదా ఏటీఎమ్ ఉంది"
"కానీ అందులో నుంచి వచ్చినవన్నీ దొంగ నోట్లే సార్"
మేనేజర్ మొఖంలో ఇరిటేషన్.
"ఒరే పాండూ! మంచినీళ్ళు కాన్సిల్. అయితే మీకు దొంగనోట్లు వచ్చాయంటారు? "
"అవున్సార్"
"అయితే ఇక్కడికెందుకొచ్చారు? నేనెలా కనబడుతున్నా మీకు? "
దాంతో మా వాళ్ళకు మంట నెత్తికెక్కింది
"నువ్వా! నువ్వెలా కనబడుతున్నావో తర్వాత చెప్తాం గానీ బాంక్ మేనేజర్‌లాగా మాత్రం కనబడటంలా!"
"అంటే.. ఏంటి నీ ఉద్దేశ్యం? "
జగన్ ఇంక తిరగబడ్డాడు.
"లేకపోతే ఏంటి? ఏటీఎమ్‌లో దొంగ నోట్లు వచ్చాయని అంతమంది కంప్లెయింట్ ఇస్తూంటే, ప్రాబ్లెమ్ సాల్వ్ చేయాలిగానీ కస్టమర్స్ మీద ఎగురుతున్నావేంటి? "
"ఏంటీ దొంగనోట్ల ప్రాబ్లెమ్‌ని ఆఫ్టరాల్ ఒక బాంక్ మేనేజర్ని.. నేను సాల్వ్ చేయాలా? నీకేమయినా తెలివుందా? స్టేట్ గవర్నమెంట్‌లూ, సెంట్రల్ గవర్నమెంట్‌లే సాల్వ్ చేయలేక చేతులెత్తేసినయ్! పేపర్లో చూడటం లేదా? "
"వాళ్ళిప్పుడు చేతులెత్తటమేమిటి? ఏ ప్రాబ్లెమ్ వచ్చినా చేతులెత్తుతూనే ఉంటారు. అసలు పదవిలో ఉన్నంతకాలం వాళ్ళ చేతులు ఎత్తే ఉంటాయ్. అందుకే టీవీ చానెల్స్‌లో, అందరూ కలిసి స్టేజ్ మీద కనిపించినా చేతులెత్తి చూపిస్తారు. అయినా వాళ్ళు ఎత్తారని నువ్ కూడా ఎత్తేయటమేనా? "
జగన్ స్పీడ్‌కి మేనేజర్ కంగారుపడ్డాడు.

"ఇంతకూ ఇప్పుడేమంటావయ్యా?"

జగన్ తన జేబులోని దొంగనోట్లు తీసి అతని ముందుంచాడు.

"ఇవిగో మీ దొంగనోట్లు తీసుకుని మంచి నోట్లివ్వండి"

"అవి మా ఏటీఎమ్‌లోనే వచ్చినయ్యని ఏంటి గారంటీ?"

"అవి మీ ఏటీఎమ్ నోట్లు నైహై బోల్కే, క్యా గారంటీ హై?" అన్నాడు హమీద్ మియా కల్పించుకుంటూ.

"ఇగో ఈ కిరికిరంతా నాకొద్దు భయ్. నేనివ్వను"

"అంటే? ఈరకంగా మీ బాంక్ స్టాఫే దొంగనోట్లు చెలామణీ చేద్దామనా?"

మేనేజర్ ఉలిక్కిపడ్డాడు.

"ఏంటి? దొంగనోట్లు మేమే చెలామణీ చేస్తున్నామా?"

"అవునూ! ఏటీఎమ్‌లో నోట్లు లోడ్ చేసేది ఎవరు? మీ కాషియరేగా?"

"మా కాషియరే అయితే?"

"దొంగనోట్ల దొంగలు మీరే అని రుజువవ్వటంలా?"

"అంటే బాంక్‌లనే దొంగనోట్ల ముఠాలంటావా?"

"అలా అనుకోబట్టే కదా మొన్న ఓ ప్రసిద్ధి చెందిన బాంక్‌ను రిజర్వ్ బాంక్ ఆఫ్ ఇండియా రెడ్ హాండెడ్‌గా పట్టుకుని ఫైన్ వేసింది?"

"వ్వాట్? ఆ బాంకు దొంగనోట్లు ఇచ్చిందని రిజర్వ్‌బాంక్ ఆఫ్ ఇండియాయే పట్టుకుందా?"

"ఏం నువ్ పేపర్లు చదవ్వా?" అడిగాడు విజయ్.

మేనేజర్ కొంచెం జంకాడు.

"అదంతా నాకు తెలీదయ్యా. నేను మాత్రం వీటిని తీసుకోను"

"అయితే మేము నీమీద పోలీస్ కంప్లెయింట్ ఇవ్వాల్సి వస్తుంది?"

మేనేజర్ సడెన్‌గా పగలబడినవ్వాడు.




"పోలీస్ కంప్లైంట్ ఇస్తారు? పాగల్ గాళ్ళున్నారేంరా భయ్ మీరు? ఇగో ఇద్దరు పోలీస్ ఆఫీసర్లు వాళ్ళకు ఏటీఎమ్‌లో వచ్చిన దొంగనోట్లు ఎక్స్‌చేంజ్ చేయమని నెల రోజుల్నుంచీ నా చుట్టూ తిరుగుతున్నారు. సరే, వాళ్ళ దగ్గరికే పొండ్రి! కిరికిరి పోతది. పోండి" గట్టిగా అరిచాడతను.

ఆ మాటతో మేము ఖంగు తిన్నాం.

"ఏంటి? వీడు పోలీసుల్ని అట్లా తీసిపారేస్తున్నాడు?" శంకరమూర్తి హమీద్‌మియాతో అన్నాడు.

"మన స్టేట్‌లో పోలీసులు బఫూన్స్ ఉన్నయ్! అందుకే కోయీ కేర్ నహీ కర్తే" అన్నాడు హమీద్‌మియా.

"అవునవును. అందుకే మన స్టేట్‌లో ట్రాఫిక్‌రూల్స్‌ని ఎవడూ పాటించడు. అసలు దేశంలో అన్ని ప్రాంతాలనుంచీ దొంగలు మన రాష్ట్రానికి వలస వస్తున్నారంటే దానర్థం ఏమిటి?" అడిగాడు మొహిందర్.




"మరి టెర్రరిస్టులు కూడా వాళ్ళ దేశం వదలి హైదరాబాద్‌లో హాయిగా సెటిలవుతున్నారంటే అదంతా మన పోలీస్ డిపార్ట్‌మెంట్ చలవేగా"

"ఇంతకూ ఇప్పుడేం చేద్దాం? " అడిగాడు జగన్.

"ఈ లెక్కలో మనం పోలీస్‌ల దగ్గర కెళ్ళటం వేస్ట్‌రా భయ్"

"మరింకెవరికి కంప్లెయింటిస్తే ఈ మేనేజర్‌గాడు భయపడతాడు? "

"నన్నడిగితే ప్రస్తుతం దుర్మార్గులకు స్వర్గం, మంచివాళ్ళకు నరకం చూపించే మీడియా ఒకటే దిక్కు" అన్నాడు శంకర మూర్తి.

"ఏంటది? "

"ఇంకేముంది! టీవీ చానెల్స్!"

అందరి మొఖాలూ ఆనందంతో వెలిగిపోయినయ్...

"అవును. ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా నుంచీ లాండ్ రిజిస్ట్రేషన్ ఆఫీస్‌లో ప్యూన్ వరకూ భయపడేది టీవీ చానెల్స్‌కే" ఒప్పుకున్నాడు మొహిందర్.

"చానెల్స్‌వల్ల ఉపయోగం ఉంటుందంటావా? " డౌటుగా అడిగాడు విజయ్.

"చూద్దాం! కానీ చానెల్‌వాళ్లు సెన్సేషనల్ న్యూస్‌కే చూస్తారు. అయినా మన అపార్ట్‌మెంట్స్‌లో ఉంటున్న వినయ్ ఈ చానెల్లోనే పనిచేస్తున్నాడు కదా! వాడి రికమండేషనుంటుంది కాబట్టి ఫరవాలేదు".

విజిటర్స్ రూమ్‌లో కూర్చుని వినయ్‌కి సెల్ కొట్టాం. విషయమంతా చెప్పాడు జగన్. మరో అరగంటలో ఒక న్యూస్ ఇన్‌ఛార్జిని తీసుకుని మా దగ్గర కొచ్చాడు వినయ్. మా గురించి వినయ్ అతనికి కొంచెం ఓవర్‌గానే చెప్పాడు.

"ఇంతకూ మీ ప్రాబ్లెమ్ ఏంటి? " అడిగాడతను.

"మా వాడికి ఏటీఎమ్‌లో దొంగనోట్లు వచ్చాయ్"

"అయితే? మమ్మల్నేం చేయమంటాడు? "

"మేము బాంక్ మేనేజర్ దగ్గరకెళ్ళి అడిగితే తనకేం సంబంధం లేదంటున్నాడు"

"వాడికే సంబంధం లేనప్పుడు, మాకేంటి సంబంధం? "

"మీ చానెల్స్ కదండీ.. ఇలాంటివన్నీ హైలైట్ చేసి అన్యాయాలనూ, అరాచకాలనూ రూపుమాపుతాం అంటూ బోర్డ్ పెట్టుకుంది? "

అతను చిరాగ్గా వినయ్‌వేపు తిరిగాడు.

"ఏంటయ్యా వినయ్? నీకేమయినా తెలివుందా? ఇలాంటి కేస్‌లా తీసుకుచ్చేది. ఇంత కాలంనుంచి మన చానెల్లో పనిచేస్తున్నావ్.. ఆమాత్రం కామన్ సెన్స్ లేదా? ఇలాంటి అడ్డమయిన చెత్త టెలికాస్ట్ చేస్తేనే మన చానెల్స్ మట్టికొట్టుకుపోయేది. మనం దుకాణం పెట్టింది వ్యాపారం కోసం. ప్రజాసేవ కోసం కాదు. అలాంటివి చేసేవాళ్ళు వేరే ఉన్నారు" అంటూ వినయ్‌కి క్లాస్‌పీకి మావేపు తిరి

గాడు.

"చూడండి! మాక్కావలసింది ఇలాంటి రొటీన్ న్యూస్ కాదు"

"మరెలాంటివి కావాలి? "

"సెక్సయ్యా! సెక్స్ ఒక్కటీ డబ్బు గుమ్మరిస్తుంది. సెక్స్‌కి సంబంధించిన న్యూస్ ఉంటే చెప్పండి"

"సెక్స్‌కి సంబంధించిన విషయాలా? అంటే మీరు సెక్స్ స్పెషలిస్ట్‌లా? "

"ఏం డౌటా? ఏ చానల్ అయినా చూస్కోండి. సెక్స్ సమస్యలు పరిష్కరించే ప్రోగ్రాం ఉంటుంది? అయినా సెక్స్‌కి సంబంధించిన విషయాలంటే కేవలం సెక్స్ సమస్యలే కాదు! అక్రమ సంబంధాల వల్ల జరిగే మర్డర్లు, ఇంటర్నెట్ కేఫ్స్‌లో స్టూడెంట్స్ జరిపే సెక్స్ లీలలు, స్వామిజీలు, బాబాలు భక్తురాళ్లతో జరిపే కృష్ణలీలలూ, అత్యాచారాలు, సెక్స్ నేరాలూ, రాజకీయ నాయకుల సెక్స్ స్టోరీలు.. ఇలాంటివే కావాలి! ఓకే"

సరిగ్గా అప్పుడే ఒకతను హడావుడిగా లోపల్నుంచి విజిటర్స్ రూమ్‌లోకొచ్చాడు.

"ఇక్కడున్నావేంటి? అర్జంటుగా పవిత్రా హాస్పటల్‌కి వెళ్లు! అక్కడ ఇప్పుడే ఫ్రెష్‌గా ఒక డాక్టర్ నర్స్‌తో జరిపిన సెక్స్‌ను సెల్ ఫోన్లో రికార్డు చేసి దృశ్యాల్ని అందరికీ పంపిస్తున్నాడంట. అది పొరపాటున మలక్‌పేటలో మజిద్ అనే అతని సెల్‌కి కూడా పంపించాడంట! వెంటనే మజిద్‌ని కల్సుకుని ఆ వీడియో పెన్‌డ్రైవ్‌లో రికార్డు చేసుకురా."

మాతో మాట్లాడుతున్న వ్యక్తి ఆనందంతో పొంగిపోయాడు.

"ఆహా! అద్భుతమైన ఛాన్స్ మనకి! అయితే ఇప్పుడే వెళ్లి ఆ ఫిలిం కాపీ చేసుకొస్తా"

"కమాన్ హరీఅప్. లేకపోతే నిక్రుష్టా చానల్‌వాడు వెళ్తాడు. వాడు ముందు చేరుకుంటే మనకంటే ముందు వాడే టెలికాస్ట్ మొదలుపెడతాడు.- దాంతో సెక్స్ వ్యూయర్‌షిప్ వాడికి వెళ్లిపోతుంది".

"అది సరే! ఆ మజిద్ అనేవాడు డబ్బేమయినా డిమాండ్ చేస్తే? "

"తప్పకుండా డబ్బడగుతాడు. వాడితో బేరమాడు! యాభయి వేలయినా ఫరవాలేదు. ఇచ్చేసెయ్"

"యాభైవేలయినా ఇచ్చేయనా? "

"సెక్స్ సీన్లు చాలా బాగున్నాయి అంటున్నాడు. కనుక లక్ష ఇచ్చినా మనకు నష్టమేం లేదు"

"లక్షయినా ఒకేనా? " ఆశ్చర్యంగా అడిగాడతను.

"పిచ్చివాడా! అలాంటి సెక్స్ సీన్లు చూపించినప్పుడే మన చానల్ వ్యూయర్‌షిప్ పెరుగుతుంది. యూత్ అలాంటి సీన్లు ఎక్కువగా లైక్ చేస్తారు కాబట్టి మన చానల్ చూడ్డానికి ఎగబడతారు. దాంతో మన చానల్‌కి అడ్వర్టయిజ్‌మెంట్స్ పెరిగిపోతాయి. అంటే మన ఇన్‌కం లక్షల్లో పెరుగుతుంది"

ఇంక లాభం లేదని మేము పోలీస్‌స్టేషన్ చేరుకున్నాం!

సబ్ ఇన్‌స్పెక్టర్ చాలా చిరాగ్గా చూశాడు మావైపు.

"ఎవరు మీరు? ఏం కావాలి? "

"నా పేరు జగన్ సార్. మేము రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్‌లో ఉంటాం!"

"ఉండండి! ఎవళ్లొద్దన్నారు? "

"అహహా! అది కాద్సార్. నేను ఏటీఎమ్‌లో క్యాష్ తీసుకుంటే అన్నీ నకిలీ నోట్లు వచ్చాయి"

సబ్ ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా మావేపు చూస్తూ, "ఒక్కటి కూడా ఒరిజినల్ నోటు రాలేదా? " అన్నాడు.

"ఒక్కటి కూడా రాలే"

*(మిగతాది వచ్చేనెల)*

Ⓒ

ట్యాంక్‌బండ్ 28 కథలు

# ఉందిలే మంచి కాలం ముందు ముందునా

అర్ధరాత్రి!

ట్యాంక్‌బండ్ రెయిలింగ్‌ను రెండు చేతులతో పట్టుకుని, అపార జలరాశి వంక తదేకంగా చూస్తూ ఒంటరిగా నిలుచుంది సరోజ! ఆమె మనసులో బడబాగ్నులు చెలరేగుతున్నాయి.. ఎక్కడి అనంతపురం? ఎక్కడి హైదరాబాద్? పంచాయతీ పాఠశాలలో హాయిగా పిల్లలకు పాఠాలు చెప్పుకునే సరోజను రాహువులా పట్టుకుని తెచ్చి ఇక్కడ పడేశాడు రాజేష్.

'సూపర్‌స్టార్‌లా ఉండే నువ్వేంటి ఈ ఊళ్లో పాఠాలు చెప్పుకుంటూ పడున్నావ్? నువ్వు ఏ హీరోయిన్‌కూ తక్కువకాదు.. ఇంకా చెప్పాలంటే వాళ్లందరి కంటే ఎక్కువే! పదపద హైదరాబాద్ పోదాం. సినిమాల్లో నాకు తెల్సినవాళ్లు చాలామంది ఉన్నారు. నీకు తప్పకుండా ఛాన్సిస్తారు. కీర్తికి కీర్తి.. రెండు చేతులా సంపాదన..' అంటూ ఊదరగొట్టి భాగ్యనగరానికి తీసుకొచ్చాడు.

ఆ తర్వాత సినిమా ఛాన్సులు ఏమోగానీ స్క్రీన్‌టెస్ట్, టాలెంట్ టెస్ట్ అంటూ ఎందరికో తనని ఆహారంగా వేశాడు. పనిలోపనిగా తనూ ఆకలి తీర్చుకున్నాడు.. తనలాంటి వెధవలతో పంచుకున్నాడు.. అంతేనా? తన ఒంటిమీద బంగారాన్నీ ఒల్చుకున్నాడు.. ఆ తర్వాత చెప్పాపెట్టకుండా పరారయ్యాడు.

తిరిగి ఇంటికి పోలేక, ఇక్కడ బతకలేక జీవితం మీద విరక్తితో ట్యాంక్‌బండ్‌కు చేరుకుందామె..

ఒకటి.. రెండు.. మూడు...

ధబ్!

అయిపోయింది.. ఓ నిండు ప్రాణం జలసమాధి అయిపోయింది.

కళ్లెదుట జరిగిన ఆ సంఘటన ఆయన మనసును కకావికలం చేసింది. ఏమిటీ





మనుషులు? ఆకాశానికి నిచ్చెనలు వేయడం.. ఆనక అనుకున్నది జరగలేదని బలవన్మరణాలకు పాల్పడడం? బాధగా మూలిగాడాయన.

చెదురుమదురుగా ఒకటీ.. అరా వాహనాలు ట్యాంక్‌బండ్‌పైనా, నెక్లెస్ రోడ్‌పైనా పరుగులు తీస్తున్నాయి.. సాగర్ జలాల్లో ప్రతిఫలిస్తున్న వాటి కాంతుల్ని అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తూ నిలబడిన ఆయన మనసు సరోజను విడిచి తన గతంవైపు పరుగు తీసింది.

ఔను! ఆ రోజు రాత్రి నిద్రపట్టక అల్లాడాడతను. హంసతూలికా తల్పం ముళ్లపాన్పులా తోచడంతో లేచి కూర్చున్నాడు. ఓసారి పక్కకు చూశాడు.. గాఢనిద్రలో ఉన్నారు భార్యాబిడ్డలు!

తైలదీపాల మంద్ర కాంతిలో ప్రశాంతంగా ఉంది ఆమె వదనారవిందం. ఎంత అందం! తోటలోంచి వస్తున్న పిల్లవాయువుల అల్లరికి నల్లటి కురులు నొసలిపై కదలాడుతుంటే మబ్బుచాటు చందమామలా ప్రకాశిస్తోందామె మోము. నిద్రలో కూడా చెక్కుచెదరని అధరాలమీది చిరునవ్వు చూసిన కొద్దీ చూడ బుద్ధేస్తోంది. ఇంతటి

సౌందర్యరాశి జీవితభాగస్వామిగా లభిం చడం తన పూర్వజన్మ సుకృతం అనుకు న్నాడు.

మరి గత జన్మలో తానెవరు? ఆ జన్మలో తానేం చేశాడు? నిజంగా పుణ్యం చేశాడా? అసలు మనిషికి జన్మలుం టాయా? ఉంటే ఎన్ని? అంతంలేని ఆలో చనలు..

మళ్లీ భార్యవైపు చూశాడు. సుదీర్ఘ శిరోజాలు, ఉచ్ఛ్వాస నిశ్వాసలకు ఎగసిపడు తున్న సమున్నత పయోధరాలు చూసేస రికి ఈ అతిలోక సౌందర్యం శాశ్వతమా? అన్న ప్రశ్న మనసులో పొడసూపింది.

ముందురోజు సాయంత్రం తను చూసిన దృశ్యం మనోఫలకంపై ప్రత్యక్ష మైంది. చిక్కిశల్యమైన దేహంతో ఎముకల పోగులా వీధి పక్కన కూలబడి, ఆకలితో అలమటిస్తోందో వృద్ధాంగన! అది తలపు నకు వచ్చేసరికి ఒడలు జలదరించింది. మనసు పాడైపోయింది.. తల గట్టిగా విది లించి కొడుకుకేసి తిరిగాడు.

పాలుగారే పసివాడు! వాడి మెడలో ముద్దుగా ఒదిగిన పసిడి గొలుసు దీపకాం తిలో తళుక్కున మెరుస్తుంటే ఆ తండ్రి హృదయం పులకితమైంది. వాడి ముద్దు పలుకులు, చేష్టలు గుర్తొచ్చాయి. అంత లోనే ముద్దులు మూటగట్టే ఈ చిరంజీవి ఎప్పటికీ చిరంజీవేనా? క్రమంగా వయసు డిగి- మొన్న సాయంత్రం తాను చూసిన.. ఛ! ఏమిటి తన ఆలోచనలు వక్రంగా పయనిస్తున్నాయి? ఏమైంది తనకు? మొన్న సాయంత్రం నాటి ఘటన మన సులో మెదిలింది. ఇలాంటి పాలుగారే పసివాడే హఠాత్తుగా చనిపోయాడట! వాడి తల్లిదండ్రుల రోదనకు తల్లడిల్లిపో యాడు తను. ఏమిటీ దుఃఖం? ఎందుకీ దుఃఖం? పుట్టిన నాటినుంచి చచ్చేవరకూ ఇది తప్పదా? అసలు చావంటే ఏమిటి? దేహాన్ని విడిచివెళ్లే జీవులు ఎక్కడికి చేరు కుంటాయి? పుట్టిన ప్రాణికీ ఇది తప్పదా? అంటే రేపు తను, తనబిడ్డ అందరి పరిస్థితీ ఇంతేనా? ప్రాణసములైన సుతకళత్రాదులు, తల్లిదండ్రులు, బంధుమి త్రులు... వీరందరి వియోగం భరింప శక్యమా? ప్రాణం ఉన్నంతవరకూ చైతన్యశీలిగా చరించే మనిషి, అది కాస్తా పోయాక జడంగా ఎందుకు మిగిలిపో తాడు? ప్రాణం పోవడం ఇంతటి దుఃఖ భాజనమా? ప్రతిఒక్కరూ దీనికి గురికా వాల్సిందేనా?

ఇలాంటి ఆలోచనలే తనను ఆ రోజున కల్లోలపరిచాయి. కలవరపెట్టాయి. తత్ఫలి తమే మనిషిని దుఃఖవిముక్తుడ్ని చేయా లన్న సమున్నత లక్ష్యంతో భార్యాబిడ్డలకు, తల్లిదండ్రులకు చెప్పకుండా నిష్క్రమిం చాడు తను.

కోరికలే మనిషి దుఃఖానికి కారణమని తెలుసుకోగలిగాడు. కోరికల్ని నియంత్రిం చుకుంటే దుఃఖం ఉండదనీ, అదే నిర్వాణ మనీ నలుగురికీ బోధించాడు. జీవహిం సకు దూరంగా ఉండమనీ, భూతదయ కలిగి ఉండాలని ప్రబోధించాడు. కులాలు, మతాలు లేవన్నాడు.. మనుషులంతా ఒకటే అన్నాడు. ఆ దశలో తనకు కొందరు అనుయాయులు ఏర్పడ్డారు. తన బోధనల్ని ప్రచారం చేశారు..

అయితేనేం? ఇది జరిగి వేల సంవత్స రాలు గడిచినా నేటికీ మనిషి కోరికల్ని విడనాడడంలేదు.. దుఃఖాన్ని కొనితెచ్చు కుంటూనే ఉన్నాడు. తను బాధపడుతు న్నాడు.. ఇతరుల్ని బాధపెడుతున్నాడు..

పదవుల కోసం వెంపర్లాడడం, అడ్డొచ్చిన వారిని అడ్డు తొలగించుకోవడం, వడ్డీలకు కక్కుర్తిపడడం, క్షణక్షణం ధనం కోసం మథనం! అక్రమ సంపదను కాపాడుకోవ డానికి రేయింబవళ్లు నిద్రాహారాలకు దూర

మవడం, కట్నాలకోసం కోడళ్లను కాల్చుకు తినడం, వృద్ధాప్యంలోని తల్లిదండ్రులను వెడలగొట్టడం.. ఒకటేమిటి? సుఖం కోసం ఇవన్నీ చేస్తున్నానని భ్రమించే మనిషి ఇవన్నీ తనను అశాంతికి గురిచేస్తాయని తెలుసుకోలేకపోతున్నాడు. దీనికి అంతం లేదా?

ఆవేదనలో కూరుకుపోయాడాయన.

రోజు రోజుకు తన కళ్లముందు జరుగుతున్న అఘాయిత్యాల్ని చూస్తున్న కొద్దీ ఆయనకు దుఃఖం ఆగడంలేదు..

మొన్నటికి మొన్న మిత్రుడ్ని గెలవాలన్న కోరికతో వాహనాన్ని వేగంగా నడిపి నడిరోడ్డుపై ప్రాణాలు పోగొట్టుకున్న ఇరవయ్యేళ్ల కుర్రాడు గుర్తొచ్చేసరికి ఆయన మనసు కుంగిపోయింది. తన బోధనలు నిష్ఫలమైపోయాయని బాధపడుతున్న ఆయన కన్నీరు సాగర్ జలాల్ని ప్రక్షాళితం చేస్తోంది..

నిముషాలు గంటలు..

గంటలు ఝాములుగా కాలగర్భంలో కరిగిపోయాయి..

అంతలోనే ఎర్రబడింది తూరుపు దిక్కు!

తల్లిగర్భం నుంచి మెల్లగా నవ్వుతూ పైకొస్తున్న బాలభానుడు చూపులతోనే ఆయనను పరామర్శించాడు.

'నీలాంటి మహనీయుడు ఎవరో ఒకరు త్వరలో భూమిపై ఉదయించి జన దుఃఖాన్నీ, నీ ఆవేదననూ పోగొడతాడు.. అందాకా ఊరడిల్లు' అన్న భావం బాలభానుడి చూపులో ద్యోతకం కావడంతో ఆయన మొహంలో సన్నని చిరునవ్వు మొగ్గతొడిగింది.

'ఆ మంచిరోజు కోసమే కోటి ఆశలతో ఎదురు చూస్తుంటా' అంటూ పైపైకి సాగిపోతున్న భాస్కరుడికి వీడ్కోలు పలికాడాయన. ఆయన ఎవరో కాదు సాగర్‌లో నిలువు కాళ్లపై నిలబడ్డ తథాగతుడు!

–చంద్రప్రతాప్

# కాలాతీతం


హెచ్.జి.వెల్స్

ప్రకృతి రహస్యాలు అధ్యయనం చేసే క్రమమే విజ్ఞాన శాస్త్రం. సైన్సు టీచర్‌గా పనిచేసిన రోజుల్లో హెచ్.జి.వెల్స్ సైన్స్ పాఠ్య పుస్తకాలు రాశాడు. హక్స్‌లీ ప్రభావంతో సైన్సుకూ మానవ జీవితానికీ వున్న సంబంధాన్ని అన్వేషించిన వెల్స్, జీవజాతుల మధ్య రూప, లక్షణాల మార్పు సాధ్యమని వందేళ్ళ క్రితమే ఊహించాడు. అప్పటికి జెనెటిక్ ఇంజనీరింగ్ అనేమాట వాడకంలో లేదు.

'ఆన్ ది ఆరిజిన్ ఆఫ్ ది స్పీషీస్'లో చార్ల్స్ డార్విన్ ప్రతిపాదించిన జీవపరిణామ సిద్ధాంతం శాస్త్రజ్ఞుల మధ్య వివాదాలకు తెరతీసింది. ఈ లోకం భగవత్కార్యం అనే మత విశ్వాసాన్ని ప్రశ్నించింది. మనుషులలో జంతు లక్షణాలు

# ది ఐలాండ్ ఆఫ్ డాక్టర్ మోరో

న్నట్టే, జంతువులలో మనిషి లక్షణాలున్నాయని అనేకులు నమ్ముతారు. డార్విన్ ప్రకారం, మనిషి జంతువుల నుండి పరిణామం చెందాడని అంగీకరిస్తే, అతడికీ, జంతువుకూ సంబంధమున్నట్టే గదా! ఇలాంటి పోలికలు మాట్లాడుకోవటానికి బాగానే ఉంటాయిగాని, ఏ తుంటరి జీవశాస్త్రజ్ఞుడో జంతుజాతుల మధ్య మార్పిడి సాధ్యమేనని ప్రయోగాల ద్వారా నిరూపించటానికి పూనుకుంటే?

అలాంటి ఒక ఎక్సెంట్రిక్ జీనియస్ డాక్టర్ మోరో.

★ ★ ★




మన కథానాయకుడు ఎడ్వర్డ్ ప్రెండిక్ ఒక పడవ ప్రమాదంలో చిక్కుకున్నప్పుడు మరొక షిప్పులో ప్రయాణిస్తున్న డాక్టర్

మాంట్‌గామరీ అతణ్ణి రక్షించి తన వెంట ఒక ద్వీపానికి తీసుకుపోతాడు. అప్పటికే షిప్పులో వున్న కొన్ని జంతువులనూ ఒక భయానక ఆటవికుడు ఎమ్లింగ్‌నూ చూసి భయపడతాడు ప్రెండిక్.

షిప్పు ద్వీపానికి చేరగానే, మాంట్‌గామరీ ప్రవర్తనలో మార్పు వస్తుంది. అతణ్ణి నేలమీద అడుగుపెట్టొద్దని హెచ్చరిస్తాడు షిప్పు కెప్టెన్. మాంట్‌గామరీ, కెప్టెన్ కలసి ప్రెండిక్‌ను ఒక లైఫ్‌బోట్‌లో తిరిగి సముద్రంలోకి నెట్టటానికి ప్రయత్నిస్తారు. కొందరు స్థానిక 'కనకా' తెగవాళ్లు అడ్డుపడి తమ వెంట రమ్మంటారు.

ఆ తర్వాత తన ప్రవర్తనకు సిగ్గుపడిన మాంట్‌గామరీ, ప్రెండిక్‌ను డాక్టర్ మోరోకు పరిచయం చేస్తాడు. కాని మోరో కనీసం పలకరించడు. అతని దృష్టిలో స్నేహం, మర్యాదలకు విలువలేదు. తన పరిశోధనలకు ఎవరూ అడ్డుతగలకూడదని, నాగరికతకు దూరం గా వున్న ఈ ద్వీపాన్ని ఎంచుకున్నాడు.




ప్రెండిక్‌కు ఓ ఔట్‌హౌజ్‌లో వసతి కల్పిస్తారు. ఆ ద్వీపంమీద ఎటుచూసినా దట్టమైన అరణ్యమే తప్ప నరసంచారం లేదు. ప్రెండిక్‌లో డాక్టర్ మోరో గురించి తెలుసుకోవాలనే కుతూహలం పెరుగుతుంది. అతడి పరిశోధనాశాల తలుపులెప్పుడూ మూసివుంటాయి. ఒకటి రెండుసార్లు ప్రెండిక్ తెరవటానికి ప్రయత్నించాడుగాని లోపల్నించి తాళం వేసేవుంది. అతడు చేస్తున్న రహస్య పరిశోధన ఏమిటి? ఏ ప్రయోజనాన్ని ఆశించి ఈ ఏకాంత ద్వీపాన్ని ఎంచుకున్నాడు?

కానీ ఏ ప్రశ్నకూ మోరో సమాధానం చెప్పడు. కొంతకాలం క్రితం, లండన్‌లో అతడికి ఫిజియాలజిస్టుగా పేరున్నదని గుర్తుచేసుకుంటాడు ప్రెండిక్. అతడు చేస్తున్న వైవిసెక్షన్ (సజీవంగా వున్న జంతువులను కోసి పరిశోధనలు నిర్వహించే ప్రక్రియ) గురించి, ఒక జర్నలిస్టు పత్రికలో వ్యాసం రాయటంతో అక్కడ అదృశ్యమై ఇక్కడ తన అమానుష, క్రూర ప్రయోగాలు కొనసాగిస్తున్నాడు కాబోలు!

ప్రెండిక్, తన బందీ అని తెలుసుకున్న మోరో, నిర్భయంగా చిరుతలాంటి జంతువు ప్యూమాపై తన పరిశోధన కొనసాగిస్తాడు. హృదయ విదారకమైన దాని అరుపులతో, రోదనలతో అడవి ప్రతిధ్వనిస్తుంది. ప్రెండిక్ పారిపోవటానికి ప్రయత్నిస్తాడు కాని దారిలో కొందరు వ్యక్తులు తారసపడతారు. వాళ్ళలో ముళ్ళ పందుల పోలికలుంటాయి. ఇక్కడ ఒంటరిగా తిరగటం క్షేమకరం కాదేమో. ఔట్‌హౌజ్‌కు తిరుగు ప్రయాణమవుతాడు. అయితే త్వరలోనే తననెవరో వెంబడిస్తున్నట్టుగా తెలుస్తుంది. వెనుదిరిగి చూస్తాడు 'మనిషి-జంతువు' లాంటి సంకరజీవి పైకి లంఘిస్తుంది. ప్రాణాలరచేత పట్టుకుని పరుగు లంఘించుకుంటాడు ప్రెండిక్. "వీళ్ళంతా ఎవరు? ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు? " అని అడిగితే మాంట్‌గామరీ సమాధానం చెప్పడు. 'ఆ సంకరజీవి తలుపులు బద్దలు కొట్టుకొని వచ్చి తనను చంపదని నమ్మకమేమిటి? ' అనుకుంటూ భయంతో మద్యం సేవించి, మగతగా నిద్రపోతాడు ప్రెండిక్.

తెల్లవారున మోరో లేబరేటరీ తెరచి ఉండటం గమనించి లోపలికి ప్రవేశిస్తాడు. టేబుల్ మీద మనిషిని పోలిన శరీరం ఒకటి పడుంటుంది. ఒంటి

నిండా బ్యాండేజెస్ వున్నాయి. అంతలో అక్కడికి వచ్చిన మోరో దుర్భాషలాడి ప్రెండిక్‌ను బయటకు గెంటేస్తాడు. అతడు మనుషులను వైవిసెక్ట్ చేస్తు న్నాడు. త్వరలో తన వంతు కూడా వస్తుంది కాబోలుననుకుని ప్రాణాలమీద ఆశ వదులుకున్న ప్రెండిక్ బతికుంటే బలుసాకైనా తినవచ్చనుకున్నాడు. అడ విలో క్రూర జంతువుల మధ్య బతికినా ఇంతకన్నా క్షేమమేకానీ అక్కడా 'చింపాజీ' లాంటి మనుషులూ, సగం మనిషి సగం జంతువు'లూ కనిపిస్తాయి. డాక్టర్ మోరో అద్భుత కృషిని అందరూ శ్లాఘించాలని ప్రెండిక్ చేత బలవంతంగా వాగ్దానం చేయిస్తాడు ఆ జంతువుల నాయకుడు. అనూహ్యంగా డాక్టర్ మోరో అక్కడా ప్రత్య క్షమవుతాడు. అడవిలో మరింత లోపలికి పారిపోతాడు ప్రెండిక్. ఎదురుగా సముద్రం కనిపిస్తుంది. ఆ దుర్మార్గుడికి చిక్కటంకన్న, నీళ్లలో దూకి, తన అదృష్టం పరీక్షించుకోవటం మేలనుకుంటాడు. మోరో, మాంట్‌గామరీలు కలసి అతడికి పరిస్థితి వివరిస్తారు. సందేహించవలసిం దేమీ లేదని, అడవిలో కనిపించిన జంతు జాలమంతా డాక్టర్ మోరో వైవిసెక్షన్ ఫలి తంగా ఆకారాలు, లక్షణాలు మార్చుకొని మనిషి రూపం సంతరించుకున్న జీవులే నని అభయమిస్తారు. ఈ పరిశోధనల గురించి పూర్తిగా తెలిస్తే తప్ప తనిక్కడ ఉండలేనంటాడు ప్రెండిక్.

"ఒకే మళ్ళీ మళ్లీ నీ చచ్చు ప్రశ్నలతో నన్ను విసిగించనంటే, నా వైవిసెక్షన్ లక్ష్య మేమిటో వివరిస్తాను" అంటూ ప్రారంభి స్తాడు డాక్టర్ మోరో.

"ఇవన్నీ ఎప్పుడో జరగాల్సిన పరిశోధన లు. ఇన్నాళ్లూ ఎవరూ ఈ కార్యక్రమాన్ని ఎందుకు చేపట్టలేదా? అని నాకాశ్చర్యమే స్తుంటుంది. కుళ్లిపోయిన కాళ్లూచేతుల్ని నరకటం, నాలుక మీద గాట్లు పెట్టడం మనకు కొత్తేమీ కాదు. మెల్లకన్ను సరి దిద్దటానికి ఆపరేషన్ చెయ్యమా? ప్రమా దంలో ముక్కు, చెవి తెగిపోతే కొత్తవి అతి కించడం కూడా నీకు తెలుసనే అనుకుం టాను. ఇవన్నీ చాలా చిన్న విషయాలు. శరీరంలో ఒక చోటినుండి తీసిన చర్మం మరోచోట అతికిస్తాం. అలాగే సహాయం అవసరమైన ఒక జీవికి, మరొక జీవి శరీర భాగాలను గ్రాఫ్ట్ చెయ్యటం కూడా సాధ్యమే. అప్పుడే మరణించిన జీవుల నుండి తీసిన శరీర భాగాలు బాగా అతు క్కుంటాయి. ఖడ్గమృగం సైజు అల్జీరియన్ ఎలుకలున్నాయి తెలుసా? మామూలు ఎలుకల తోకలు, వాటి ముట్టెలకు అతికిం చిన ఫలితమిది."

"రాక్షసి జీవుల్ని సృష్టించడమెందుకు?"

"సృష్టించటం లేదయ్యా మహానుభావా. రెండు వేర్వేరు జంతువుల శరీర భాగాలు కలిపినప్పుడు, కొత్త జీవులు వాటంతటవే పుట్టుకొస్తున్నాయి. మనం చేస్తున్నది వైవి సెక్షన్ మాత్రమే. జీవసృష్టి ప్రకృతి లక్షణ మని నీకు తెలియదా ఏమిటి? నీ మొహంలో భయం కన్పిస్తున్నది. నేను అనేక సంవత్సరాలుగా ఈ విషయమై అధ్యయనం చేశాను. కేవలం శరీర భాగాలే కాదు, ఆ జంతు స్వభావం, లోపల గ్రంథుల రసాయనిక ప్రక్రియలో కూడా మార్పు వస్తున్నది. కొన్నిసార్లు వాక్సినేషన్లు లేదా టీకాలు కూడా సరిపో తాయి. ఒకదాని రక్తం మరొకదానికి ఎక్కించటం వల్ల కూడా కోరిన ఫలితాలు వస్తాయి. మరికొన్ని అరుదైన కేసుల్లో మాత్రమే ఆపరేషన్ చేయాల్సి ఉంటుంది. మధ్యయుగాలలో, మామూలు మనుషుల్ని మరుగుజ్జులుగా మార్చి వీధుల్లో ముష్టెత్తు కోవటానికి వదిలారు. ఇప్పుడు కూడా కంటార్షనిస్టులు చేస్తున్నదదే. ప్రముఖ

ఫ్రెంచి రచయిత విక్టర్ హ్యూగో కూడా ఈ విషయం ప్రస్తావించాడు.

జంతువుల అంతర్, బహిర్ లక్షణాలలో మార్పు సాధ్యమని అంగీకరించిన తర్వాత పరిణామాల గురించి కూడా ఒకసారి ఆలోచించు. పందులకు విద్య నేర్పించ వచ్చు. శారీరక మార్పుకన్నా మానసిక మార్పు చాలా సులభం. హిప్నాటిజం వల్ల మనుషుల స్వభావంలో మార్పు తేగలం. ఈ ప్రక్రియ వల్ల స్వార్థపరులను, పిరికిపందలను ఆత్మాహుతికి సిద్ధపడే త్యాగపురుషులుగా తీర్చి దిద్దవచ్చు. వ్యక్తులలో నిద్రాణమైన లైంగిక ఆలోచనలను ఆధ్యాత్మికతవైపు మళ్లించవచ్చు. ఇలాంటి కొత్తతరంవల్ల లోక కల్యాణం జరగదా? "

"కానీ వైవిసెక్షన్ చేసినప్పుడు జీవులు నరకయాతన అనుభవిస్తాయి"

"కేకలు, అరుపులు బాధకు సంకేతం కాదు. బాధకూ, పాప భావనకూ సంబంధం వుంది. జంతువులు అనుభవించే బాధకన్నా, వాటి అరుపులు విని మనం అనుభవించే బాధ ఎక్కువ. బాధ ఉన్నదని అంగీకరించినా, మానవ కల్యాణానికి, ఆదర్శ సమాజ స్థాపనకు 'ఈ బాధ' జీవి చెల్లించే పెద్ద మూల్యమేమీ కాదు. వైవిసెక్షన్ జరగని సందర్భాలలో జీవులు బాధననుభవించటం లేదా? " అంటూ మోరో ఓ చాకుతో తొడమీద గాటు పెట్టుకున్నాడు. నెత్తురు కారింది.

"చూడు. నాకు బాధ లేదు. బాధ మనస్సులో, ఆలోచనలో, స్పందనలో వుంటుంది. శరీరంలో కాదు" అంటూ హేళనగా చూశాడు.

"బాధ జీవికి ప్రమాదాన్ని సూచించే హెచ్చరిక మాత్రమే. ఉదాహరణకు కంటిలోని ఆప్టిక్ నెర్వ్‌కు బాధంటే తెలియదు. దాన్ని ప్రేరేపిస్తే మెదడులో లైట్లు వెలిగినట్లుగా వుంటుంది.

మిస్టర్ ప్రెండిక్, నేనూ క్రిస్టియన్ మత విశ్వాసాలను గౌరవిస్తాను. ఒక విషయం మాత్రం స్పష్టంగా చెప్పగలను. మనం అనుభవించే బాధకూ ఆనందాలకూ, స్వర్గనరకాలకూ సంబంధం లేదు. నా అభిప్రాయంలో బాధ, ఆనందం రెండూ జీవ లక్షణాలే. వాటిని అధిగమిస్తేనే ప్రగతి సాధ్యపడుతుంది.

నేనిక్కడికి వచ్చి పదకొండేళ్లయింది. మాంట్‌గామరీ, ఆరుగురు 'కనకా' తెగ ఆదివాసీలు మాత్రమే నా వెంట వచ్చారు. నెమ్మదిగా ఇక్కడి వాతావరణానికి అలవాటు పడి, పాక కట్టుకుని, గొర్రెతో ప్రయోగాలు ప్రారంభించాను. ప్రతిసారీ అనుకూల ఫలితాలే వచ్చాయని చెప్పలేను. పరిశోధన అన్న తర్వాత, అనూహ్య పరిణామాలకు ఎప్పుడూ సిద్ధంగా వుండాలి.

'కొన్నేళ్లకు, ఒక గొరిల్లాను వైవిసెక్ట్ చేసి మనిషిగా మార్చాను. ఇంగ్లీషు, లెక్కలు నేర్పించాను. ఆ తర్వాత ఈ కొత్తమనిషిని ఆదివాసీలకు పరిచయం చేశాను. పుట్టుకతో మనుషులైన ఆదివాసీలకన్నా వాడు విద్యావంతుడు! అందరూ వాణ్ణి చూసి భయపడ్డారు. పలుగూ పారా పట్టి శారీరక శ్రమ చేయటం కూడా నేర్పించాను. నా కోసం ఓ పాక కట్టాడు వాడు. కానీ చూడటానికి గొరిల్లాలా వున్నాడు కనక ఆదివాసీలకు వాడంటే అసహ్యం. పాపం వీళ్ళ బాధ భరించలేక, చదువు నేర్చిన గొరిల్లాలా చెట్టెక్కి కొమ్మల్లో నక్కి కూర్చున్నాడు. వాడి పరిస్థితి చూసి జాలేసింది. సమకాలీన సమాజంలో గుర్తింపు రావాలంటే లక్షణాలు, స్వభావాలు మాత్రమే కాదు, ఆకారమూ మారాల్సిందే. అందుకోసం ఈ ప్యూమాతో కొత్త ప్రయోగాలు ప్రారంభించాను. ఆరుగురు స్థానికుల్లో ఇద్దరు మరణించారు. ముగ్గురు పారిపోయారనుకుంటాను."

# హెచ్.జి.వెల్స్ ( 1866 - 1946 )

దార్శనికుడు, సామాజిక తత్వవేత్త, ఇరవ య్యో శతాబ్ది ప్రారంభంలో ప్రపంచ వ్యాప్తంగా మేధావులను, రాజకీయ నాయకులను ప్రభా వితం చేసిన ప్రముఖ బ్రిటీష్ రచయిత హెర్బర్ట్ జార్జ్ వెల్స్ తండ్రి తోట మాలి. తల్లి పనిమనిషి. ఈ భావి రచయిత బాల్యమంతా దుర్భర దారి ద్ర్యంతోనే గడిచింది. కొన్నాళ్లు ఓ పింగాణీ పాత్రల కొట్టు పెట్టుకున్నారు గాని అమ్మకాలు లేక అది త్వరలోనే మూతబడింది. తండ్రి, కెంట్ క్రికెట్ కౌంటీలో ఆడి ఎంతో కొంత సంపాదించటానికి ప్రయత్నించాడు.



పన్నెండో ఏట ఫుట్ బాల్ ఆటలో వెల్స్ కాలు విరిగింది. ఆ ప్రమాదమే అతడి జీవి తాన్ని మలుపు తిప్పింది. స్థానిక లైబ్రరీ నుండి తెప్పించుకుని పుస్తకాలే లోకంగా బతికాడు. మరో ప్రమాదంలో తండ్రి కాలు కూడా విరి గింది. ఈ పరిణామంతో వెల్స్‌తో సహా, పిల్ల లందరూ ఎక్కడోచోట పనికి కుదరక తప్ప లేదు. ఒక డ్రేపరీ ఎంపోరియంలో గడిపిన రోజుల్ని, 'ది వీల్స్ ఆఫ్ ఛాన్స్', 'కిప్స్' లలో నెమరేసుకున్నాడు వెల్స్.

1883లో చదువు కొనసాగిస్తూనే, టీచర్ ఉద్యోగం చెయ్యటానికి వెస్ట్ ససె క్స్‌లోని మిడ్‌హర్స్ట్ స్కూలులో అవ కాశం వచ్చింది. ఆ తర్వాత స్కాలర్ షిప్‌తో నార్మల్ స్కూల్ ఆఫ్ సైన్స్‌లో ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు థామస్ హెన్రీ హక్స్‌లీ వద్ద బయాలజీ అధ్యయనం చేశాడు. అక్కడే డిబే టింగ్ సొసైటీ పోటీలలో పాల్గొని సమాజంలో రావలసిన తక్షణ మార్పు గురించి ఉపన్యసిం చాడు. ఆ తర్వాత ప్రఖ్యాత సోషలిస్టు రచ యిత విలియం మారిస్ ఇంట్లో సోషలిజం

---

"ఆరోవాడేదీ? "

"మనం సృష్టించిన జీవులకు కూడా రాగద్వేషాలుంటాయి. అలాంటి ప్రమా దమే జరిగింది"

"..... ...."

"చావు బతుకులు ముఖ్యం కాదు. పరి శోధన ఏ దిశగా సాగుతోందన్నది గమ నించాలి. మొత్తం మీద ఇన్నేళ్ల కృషి ఫలి తంగా ఏ జీవికైనా మనిషి ఆకారం, లక్ష ణాలు కల్పించగలుగుతున్నాను" అంటూ ప్రెండిక్ వైపు చూశాడు.

మంత్రముగ్ధుడిలా డాక్టర్ మోరో చెప్పిం దంతా విన్నాడు ప్రెండిక్.

ఈ ద్వీపానికి అధిపతి మోరో. ఈ జీవ జాలానికి అతడే దేవుడు. అంటే సృష్టికర్త. తను సృష్టించిన జీవుల కోసం ఒక చట్టం కూడా అమలు చేస్తున్నాడు. జంతువులలో మాంసాహారం నిషిద్ధం. ఈ నియమం ఉల్లంఘించినవాళ్లు శిక్షార్హులు. అడవిలో పర్యటించినప్పుడు వివిధ శరీరాకృతులు గల జీవులను చూశాడు ప్రెండిక్. అదో వింత లోకం. సృష్టికి ప్రతిసృష్టి చేశాడు మోరో.

ఒకనాడు ప్రయోగశాలలో వున్న ప్యూమా కట్లు తెంచుకుని పరిగెత్తింది. డాక్టర్ మోరో దాన్ని వెంబడించాడు. ఇప్పుడు దానిలో మార్పు ఏ దశలో వుందో, మరి ఏ రూపం దిద్దుకునే క్రమంలో వుందో, దాని మానసికస్థితి ఏ దశలో వుందో ఎవరికీ తెలియదు. ప్యూమా, మోరో అరణ్యంలో అదృశ్యమ య్యారు. ఆ సాయంత్రందాకా నిరీక్షించి, భయం భయంగా డాక్టర్ మోరో కోసం వెదికాడు ప్రెండిక్. ఒక పొదలో ప్యూమా చీల్చిన డాక్టర్ మోరో మృతదేహం కనిపిం చింది.

ఈ పరిణామంతో మాంట్‌గామరీ ప్రవ ర్తనలో మార్పు వచ్చింది. 'మనిషి- జంతువు'లతో కలిసి తాగితందనాలా డాడు. ఒకరాత్రి తాగుబోతుల మధ్య

గురించి విని, ఫేబియన్ సొసైటీలో చేరాడు. ఆ దశలోనే సైన్సు పట్ల ఆయనకున్న అభిరుచితో స్కూల్ జర్నల్‌లో 'ది క్రానిక్ ఆర్గొనాట్స్' ప్రచురించాడు. అదే మనకు తెలిసిన 'టైం మెషీన్'- గొప్ప సైన్సు ఫిక్షన్ నవల. 'ది ఇన్‌విజిబుల్ మాన్', 'వార్ ఆఫ్ ది వరల్డ్స్', 'మెన్‌లీ పర్ అవేక్స్', 'ఫస్ట్‌మెన్ ఆన్ ది మూన్'లతో వెల్స్‌ను శాస్త్ర, సాంకేతిక దార్శనికునిగా లోకం గుర్తించింది. అయితే ఫ్రెంచి సైన్స్ ఫిక్షన్ రచయిత జూల్స్‌వెర్న్ కథల్లోని సాంకేతిక పరిజ్ఞానం మనల్ని సంభ్రమాశ్చర్యాలకు గురిచేస్తే, వెల్స్ భవిష్యద్దర్శనం మనలో ఆందోళన రేకెత్తిస్తుంది. అత్యాధునిక శాస్త్ర పరిజ్ఞానం, ఉన్మాదుల చేతుల్లో మారణాయుధంగా మారే అవకాశం లేకపోలేదని హెచ్చరిస్తాడు. 'ది ఐలాండ్ ఆఫ్ డాక్టర్ మోరో' నవల ఈ కోవలోనిదే.

ఈయన నవలలు టోనోబంగే, ది వరల్డ్ సెట్ ఫ్రీలలో అణుధార్మికశక్తి పరిణామాలను గురించిన ప్రస్తావన ఉంటుంది.

చరిత్ర రచయితగా కూడా వెల్స్ ఒక నూతన ఒరవడి సృష్టించాడు. ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ, ఇతర శాస్త్ర సామాజిక అధ్యయనాలు, సైన్స్ ఆఫ్ లైఫ్, ది వర్క్, వెల్త్ అండ్ హేపినెస్ ఆఫ్ మాన్‌కైండ్‌లు, ఇరవయ్యో శతాబ్ది తొలి దశకాల్లో తీవ్రంగా చర్చోపచర్చల్ని రేకెత్తించాయి.

తోకచుక్కల నుండి వెలువడే విషవాయువుల ప్రభావాన్ని గురించి చెప్పిన నవల 'ఇన్ ది డేస్ ఆఫ్ ది కామెట్'. శాస్త్రజ్ఞులే లోకాన్ని పరిపాలిస్తే ఏమవుతుందో 'ది షేప్ ఆఫ్ థింగ్స్ టు కం'లో చర్చిస్తాడు. ఫాసిజం గురించి రాసి 'ది ఆటోక్రసీ ఆఫ్ మిస్టర్ పార్హాం', 'ది హోలీటెర్రర్'లలో పాఠకుల కళ్లు తెరిపించాడు.

మరో ప్రపంచ యుద్ధం రాబోతుందని 1934లోనే వెల్స్ చెప్పిన జోస్యం నిజమైంది.

జీవితాంతం మధుమేహ వ్యాధితో బాధపడిన వెల్స్ ఇప్పటి 'డయాబెటిస్ యు.కె' సంస్థాపకుడు.

పోట్లాట జరిగింది. 'మనిషి-జంతువులూ', మాంట్ గామరీ తన్నుకుంటారు. ఎవరో తోసినప్పుడు, ఒకరాయి తలకు తగిలి అతడు మరణిస్తాడు. అతణ్ణి రక్షించే ప్రయత్నంలో కిరోసిన్ దీపం దొర్లి గడ్డి అంటుకుంటుంది. పాకలూ, ప్రయోగశాలా, ఔట్‌హౌజ్ బూడిదవుతాయి.

ఇప్పుడు ప్రెండిక్ ఒక్కడే. వీలైనంత త్వరగా ద్వీపం దాటకపోతే ఆకలికి మాడి చావక తప్పదు. అయినా దారీతెన్నూ లేక మరో పదినెలలక్కడే గడుపుతాడు. చివరికి రెండు శవాలున్న ఓ పడవ అక్కడికి కొట్టుకొస్తుంది. వాటిని సముద్రంలోకి తోసి, పడవమీద బయల్దేరతాడు.

మరో మూడు రోజుల తర్వాత ఓ షిప్పు ప్రెండిక్‌ను రక్షిస్తుంది. జరిగిందంతా తోటి ప్రయాణికులకు చెప్పటానికి ప్రయత్నిస్తాడుగానీ వాళ్లు అతనికి మతి భ్రమించిందని సానుభూతి చూపిస్తారు. అడవుల్లో తప్పిపోయినప్పుడు యిలా జరగటం సహజమే. అందువల్ల జరిగిందేమో జ్ఞాపకం లేదని అబద్ధమాడతాడు.

ఇంగ్లండు చేరుకున్న ప్రెండిక్‌కు సాటి మనుషులు వింతగా కనిపిస్తారు. వీళ్లందరూ పరిణామదశలో వున్న మనిషి జంతువులే గదా! జంతువులు మనుషులుగా మారుతున్నాయా? లేక మనుషులు జంతువులుగా మారుతున్నారా?

అభివృద్ధి చెందుతున్న సాంకేతిక పరిజ్ఞానం మనిషికి మేలు చేస్తుందా? జీవన ప్రమాణాలు పెంచుతుందా? అలా జరగకపోతుంటే దానికి కారణమేమిటి?

అసలు శాస్త్ర, సాంకేతిక ప్రయోగాల లక్ష్యం ఏమైవుండాలి?

ప్రగతికి నిర్వచనం ఏమిటి? వగైరా, అనేక ప్రశ్నల్ని లేవనెత్తుతుందీ నవల.

పాఠకులు, ఎవరికి వారే వీటికి సమాధానాలు వెదుక్కోవాలి.

–ఎం.వసంత



# బహుముఖ ప్రతిభాశాలి శివరామ కారంత్

**డా. కోటా శివరామకారంత్ పేరు చెప్పగానే యక్షగానాన్ని సమున్నత శిఖరాలకు చేర్చిన కళోద్ధారకుడు గుర్తుకొస్తాడు. అన్ని ప్రక్రియల్లోనూ అగ్ర పంక్తిలో నిలిచే కృతుల ద్వారా కన్నడ సాహిత్యోద్యానంలో బహువర్ణ శోభిత కుసుమాలను వికసింపజేసిన సాహితీ మూర్తి స్మృతిలో మెదులుతాడు. విద్యావేత్తగా, పాత్రికేయుడిగా, నటుడిగా, దర్శకుడిగా, నిర్మాతగా, ప్రచురణకర్తగా, సంస్కర్తగా, స్వాతంత్ర్య సమరయోధుడిగా, పర్యావరణ వేత్తగా బహుముఖీన ప్రతిభాపాటవాలు ప్రదర్శించిన మహావ్యక్తి గోచరిస్తాడు. 'మూకజ్జియ కనసుగళు' నవలకు కారంత్ 1977లో జ్ఞానపీఠ పురస్కారం పొందాడు. ఈ గౌరవానికి పాత్రులైన కన్నడ సాహిత్యకారుల్లో కారంత్ మూడోవ్యక్తి.**

శివరామ కారంత్ కర్ణాటకలోని ఉడిపి జిల్లా కోటా గ్రామంలో 1902 అక్టోబరు 10న జన్మించాడు. తండ్రి శేషాకారంత్, తల్లి లక్ష్మమ్మ. వారిది పేద కుటుంబం. ఉపాధ్యాయుడైన తండ్రి తర్వాత బట్టల వ్యాపారిగా మారాడు. శివరామ కారంత్ కుందాపురలో పాఠశాల విద్య పూర్తిచేసి, మంగళూరు కళాశాలలో చేరాడు. మహాత్ముని పిలుపునందుకుని డిగ్రీ చదువు మానేసి స్వాతంత్ర్యోద్యమంలోకి దూకాడు. ఖాదీ, స్వదేశీ, పేదలకు సాయం, విధవా వివాహం, వేశ్యల విముక్తి, మద్యపాన నిషేధం, అహింస, హరిజనోద్ధరణ వంటి వాటిలో విశేష కృషి చేశాడు. తన ఆశయాలకు తగిన అంశాలను వస్తువుగా స్వీకరించి రచనలు చేశాడు. నవలలు, నాటకాలు వెలువరించాడు. 1924లో 'వసంత' పత్రికను ప్రారంభించి తన భావాలకు ప్రచార వేదికగా చేసుకున్నాడు. నాటక సమాజం ద్వారా ఆ రంగానికి దిశానిర్దేశం చేశాడు. ఆ రోజుల్లోనే 'లీల' అనే యువతిని వర్ణాంతర వివాహం చేసుకున్నాడు. నాటి విద్యా విధానం నచ్చక పుత్తూరు గ్రామంలో ప్రయోగాత్మక పాఠశాల నెలకొల్పి, దానికి అనుబంధంగా బాలభవన్ ఏర్పాటు చేశాడు. విద్యార్థుల్లో సమాజ సేవాభావాన్ని పెంపొందించాడు. పర్యావరణంపై దృష్టి కేంద్రీకరించి ప్రజల్లో చైతన్యం పెంపొందించాడు. యక్షగాన కళారూపానికి రెండు దశాబ్దాలకుపైగా పలువిధాల సేవలందించి, దానిని సంస్కరించి, జగద్విఖ్యాతి సమకూర్చాడు. పర్యావరణ సమస్య ఆధారంగా పార్లమెంటు ఎన్నికల్లో పోటీచేసి విజయం సాధించలేకపోయినా కించిత్తయినా బాధపడలేదు.

కారంత్ 'కర్ణార్జున' నాటకం 1927లో ప్రచురితమైంది. అప్పటి నుంచి ఆయన సాహితీ ప్రస్థానం ఏడు దశాబ్దాలపాటు సాగింది. తొంభై ఐదేళ్ల వయస్సులో పక్షులపై గ్రంథరచన చేసి సాహితీ ప్రపంచాన్ని విస్మయపరిచాడు. సమాజానికి ఎంత విస్తృతంగా సేవలందించాడో అంతే




మిన్నగా రచనలూ చేశాడు. వాటిలో సమాజాభ్యుదయాన్ని కాంక్షించాడు. కారంత్ నవోదయ సాహిత్యోద్యమ నిర్మాత. సరళ వ్యావహారికంలో కన్నడ కస్తూరి పరిమళాన్ని గుబాళింప చేశాడు. 1933 రచించిన 'చోమన దుడి' నవల కన్నడ సమాజాన్ని జాగృతం చేసింది. హరిజనుల దైన్య జీవనానికిది దర్పణం. కొద్దిపాటి భూమికోసం తపించి, జీవితాంతం శ్రమించి చివరకు ఆ ఆశ నెరవేరకుండానే కన్నుమూసిన అభాగ్య హరిజనుని గాథే ఈ నవల. వందలాది హరిజన

కుటుంబాల స్థితిగతుల్ని పరిశీలించి కారంత్ ఈ నవల రాశాడు. గాంధేయ సిద్ధాంతాల ప్రాతిపదికగా 'ఔదార్యద ఉరుళల్లి', గ్రామీణ జీవిత విశిష్టతను తెలుపుతూ 'మరళి మణ్ణిగె', గిరిజనుల గురించి 'బెట్టదజీవ', స్త్రీ సమస్యలపై అవగాహనకు 'ధర్మరాయన సంసార' తదితర నవలలను రాశాడు. ఇంకా 'సరసమ్మన సమాధి', 'కుడియర కూసు', 'అళిద మేలె', 'కేవల మనుష్యరు', 'మూకజ్జియ కనసుగళు' మొదలైన 42 నవలలు రాశాడు. 'హసివు', 'హావు' తదితర 4 కథా సంపుటాలు, 'సావిర మైలియ', 'జంబద జానకి', 'హేమంత', 'విజయ', 'దృష్టి సంగమ', 'కీచక సైరంధ్రి' మొదలైన 31 నాటకాలు, 'భారతీయ చిత్రకలె', 'కళా ప్రపంచ', 'భారతీయ శిల్ప', 'యక్షగాన' తదితర 14 కళాసంబంధ గ్రంథాలు, 'అపూర్వ పశ్చిమ', 'చిత్రమయ దక్షిణ హిందూస్థాన' వంటి ఆరు యాత్రా కథనాలు, 'గృహ విజ్ఞాన' (మూడు భాగాలు), 'బాల ప్రపంచ' (నాలుగు భాగాలు), 'విచిత్ర ఖగోళ' మొదలైన పన్నెండు విజ్ఞాన సర్వస్వాలు, వివిధ విషయాలపై రచించిన గ్రంథాలతో రెండు వందలకు పైగా రచనలు చేశాడు. ఇన్ని బృహద్రచనలు ఒకేవ్యక్తి వెలయించడం సాహితీలోకంలో అరుదు.

జ్ఞానపీఠ పురస్కృతి చేకూర్చిన 'మూకజ్జియ కనసుగళు' కారంత్ అద్భుత సృష్టి. 1968లో వెలువడిన ఈ నవల కారంత్ ఉత్తమ భావ జాలానికి అద్దం పడుతుంది. అనేకానేక సామాజికాంశాలపై తన అభిప్రాయాలను అభివ్యక్తం చేసేందుకు కారంత్ శక్తిమంతమైన భూమికగా నవలను మలచుకున్నాడు. ఇందుకు నవలా నిర్మాణంలో విలక్షణ శిల్పాన్ని స్వీకరించాడు. ఇతివృత్తం ఆశ్చర్యజనకంగా ఉంటుంది. పాత్ర చిత్రణ సైతం అదే రీతిలో సాగుతుంది. ప్రధాన పాత్ర మూకజ్జి. వయస్సు ఎనభై ఏళ్లు. పుట్టినప్పుడు మూకాంబిక దేవత పేరు పెట్టారు. ఆమె మనవడు సుబ్బన్న ఉత్తమ పురుషలో కథ చెబుతాడు. మూకజ్జిని అల్లారుముద్దుగా పెంచారు. 'మూకే' అని పిలిచేవారు. అపార ప్రతిభ ఆమె సొంతం. పదోయేట పెళ్లయింది. విధి వక్రించి కొన్ని నెలల్లోపే వైధవ్యం ప్రాప్తించింది. కొంత కాలం తల్లిదండ్రుల వద్ద ఉంది. తర్వాత అన్న ఆశ్రయం లభించింది. యవ్వనంలో కోరికలు చుట్టుముట్టాయి. ఆమె భావాలు, విశ్వాసాలు ఎంతో విలక్షణంగా రూపుదాల్చాయి. హేతువాదంతో అందర్నీ స్థాణువుల్ని చేసేది. శారీరక వాంఛలు, మానసిక సంఘర్షణలు విజృంభించేవి. కలలు కనేది. ప్రతి అంశాన్ని తన దృక్పథంతో అన్వయించేది. అవకాశమే దైవమనేది. ఊరిలోని కోటాలమ్మ గుడిలో ఆమె మాటలు నిష్ఠుర సత్యాలతో నిండి ఉండేవి. రెచ్చిపోయి పూనకం వచ్చినట్లు ప్రవర్తించేది. ఆనందం, కారుణ్యం, మానవత, ప్రేమ ముఖ్యమని మూకజ్జి భావించింది. జీవితానందం పొందాలని బాహాటంగా చెప్పేది. సంకుచితత్వాన్ని నిరసించేది. గ్రామస్థులు ఆమెకు ఉన్మాదిగా ముద్ర వేశారు.

కారంత్ ఈ నవలలో రామయ్య ఉపకథ చేర్చి మూకజ్జి క్రియాశీలతను నిరూపించాడు. రామయ్య క్రూర ప్రవర్తనను భరించలేక ఆమె భార్య మరొక పురుషుని పంచన చేరుతుంది. కానీ అక్కడా కష్టాలు తప్పవు. ఈ సంగతి తెలుసుకున్న మూకజ్జి రామయ్యను, భార్యను కలుపుతుంది. క్రమంగా మూకజ్జిలో అద్భుత భావనా శక్తి వర్ధిల్లుతుంది. లోకం తన అభిప్రాయం మార్చుకోసాగింది. మూకజ్జి ఏ వస్తువును స్పృశించినా దాని పుట్టుపూర్వోత్తరాలు చెప్పగలిగేది. సహస్రాబ్దాల చరిత్రను విశ్లేషించేది. ప్రజలు దాన్ని అతీంద్రియ శక్తి అనుకున్నారు. కారంత్ ఈ ఇతివృత్తాన్ని గొప్ప కళాఖండంగా మలిచాడు. అధిమానసిక స్థితిని ఆవిష్కరించిన సంవిధానం అసాధారణం. అందుకే ఈ నవల 1961-70 సంవత్సరాల మధ్య భారతీయ భాషల్లో వెలువడిన గ్రంథాల్లో ఉత్తమ రచనగా జ్ఞానపీఠ పురస్కారం అందుకుంది.

శివరామ కారంత్ కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, పంప పురస్కారం, తులసీ సమ్మాన్, స్వీడిష్ అకాడమీ గౌరవం అందుకున్నారు. భారత ప్రభుత్వం 'పద్మభూషణ్'తో సత్కరించింది. అయితే ఎమర్జెన్సీని ఖండిస్తూ కారంత్ దానిని వాపసు చేశాడు. కారంత్ పేరిట మంగళూరులో 'సెంటర్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' సంస్థ ఏర్పడింది. మూడు విశ్వవిద్యాలయాలు 'డి.లిట్' ప్రదానం చేశాయి. 87 మంది విమర్శకులు ఆయనపై గ్రంథాలు రచించడం సాహితీక్షేత్రంలో విశిష్ట స్థానాన్ని సూచిస్తాయి.

కన్నడ భాష ఉన్నంత వరకు మణిదీపాలుగా వెలుగులు చిమ్మే గొప్ప రచనలు అందించిన కోటా శివరామ కారంత్ 1997 డిసెంబర్ 9న ఉడిపి జిల్లా మణిపాల్‌లో పరమపదించారు.

**–గోవిందరాజు రామకృష్ణారావు**



# చతుర ప్రవేశిక



## ఏప్రిల్ - 2010

ఏప్రిల్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపిక చేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఎన్ని అవాంతరాలొచ్చినా సొంతఇంటిని కాపాడుకున్నదెవరు?
2. అమెరికాకు వెళ్లి కాస్త నల్లబడి, సన్నబడిందెవరు?
3. ఇంటిని అమ్మనందుకు పద్మజపై కోప్పడిన స్వామి ఎవరు?
4. ముగ్గురు భార్యల ముద్దుల మొగుడు?
5. వరలక్ష్మి అక్క, ఒకప్పుడు దర్జాగా బతికిన వ్యక్తి ఎవరు?
6. శివరామ కారంత్ రాసిన ఏ రచనకు జ్ఞానపీఠం లభించింది?
7. మంగళంపల్లి బాలమురళీకృష్ణ ఎవరివద్ద శిష్యరికం చేశారు?
8. సికింద్రాబాద్ ప్యారడైజ్‌లో తినాల్సింది ఏమిటి?
9. కుల దురాచారాన్ని ఎండగట్టిన ఇనాక్ నాటకం పేరు?
10. 'ది ఐలాండ్ ఆఫ్ డాక్టర్ మోరో' నవలలో హీరో పేరు?

---

పంపినవారి పేరు: -------------------------- వయసు ( )

చిరునామా: ------------------------------------

------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వి.నోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

